# సంస్కృతి
## సంక్షోభాలు - సంవాదాలు

(వ్యాస సంకలనం)

సంపాదకత్వం & సంకలనం

**గౌరవ్**

ప్రచురణ

**ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం**

ఆంధ్రప్రదేశ్-తెలంగాణ

"Art, Culture, Science can flourish only where no barriers are placed in the way of the Citizen's contact with the truth, with the objective reality, which is another way of saying that freedom of expression is basic to art and science. Protest must nourish art so long as people suffer injustice and wrong; for unless there is protest against these things the artist becomes the pimp and the handmaiden of reactions brutality, even as the scientist does.... I know that both these cases are extreme, but they nevertheles serve to delineate the cultural ethics of the fascist state.

.... No struggle is without its peril, but also no life is worth the living without struggle and goals and ideals. Man is not made to take his food like an ox in the meadow, castrated, head bowed, the field of his vision limited to a few blades of grass and a few hummocks of dirt; man is a proud and erect creature, and a million years have gone into the making of him. He cannot surrender this manhood and man-heritage supinely without becoming, once again, a beast in the field."

– Howard Fast

# సంస్కృతి
# సంక్షోభాలు - సంవాదాలు
# (వ్యాస సంకలనం)

సంపాదకత్వం & సంకలనం : గౌరవ్

ప్రచురణ : ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం

ముద్రణ : మార్చి, 2018

టైప్‌సెట్టింగ్ : సింహాద్రి

కవర్ డిజైన్ : అమర్ నంద్యాల

కొటేషన్స్ కర్టసీ : జి. కళ్యాణ్‌రావు, అంటరాని వసంతం

విజ్ఞప్తి
ఇందులోని వ్యాసకర్తల అభిప్రాయాలన్నింటితోను
సంపాదకునికి ఖచ్చితంగా అంగీకారం ఉండవల్సిన అవసరం లేదు.

విరాళం : రూ. 100/-

ప్రతులకు : గౌరవ్ - 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

# విషయ సూచిక


కృతజ్ఞతలు 5

అంకితం 6

ప్రస్తావన - గౌరవ్ 7

ముందుమాట - డా॥ చిరంజీవినీ కుమారి 10

ఒకమాట - డా॥ చెలికాని స్టాలిన్ 11

సంస్కృతిపై చర్చించుదుకంటే.. - కట్టా కృష్ణారావు 12

## మొదటి భాగం

1. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు - భావోద్యమాల కర్తవ్యం –రావిపూడి వెంకటాద్రి 15
2. సంస్కృతి అంటే... - ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు 21
3. జాతీయోద్యమం సంస్కృతి–పూర్వరంగం –డా॥ వకుళాభరణం రామకృష్ణ 32
4. సంస్కృతి - డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి 36
5. సంస్కృతిలో మిగుల్చుకోవలసినవీ–వదుల్చుకోవలసినవి. - దివికుమార్ 40
6. ఏది ప్రజా సంస్కృతి? - శాంతారావు 46
7. ప్రజా సంస్కృతి - ప్రధాన అవరోధాలు - గౌరి 50
8. సైన్సు - సంస్కృతి - డా॥ నాగసూరి వేణుగోపాల్ 58
9. భాషా సంస్కృతుల పరాయీకరణ - ఆచార్య జయధీర్ తిరుమలరావు 62
10. సంస్కృతి - కళ - సాహిత్యం - డా॥ పాపినేని శివశంకర్ 69
11. కళ - మార్కెట్ - సంస్కృతి - దేవి 77
12. సంస్కృతి అనగా? - డా॥ మలయశ్రీ 88
13. ఏది భారతీయ సంస్కృతి? - కె. అయ్యన్న 90
14. పెరిగిపోతున్న ఫాసిస్టు సాంస్కృతిక ఉన్మాదం - అరణ్య 93

## రెండవ భాగం

15. మన సంస్కృతి - దేవరకొండ బాలగంగాధర తిలక్ 107
16. సంస్కృతం - సంస్కృతి - నార్ల వెంకటేశ్వరరావు 109
17. సంస్కృతీ సమస్య - కొడవటిగంటి కుటుంబరావు 116
18. ఏది సంస్కృతి - చలసాని ప్రసాద్ 120
19. గిరిజనులూ - గిరిజన సంస్కృతి - బాలగోపాల్ 127
20. సమైక్యతకు ప్రతీక జానపద సంస్కృతి - యాసలపు సూర్యారావు 141

మనమేం చేయొచ్చు? 143

# కృతజ్ఞతలు

సాంస్కృతికోద్యమ మిత్రులు, ఈ కృతికి ప్రధాన ప్రేరకులు **డా॥ చెలికాని స్టాలిన్, రావెల సోమయ్య, కట్టా కృష్ణారావు, డా॥ ప్రదీప్, డా॥ చల్లా రవికుమార్, డా॥ చిరంజీవినీ కుమారి, శాంతారావు, దేవి గార్లకు,**

97 సం॥రాల వయస్సులో ఉండి నేనో లేఖ రాయగానే స్పందించి 'హేతువాది'లో లేఖ ప్రచురిస్తూ స్పందనగా సంపాదకీయం రాసిన చిరకాల మిత్రులు **రావిపూడి వెంకటాద్రి** గారికి,

ఎన్నో పనుల ఒత్తిడి మధ్య నలుగుతూ కూడా విలువైన వ్యాసాలు రాసి పంపిన **వకుళాభరణం రామకృష్ణ, రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, నాగసూరి వేణుగోపాల్, మలయశ్రీ, అలాగే వారి వ్యాసాల్ని అందించిన దివికుమార్, పాపినేని శివశంకర్ జయధీర్ తిరుమలరావు, అయ్యన్న గార్లకి,**

తొంభై ఎనిమిదేళ్ళ వయసులో కూడా ఈ ప్రాజెక్ట్ విషయం చెప్పగానే ఉత్సాహంతో ప్రోత్సహించిన **వెలమాటి సత్యనారాయణ, ఇంకా టి. రవిచంద్, బి. రాధాకృష్ణ మూర్తి గింజాల నరసింహారెడ్డి, పి.యస్. రవికాంత్, దాడి గంగాధరరావు, గోపు చంద్రరావు, ఏడిద రాజేష్, రాంకీ** మొదలగు పెద్దలందరికీ,

# అంకితం



జానపద వాఙ్మయోద్ధారకుడు, ప్రజా సంస్కృతీ పరిరక్షకుడు

అక్షర సేవకుడు, సాహితీ జ్యోతి

**నేదునూరి గంగాధరం** గారికి... వినమ్రంగా,

# ప్రస్తావన

పోర్ట్‌బన్ అనేది కేటలోనియాలోని తీరప్రాంత పట్టణం. ఫ్రెంచ్-స్పానిష్ సరిహద్దులో ఉన్న ఆ పట్నంలో వాల్టర్ బెంజిమన్ సమాధిపై జర్మన్‌లో రాయబడ్డ మాటలుంటాయి;

*"There is no document of culture which is not at the same time a document of barbarism."*

మనిషి అనాగరికత అతడి అసహనంలో తెలుస్తుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని సమున్నతంగా ఇముడ్చుకున్న సమాజం మాత్రమే సహిష్ణుతని సంస్కృతిలో వెదజల్లగలుగుతుంది. మానవీయ సంస్కృతికి మచ్చుకో రూపమది.

ఈరోజు అన్ని స్రవంతుల్లోనూ అసహనం బుసలు కొడుతోంది. మతోన్మాదం రాజ్యమేలుతూ నియంతృత్వాన్ని అమలు చేస్తోంది. ఇలాంటి సమయంలో ప్రజాతంత్ర అభివ్యక్తియొక్క అవశరం మరింత పెరిగింది.

జీన్‌పాల్ సార్త్రే ప్రపంచంలోనే అత్యుత్తమ పురస్కారంగా భావించబడే నోబుల్‌ని తిరస్కరిస్తూ స్వీడిష్ ప్రెస్‌కి వివరణ ఇస్తూ 'సంస్కృతుల సంఘర్షణ' *(Contradiction between the two cultures)* ను వెల్లడిస్తాడు.

మేధావి మేధస్సు కానీయండి, కళాకారుడి కళ కానీయండి, తత్వవేత్త అన్వేషణ కానివ్వండి అంతిమంగా జవాబుదారీ కావాల్సింది ప్రజానీకానికే కాని ప్రభుత్వాలకి కాదని *"As an Artist I am against to every State"* అంటాడు జేమ్స్‌జాయిస్.

అలా అసహనం అధికారం రూపంలో విషం చిమ్ముతున్న వేళ అభివ్యక్తికి భరోసా ఇచ్చే గళాలు, కలాల బాధ్యత మరింత పెరుగుతుంది. మాటలే కాదు; మరణం కూడా మట్లాడుతుంది. ప్రఖ్యాత గ్రీకు గ్రంథకర్త హెయిన్ తన సమాధిపై ఆయుధాన్ని చిత్రించమన్నాడు.

ప్రజా తత్వవేత్త నమ్మల్వార్‌ని ఆయన మరణానంతరం సమాధిపై ఏం రాయమంటారని ఎవరో అడిగారట. దానికాయన 'ఎందరికో నిద్రలేకుండా చేసినవాడు ఇక్కడ ప్రశాంతంగా నిద్రపోతున్నాడ'ని రాయమన్నారట!

అభివ్యక్తికి భయపడి మేధావులు, ఆలోచనాపరులు, కళాకారులపై దాడులు చేస్తున్న అసహనపరుల చేతలకి నిరసనగా వారందరి హత్యలని ఖండిస్తూ, జనించిన అక్షరాయుధాల సంకలనమిది.

అక్షరాల సాక్షిగా చెబుతున్నాం,

**అభివ్యక్తి అజరామరం!**

సంస్కృతి మానవాళి జీవనాడి.. మంచినీటి నదిలా దానిని ఎప్పటికప్పుడు పారదర్శకంగా, ప్రవాహశీలంగా ఉంచుకోవడం వ్యవస్థకి ఆరోగ్యం. మనిషిని మానసిక పతనాన్నుండి సంరక్షించేది సచేతనమయిన సంస్కృతి మాత్రమే. సత్యాన్వేషణ స్ఫూర్తితో సజ్జనులు చేసే సంవాదాలు కావొచ్చు, ఆధ్యాత్మిక ఆర్తితో అవధూతలు చేసే సదాచారాలు కావొచ్చు; ఆస్తికత్వం, నాస్తికత్వం, మధ్యేమార్గం... అన్నీ సంస్కృతిలో భాగమే. సంస్కృతి పదజాలంతో రాదు, భిన్న భావజాలాల కలయికతో పుడుతుంది. విభిన్న భావాల సంఘర్షణల్లో జీవిస్తుంది. ఘర్షణ గతి నియమం. పురోగమనానికి అదో తప్పనిసరి ప్రమాణం. హేతుబద్ధమయిన ప్రమాణాన్ని పాటించడం ద్వారానే మానవీయ సంస్కృతీ, సదాచార ప్రమాణాలనేవి సాధ్యపడతాయి. సమాజాన్ని ఎప్పటికప్పుడు సజీవంగా ఉంచేవి సాంస్కృతిక వికాసం కొరకు మనిషి చేసే అవిరామ ప్రయత్నాలే. అలాంటి సంస్కృతి జీవనది. దానిని వీలైనంత ఉన్నత విలువలతో నిర్మించుకోవడం సాంస్కృతిక కార్యకర్తలకే కాదు, మనుషులందరి నైతిక విధి.

1977 నవంబరు అరుణతారలో సంస్కృతి గూర్చి రాస్తూ, **"స్మశానం దిబ్బల మీద నగ్ననాట్యం చేసే ఈ సంస్కృతి భూస్వామ్య సంప్రదాయానికీ బూర్జువా నాగరికతకూ పుట్టిన అక్రమ సంతానం. ఏ ప్రపంచానికీ చెందని వింత పశువు."** అంటాడు ప్రజా ఉద్యమకారుడు సి.వి. సుబ్బారావు. ఆ మాటల్ని నిజం చేస్తూ 80వ దశకంలో మొదట 29 సం॥రాల యువ జర్నలిస్టు ఎన్‌కౌంటర్ దశరథరామ్‌ని 20 కత్తిపోట్లతో హత్య చేయడం జరిగింది. కొద్ది రోజులకే దేశం బిత్తరపోయేలా ప్రజాప్రయోక్త, కళాకారుడూ సఫ్దార్ హష్మీని పట్టపగలే చంపేశారు. అదక్కడితో ఆగలేదు. కార్పొరేట్ కంపెనీలకి ముచ్చెమటలు పట్టించి శ్రమజీవుల సంక్షేమం కోసం జీవితాంతం పాటుపడిన శంకర్ గుహ నియోగిని కూడా దారుణంగా బలికొన్నారు. ఈరోజు నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, కల్బుర్గి, గౌరి లంకేష్‌లదాకా ఈ దుర్మార్గమయిన ద్వేషం బుసలు కొడుతూనే వుంది. అయినంతలో దానిని నిలువరించడం ప్రగతిశీల శక్తుల తక్షణ కర్తవ్యం.

అటువంటి ఆలోచనలతోనే, 2017, జూలై నెల 30వ తేదీన మిత్రులు **"ప్రజా సంస్కృతి–ఎదుర్కొంటున్న సవాళ్ళు – కళాకారుల కర్తవ్యం"** అనే విషయంపై కాకినాడలో సదస్సు నిర్వహించారు. ఎంతోమంది దానికి హాజరై వారి విలువయిన అభిప్రాయాలను వెల్లడించారు. సాంస్కృతిక రంగంలో పనిచేయవలసి ఉందన్న

నిజాన్ని అంతా అంగీకరించారు. నిజానికి అంతకుముందే గోదావరి జిల్లాలలో సాంస్కృతిక వికాసం కొరకు వివిధ సంఘాలతో కల్సి పెద్దాపురం, దివిలి, తాటిపర్తి, రాజమండ్రి మొదలైన చోట్ల కార్యక్రమాలు అడపాదడపా జరుగుతున్నాయి. మిత్రులు శక్తిమేరకు కృషి చేస్తున్నారు. ఎంతోమందిని భాగం చేయడం ద్వారా ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతి నిర్మాణానికి తోడ్పడుతున్నారు. వారందరి ప్రయత్నంలోని నిజాయితీ వ్యక్తిగతంగా ఎంతోకొంత నన్ను కదిలించింది. సాంస్కృతిక రంగం నుండి విడివడి ప్రత్యేకంగా సామాజిక మార్పు కోసం జరిగే ప్రయత్నాలంటూ ఏవీ ఉండవు. ఈ విషయాలపై లోతయిన చర్చలు అవసరం. అలాంటి వాతావరణాన్ని కూడా ధ్వంసం చేస్తున్న వినిమయిదారీ సంస్కృతిని వీలైనంత సమిష్టిగా ప్రతిఘటించడం ఈనాటి తక్షణావశరం.

అందులో భాగంగా వివిధ సంక్షోభాలకు గురౌతున్న సంస్కృతిని సంరక్షించే మార్గంలో ఇదో చిరు ప్రయత్నంగా ఈ సంకలనాన్నిలా వెలువరిస్తున్నాం. స్తబ్ధత రాజ్యమేలుతున్నచోట అమానవీయ ఉన్మాదాలకి సచేతన సంస్కృతి మాత్రమే సమాధానం కాగలదు. అలాటి సమర్ధవంతమయిన సమాధానాలిచ్చే సంస్కృతి నిర్మాణమే ప్రధాన భూమికగా వెలువడుతున్న ఈ చిన్ని సంకలనం ఏదోమేరకు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో తన శక్తిమేర పాత్రను నిర్వహిస్తుందని నమ్ముతున్నాను. ఆలస్యంగానయినా స్పందించి అభిప్రాయాలని వ్యాసాలుగా రాసిచ్చిన వారందరికీ వీట్ని ముద్రించినవారికీ పేరుపేరునా ధన్యవాదాలు. ఆర్ధిక భారం వల్ల పని ఒత్తిడి వల్ల ఆలస్యమైనప్పటికీ, పాత కొత్త వ్యాసాల కలయికగా వచ్చిన ఇదో స్వల్పయత్నం మాత్రమే. భవిష్యత్తులో సారవంతమయిన సారస్వతం కొరకు మరిన్ని మంచి ప్రయత్నాలు జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ ఈ కృతినిలా గ్రంథరూపంలో తీసుకురావడానికి సహకరించిన మిత్రులు శ్రేయోభిలాషులందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటూ... కృతిలోకి స్వాగతం.

డిసెంబర్ 2017

– గౌరవ్
పిఠాపురం

# ముందుమాట

– డా॥ పి. చిరంజీవినీ కుమారి
(తూ.గో.జిల్లా రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి, కాకినాడ)

సమాజంలో సంక్షోభాలు తలెత్తిన ప్రతీ సందర్భంలోనూ కూడా మొదట సంస్కృతిపైనే దాడులు జరుగుతాయి. సంస్కృతిపై దాడి అంటే ఆ సమాజం యొక్క మూలాలు, ఉనికి, ప్రత్యేకతలపై అణిచివేత అని భావించాలి.

మన దేశంలో నేడు మనం చూస్తున్న పరిస్థితిలో భారతీయుల జీవన విధానం, మానవీయ సంబంధాలు, భిన్నత్వంలో ఏకత్వం అనే తాత్విక చింతన అత్యంత ప్రమాదానికి లోనవుతున్నట్లు కనపడుతుంది. భిన్న భావజాలాలతో, అనేక విశ్వాసాలతో, ప్రత్యేకతలతో కూడిన జీవన శైలులతో, శాంతియుత జీవనం అనే ఒక అపూర్వమైన బంధంతో నివసిస్తున్న భారత పౌరులు నేడు "విభజించి పాలించు" అనే ప్రమాదకరమైన రాజకీయ సూత్రం ఆధారంగా పాలకవర్గాలు, ఆ వర్గాల అరాచక శక్తులు చేస్తూన్న భౌతిక, మానసిక నియంతృత్వానికి లోనవుతున్నారు.

ఇటువంటి చారిత్రక మలుపులో వచ్చిన ఒక మంచి వ్యాస సంకలనం **"సంస్కృతి, సంక్షోభాలు – సంవాదాలు"** మిత్రులు గౌరవ్ నేతృత్వంలో వెలువడినది. అనుభవం, అధ్యయనం, లోతైన అవగాహనా కలిగిన ఆలోచనాపరులు ఈ గ్రంథంలో వ్యాసాలు రాసారు.

అన్ని వ్యాసాలలోనూ ఈనాటి అసహనం, మతోన్మాదం, ప్రజ్వరిల్లుతూ నియంతృత్వానికి దారితీసే ప్రమాదకరమైన ధోరణికి ప్రత్యామ్నాయాలు, ప్రతిఘటనలూ, పరిష్కార మార్గాలు సూచించే విధంగా చర్చలు జరిగాయి.

రచయితలు, కళాకారులు, మేధావులు, విమర్శకులు మరింత ఆత్మవిశ్వాసాన్ని ధైర్యాన్ని పుంజుకొని, తలెత్తి అరాచకాన్ని పశ్నించి, సమాజంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిలబెట్టే ప్రజాస్వామిక తత్వాన్ని పెంపొందించుకోవడానికి ఈ గ్రంథం ఒక మంచి పనిముట్టు. ఈ ఆయుధాన్ని చేతపుచ్చుకొని సంస్కృతి పరిరక్షకులు, ప్రగతిశీల రచయితలూ మరింత శక్తితో ముందుకు సాగగలరని, మిత్రుడు గౌరవ్ ఇటువంటి సంకలనాలు మరిన్ని తీసుకురాగలరని భావిస్తూ, ప్రచురణ కర్తలకు నా అభినందనలు.



# ఒకమాట

**– డాక్టర్ చెలికాని స్టాలిన్** (ఆర్.కె. ఐడియలాజికల్ & ఫిలాసఫికల్ సొసైటీ, రామచంద్రపురం)

సంస్కృతి అనే అంశం గురించి వ్యాస సంకలనం రావడం అభినందనీయం. వ్యాసాలు రాసిన రచయితలకు, శ్రమకోర్చి సేకరించిన మిత్రులు కృష్ణారావు, గౌరవ్‌లకు, స్ఫూర్తినిచ్చిన డా॥ చిరంజీవినీ కుమారి, శాంతారావు గార్లకు కృతజ్ఞతలు. గతంలో జరిగిన ఒక సెమినార్‌కు కొనసాగింపే ఈ సంకలనం.

సంస్కృతి అనే పదానికి అనేక అర్థాలు ఉన్నాయి. నిర్వచనాలు ఉన్నాయి. సామాన్యంగా కళారంగం, మతభావనలు, వాటి ద్వారా సంక్రమించిన సాంప్రదాయాలు, వీటినే "సంస్కృతి" గా గుర్తిస్తూ ఉంటారు. కానీ వాస్తవానికి "సంస్కృతి" అనే పదాన్ని ఇంకా విస్తృతంగా నిర్వచించవలసిన అవసరం ఉంది.

మానవ సమాజ అభివృద్ధి క్రమంలో పెంపొందించుకొన్న భావాలు, నైపుణ్యాలు, విలువలు సంస్కృతిగానే గుర్తించబడతాయి. అవి ఒక జీవన విధానంగా, ఒక ఆలోచనా విధానంగా గుర్తించబడతాయి. సంస్కృతికి ఉండవలసిన ప్రధాన లక్షణం మానవీయత. అభ్యుదయం వైపు ప్రయాణించడం ప్రధాన లక్ష్యం. మానవుడే తన సంస్కృతి నిర్మాత. సంస్కృతి యొక్క లక్షణం, లక్ష్యం ఆ సంస్కృతి యొక్క మంచి, చెడ్డలను నిర్ణయిస్తాయి.

మానవజాతి తన అభివృద్ధి క్రమంలో సంస్కృతిలో ఉండే ఏదో ఒక పార్శ్వం మొత్తం సంస్కృతిని ప్రభావితం చేస్తూ ఉంటుంది. ఒకనాడు "మతం" ఆ పాత్ర పోషించింది (రాచరికపు వ్యవస్థ, భూస్వామ్య వ్యవస్థలలో). దాని ఆధారంగానే ఆనాటి వ్యవస్థలో ఇతర సాంస్కృతిక విభాగాలు జాతి జీవనాన్ని నడిపించాయి. తరువాత ఏర్పడిన పెట్టుబడి దారీ విధానంలో "డబ్బు" కీలక పాత్ర వహిస్తోంది. దాని ఫలితంగానే అన్ని రంగాలలోను వ్యాపార దృష్టి ప్రబలింది.

గత మూడు దశాబ్దాలుగా మన సమాజంలో వచ్చిన భౌతిక మార్పుల వలన, ఈనాడు సాంస్కృతిక విభాగాలన్నీ అటు డబ్బు, ఇటు మతం ప్రభావాలకు లొంగిపోతున్నాయి. ప్రస్తుతం అభద్రతాభావం, అసమానతలు పెరిగి సమాజం తీవ్ర సంక్షోభానికి లోనవుతోంది, జాతీయ పునరుజ్జీవనం పేరుతో ఫాసిజపు ప్రమాద ఘంటికలు మ్రోగుతున్న కాలమిది.

ఈతరుణంలో "సంస్కృతి" మీద అధ్యయనం వివిధ సాంస్కృతిక రంగాలలో మన కృషి పెరగవలసిన అవసరం ఎంతైనా ఉంది.

దోపిడి, పీడనలేని ఒక మంచి సమాజం మానవజాతికి అసలైన లక్ష్యం.

ఆ లక్ష్యసాధనకు ఈ వ్యాస సంపుటి కొంతమేరకైనా దోహదపడగలదని ఆశిస్తున్నాను.



# సంస్కృతిపై చర్చెందుకు?

**– కట్టా కృష్ణారావు** (సాంస్కృతికోద్యమకారులు, కాకినాడ)

ఒకానొక ప్రాంతంలో నివసించే కొందరు కలిసి మాట్లాడుకోవడం, ఆలోచించడం, ఆమోదయోగ్యమైన పనులకు ఒడంబడిక చేసుకోవడం, ఆ అలవాట్లను ఆచారాలనుకోవడం... అలా ఒక జీవన పద్ధతిని సృష్టించుకొనేదే సంస్కృతి. అనేక సంఘటనలు, అనుభవాలు, ఇతరుల అనుభవాలతో భావ సంఘర్షణలో వాటిలో మార్పు ఏర్పడితే ఆ సంస్కృతి నిరంతర మార్పుకు కారణమవుతుంది. జీవ లక్షణాన్ని కొనసాగిస్తుంది.

సివిలైజేషన్, కల్చర్ అనే ఇంగ్లీషు పదాలు సమానార్థకాలుగా నాగరికత, సంస్కృతి అని మనం ఉపయోగిస్తున్నాం. బాహ్యమైనది నాగరికత, అంతర్లీనమైనది సంస్కృతి అంటారు సంజీవ్‌దేవ్.

భౌతిక, మానసిక జీవితాల అభివృద్ధి క్రమచరిత్ర, స్థిరీకరించిన అభివృద్ధి క్రమాన్నే నాగరికత అనొచ్చు. క్రోబర్, క్లుక్‌హన్ మొదలైనవారు సంస్కృతిని ఒక విధమైన జీవన విధానం (A way of life), ఉత్తమ స్థాయి ఎక్సలెన్స్ (Excel-lence), సంస్కారం పొందినది. (Refinement) అంటున్నారు. నాగరికత సుఖ జీవన ప్రమాణం, సంస్కృతి సంస్కార ప్రమాణం. ఈ రెండూ ఒకదానికి మరొకటి సంబంధం లేకుండా ఉండవు. పరస్పరాధారితాలు.

ఒక దేశ సంబంధంగా నాగరికతని పిలుస్తున్నారు. భారతదేశ నాగరికత, చైనా నాగరికత, ఆసియా నాగరికత, పాశ్చాత్య నాగరికత, యూరప్ నాగరికత, అమెరికన్ నాగరికత, మెసపుటేనియన్ నాగరికత, బాబిలోనియన్ నాగరికత, ఈజిప్షియన్ నాగరికత, సింధూ నాగరికత....

అలానే హిందూ సంస్కృతి, ముస్లిం సంస్కృతి, పంజాబీ సంస్కృతి, గుజరాతీ సంస్కృతి, మహరాష్ట్రీయ సంస్కృతి, తెలుగు సంస్కృతి, బెంగాలీ సంస్కృతి అని పిలుచుకుంటున్నాం. అందుకోసం మనం సరైన దృక్కోణంవైపు ఆలోచన చేస్తున్నామా? లేదా? అనే ప్రశ్నలు వేసుకోవడానికి, చర్చించడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండాల్సిందే.

దీనిని బట్టి ఒక పరిమిత కాలంలో, భౌగోళిక సరిహద్దుల్లో ఒక భాషను మాట్లాడే ప్రజల్లో అనుసరించే పద్ధతుల్లో, అలవాట్లలో, మతంలో, ఆధ్యాత్మిక విషయాల్లో సాధించిన మార్పుల్ని సంస్కృతి అని పిలవడం సమంజసం అంటున్నాం.

Some people regard culture as a purely a matter of intellectual and spiritual values in the sense of religion, philosophy, legal systems, literature, art, music and the like. Sometimes this is extended to include refinements in the manners of the ruling class. అని డి.డి. కోశాంబి అభిప్రాయము.

అందుచేత సంస్కృతి, నాగరికతల ప్రభావం వ్యక్తులపైనా, వ్యక్తుల ప్రభావం, నాగరికత, సంస్కృతులపైనా ఉంటుంది. శాస్త్ర సాంకేతిక విస్ఫోటనం, ప్రింట్ మీడియాలు, కళలు, సాహిత్యం, సంగీతం, ప్రసార మాధ్యమాలు, ప్రచార మాధ్యమాలు, వ్యాపారం, దోపిడీ, మోసం, దగా, కుట్రలు, రాజకీయం, ఆర్థిక విధానం... అన్నీ సాంస్కృతిక రంగంపై ప్రభావం చూపిస్తూనే ఉన్నాయి. మార్పుకు గురిచేస్తూనే ఉన్నాయి. క్రమ, అక్రమ పద్ధతులు కావచ్చు, తప్పొప్పుల చెరిపివేతలే కావచ్చు, నీతి, అవినీతిలకతీతం కావచ్చు, విచక్షణ పెరిగేకొద్దీ విజ్ఞానం పెరిగేకొలదీ, మానవీయత పరిఢవిల్లాలి కాబట్టి మంచి సమాజం, మంచి జీవన విధానం కావాలని ఆశించే వారందరూ మంచికి ప్రోత్సాహమూ, చెడుపై వ్యతిరేక పోరాటమూ చేయక తప్పదు. లేకుంటే మానవీయ సంస్కృతిని మట్టుబెట్టే విష సంస్కృతి పెరిగి మానవ జీవనాన్ని నందనవనంగా మార్చవలసిన నాగరికత వికృత రూపంలోకి దిగజారిపోతుంది. అలాకాకుండా ఉండాలంటే, ఎప్పటికప్పుడు వ్యవస్థను జాగృతపర్చే ప్రయత్నాలవసరం ఎంతైనా ఉంది.

సమాజంలోని వివిధ స్రవంతులు అనగా కళ, సాహిత్యం, మతం, తత్వం, అనుభూతి, అభివ్యక్తి, అనుభవం మొదలైనవి వ్యక్తిగతమయినవి. ఐతే, ఎవరికి వారు సత్యాన్వేషణ అనేది లేకుండా, చర్చకు సిద్ధం కాకుండా భావాల్ని వ్యవస్థంతటికీ రుద్దాలని ప్రయత్నించడమనేది నియంతృత్వ పోకడ. భావ సంఘర్షణ జరిగి సత్యమని తేలినదానిని ఎవరైనా అంగీకరించాల్సిందే. అలా కాక నిర్హేతుకమయిన అభిప్రాయాలన్నింటినీ ఏ వ్యక్తయినా సమాజంపై రుద్దడం తిరస్కరించాల్సిందే. ఏది సహేతుకమో ఎప్పటికప్పుడు చర్చ జరిగి సామాజికాభివృద్ధి జరగాల్సిందే. అందుకోసమే సంస్కృతిపై ఈ చర్చ అవసరమని భావించి విభిన్న రంగాలలో నిష్ణాతులైన వ్యక్తుల వ్యాసాల్ని ఇలా సంకలనంగా తీసుకురావడం జరుగుతోంది. సహృదయులైన పాఠకులు చదివి మీ అమూల్యమైన అభిప్రాయాలు తెలియజేస్తారని కోరుతూ.... సెలవ్.



# 1. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు భావోద్యమాల కర్తవ్యం

**– రావిపూడి వెంకటాద్రి** (ఛైర్మన్: భారత హేతువాద సంఘం, చీరాల)

## సంస్కృతి (Culture) – నాగరికత (Civilisation)

సంస్కృతి అంటే ఒక విధంగా వున్న దానిని సంకల్పించి మార్పు చేయడం. ఇందులో మానసిక చర్య పాత్ర వుంది. ప్రాకృత భాషను సంస్కరించగా యేర్పడిన భాషే కదా సంస్కృతం, అయినా, ఆ సంస్కృతం ఎక్కడ పడవేస్తే అక్కడనే పడివుండిపోయే గొంగళిలాగా అనేక అభూతకల్పనలతో సాహిత్యాన్ని సృష్టించి సంస్కారానికి చీలకొట్టింది. కాన, భావ సంస్కరణకు ఎదురీది సంస్కృతి శబ్దానికే బిరడా బిగించింది సంస్కృత భాష.

కాని, సంస్కృతి భావ సంస్కరణలకు చెందిన పదమేకాని, మనుషుల అలవాట్లకు, ఆచార సంప్రదాయాలకు, వేషభాషలకు చెందినది కాదు. భావాలు కూడా తరాల వెంబడి మారుతూనే వున్నాయి. అయితే అవి పురోగతిలోనా, తిరోగతిలోనా అనే విషయమే ఆలోచించదగిన సంగతి. మార్పు మంచి వైపుకా, చెడువైపుకా అని తెలుసుకోకుండా కేవలం మార్పునే సంస్కృతిగా పరిగణించడం సరికాదు. అంతా మారుతున్నది కాబట్టి, అంతా సంస్కృతే అని తీర్మానించుకోవడం గుడ్డెద్దు చేనులో పడిన సామెతను గుర్తు చేస్తుంది. **వైజ్ఞానిక ప్రగతిని సాధించేదిశగా, మానవ సంక్షేమానికి అనువైన విధంగా మార్పు సాధించేది మాత్రమే సంస్కృతి. సాంస్కృతిక విప్లవమంటే భావ విప్లవమే. సాంస్కృతిక పునరుజ్జీవనమంటే భావ పునర్వికాసమే. రినైజాన్సే (renaissance) కాని, మతపునరుజ్జీవనం (revivalism) కాదు. హేతువాద మానవవాద ఉద్యమాలు ఊకదంపుడు సంస్కరణతో సరిపెట్టుకోవు. ప్రగతి విరోధులు, పురోగతి నిరోధకులు రాజకీయ పార్టీల పేరుతో అధికార పీఠాలపై కొలువుదీరి, అటు మతాలను, ఇటు భావదాస్యాన్ని పోషిస్తూంటే, దాన్ని నిషేధించండి, దీన్ని నిషేధించండి అంటూ వారిని అభ్యర్థించే ఉద్యమాలు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలెలా అవుతాయి? అంటే, అలాంటి పీఠాధిపతులు ఇంకా ఆ పీఠాలపై కొనసాగాలని ఈ ఉద్యమకారుల లక్ష్యమా? పాలకుల్లో జ్యోతిష్యానికి, వాస్తుకు, మంత్రతంత్ర మహిమలకు, దేవుళ్ళ దర్శనాలకు బలికాని**

**వారెందరు? వారిని దేబిరించడమేనా భావవిప్లవోద్యమాల లక్ష్యం? అదేనా సంస్కృతి. సంస్కృతి అనేది మనుషుల కట్టు, బొట్టులకు సంబంధించింది కాదు. ఆ కట్టు, బొట్టులకు సంబంధించిన దాన్ని నాగరికత అంటాం.**

ఇంత విశాల ప్రపంచంలో ఏ యేడెనిమిది దేశాల్లోనో నాలుగైదు వేలయేండ్లనాడు రాజరికాల ప్రాభవంతో నాగరికత విలసిల్లినట్లు మనకు అందిన చరిత్ర చెపుతుంది. **నాగరికత అంటే నగరంలోని మనుషుల జీవన విధానమనే అర్థం.** ఆ నగరాల అధిపతులంతా రాజులూ, రాణులూ, వారి మంత్రులూ, యితర సిబ్బందీ, దాసదాసీలూ, సైనికులూ, ఉత్పత్తిదారులూ, యితర ఉద్యోగులూ అంతా పరాన్నజీవులే. అందరివీ కట్టూబొట్టే తరహా నాజూకు వేషాలే. వారే నాగరికులంటే.

ఈనాటి ప్రపంచంలో వందలాది నగరాలు, వేలాది పట్టణాలు వున్నాయి. వీటిలో వుండే వారంతా నాగరికులే. భావసంస్కారం లేకున్నా వీరిని నాగరిక శబ్దానికి దూరం చేయడానికి వీలులేదు. ఐతే, గతంలోని రాజరికాలు చుట్టుపక్కల వున్న పల్లెపట్టు ప్రజలపై పన్నులు విధించి తాము నాగరికతకుపునాది వేశామనుకున్నారు. వారికి ఆనాడు యుద్ధాలు చేయడానికి కర్రలు, కత్తులు, విల్లంబులు ఉపయోగపడ్డాయి. ఈ దేశంలో సింధూ, ఆఫ్రికాలో ఈజిప్షియన్, మెక్సికోలో మాయన్ నాగరికతలు ఇంకా కొద్దిచోట్ల యితర నాగరికతలు విలసిల్లాయి. కాగా, ఈజిప్షియన్, మాయన్ నాగరికులకు ఖగోళ పరిశీలనకు ప్రయోగశాలలు (అబ్జర్వేటరీస్) వున్నట్లు చరిత్ర చెబుతుంది. ఈనాటి పాలకుల నాగరిక స్థితి అది కాదు.

శాస్త్ర విజ్ఞానం గత మూడు నాలుగు శతాబ్దాలుగా విపరీత వేగంతో పెరుగుతూ వస్తున్నది. దాన్ని అనుసరించి నూతన తాత్విక ధోరణి పాశ్చాత్య దేశాల్లో, ముఖ్యంగా యూరపులో కొత్తపుంతలు తొక్కింది. ఎంతోమంది జిజ్ఞాసువులు నూతన తాత్విక రీతులపై ఎన్నెన్నో గ్రంథాలు వెలయించారు. సెక్యులరిస్టు దృక్పథంతో నాస్తిక, హేతువాద, సోషలిస్టు, హ్యూమనిస్టు సాహిత్యం వెలుగు చూచింది. శాస్త్రవిజ్ఞాన ప్రయోజనం కోసం సాంకేతిక విజ్ఞానం (టెక్నాలజీ) తోడుపడింది, మానవజీవితానికి నిత్యప్రయోజనం కోసం ఆ టెక్నాలజీ నిత్యావసర వస్తువుల్ని తయారుచేసి మనుషుల జీవితాలను సుఖవంతం చేసింది.

అంతవరకు బాగానే వుంది. కాని, అది అంతటితో ఆగలేదు. **విపరీతమైన విధ్వంసక సామగ్రిని - తుపాకులు మొదలు పరమాణు బాంబులదాక - తయారుచేయడానికి పాల్పడింది. ప్రజాస్వామ్యంపేర, నియంతృత్వాల పేర అధికార పీఠాలను అధిష్టించిన రాజకీయులకు ఆ ఆయుధాలు ఆటవస్తువులయ్యాయి. ఆట అంటే యుద్ధమే. రాజరికాలు అంతరించినా, యుద్ధాలు మాత్రం ఆగలేదు.** గత శతాబ్దిలో రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. వాటివల్ల కోట్లాదిమంది మనుషులు హతమయ్యారు. చాలాదేశాల్లో ఎంతో సంపదనష్టం, పంటనష్టం, పశునష్టం జరిగింది. అయినా, యీనాటి నాగరిక ప్రపంచానికి బుద్ధిరాలేదు. క్రూరమృగాలు కూడా పాల్పడని యుద్ధనీతి యీనాటి నాగరిక పాలకులకు ఆట వస్తువైంది. మూడో ప్రపంచయుద్ధం రాదనేందుకు దాఖలాలు లేవు.

ఏ దేశానికాదేశంలో జాతీయ రాజ్యాలేర్పడ్డాయి. జాతి విద్వేషాలు, మత విద్వేషాలు అడుగంటలేదు. పైగా, కొన్ని దేశాల మధ్య సరిహద్దు తగాదాలున్నాయి. నిజానికి వాటిని పరిష్కరించుకోవలసినవారు ఆ సరిహద్దు ప్రాంతాల్లోని ప్రజలే. కాని, అందులో ప్రభుత్వాల నాయకులు సైన్య సమీకరణ చేసి తగాదాలకు, యుద్ధాలకు తలపడుతున్నారు. ఇతర రాజ్యాల అధిపతులు కోపులు తొక్కుతున్నారు. ఇలాంటి సామ్రాజ్యవాద చిహ్నాలు ముదిరి చివరకు మరో ప్రపంచయుద్ధానికి దారితీసే ప్రమాదం లేకపోలేదు. ఈనాటి ఆయుధ సంపత్తి వినియోగంతో ఆ యుద్ధం సర్వవినాశానికి దారితీసి, చివరకు శేషంగా జనం మిగిలితే, గిలిగితే, మరల మానవుడు ఆదిమ ఆటవిక జీవితాన్ని గడపవలసిన దశ వస్తుంది. అది ఎలా తప్పుకోగలము అనే ఆలోచన ప్రగతివాదులందరికీ రావలసిన తరుణంలో మనం వున్నాం. ఈ విషయాన్ని గుర్తెరిగి ప్రగతివాదులందరూ తమ తమ ఉద్యమ స్వరూప స్వభావాలను నిర్ణయించుకోవాలి.

ఎవరెన్ని సభలనైనా, మహాసభలనైనా జరుపుకోవచ్చు. నా వరకు నేను ఏ వందకుపైగా సభల్లోనో, మహాసభల్లోనో పాల్గొన్నాను. ఆ సభలన్నిటికీ 100 మొదలు 400 మంది దాక శ్రోతలు హాజరయ్యారు. ఆయా ప్రదేశాల్లో యిప్పుడు వెదకితే ఏ ఐదు పదిమందో తప్ప, సంఖ్యలో ఏ సభ వల్లనూ ప్రజలు ప్రభావితం కాలేదని నా అనుభవం చెపుతుంది. రాజకీయ నాయకుల సభలకు వేలు, లక్షల ప్రజలు

హాజరవుతున్నారంటే, ఓట్లమ్ముకొనే ప్రజల వైజ్ఞానిక, నైతిక స్థాయి యేమిటో మనకు అర్థం కావాలి. ఓట్లు కొనేవారు ఎలా సంపాదనపరులవుతున్నారో గ్రహించాలి. గారడీలతో, గమ్మత్తులతో, జిమ్మిక్కులతో ప్రజల వివేకం పెరగదు. ప్రజలు వివేకులు కానిదే సాంస్కృతికోద్యమాలు ఫలించవు.

**చరిత్రను గమనించండి. పాలనాధికారం నేటి వరకు క్రమక్రమంగా ప్రజలకు దూరమవుతోంది. ఇప్పుడు దాన్ని పాలనాధికారుల స్వాధీనం నుంచి తప్పించి ప్రజలే తమపై అధికారాన్ని తామే చలాయించుకుంటే తప్ప, ప్రజలు ప్రత్యక్ష నియంతృత్వాన్నో (నరకాన్నో), పరోక్ష నియంతృత్వాన్నో అనుభవించక తప్పదు.** చరిత్ర జాడను గమనిస్తే, రానురాను ప్రజలపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రాజకీయ పెత్తనం ముదురుతూ వస్తున్నది. మహా మనీషులు సత్యశోధన మార్గంలో విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని యెంతగానో చేశారు, చేస్తున్నారు. దానికి సమాంతరంగా తాత్విక విజ్ఞానం పెంపొందలేదు. మనుషుల మధ్య యేదో ఒక వంకతో శత్రుభావం పెరగడం ఆగలేదు. ఇక మానవ సుహృద్భావాన్ని, సమతా దృష్టిని ఎలా సాధించాలి? ఇది యీనాడు ప్రగతివాద ఉద్యమాలు ఎదుర్కొంటున్న గడ్డు సమస్య. దాన్ని నిషేధించండి, దీన్ని నిషేధించండి అని ప్రగతి నిరోధకుల వెంటబడితే, ఆ నిషేధాలు జరుగుతాయా? జరిగినా ప్రజలు వివేకులవుతారా?

విద్య వివేకాన్ని కల్గిస్తుందంటారు. ప్రపంచంలో ఈనాడు లక్షలాది విద్యా సంస్థలున్నాయి. ఎందరెందరో వాటిలో చదివి డిగ్రీలు పొందుతున్నారు. అందులో విజ్ఞానాన్ని ఆశించి విద్యను అభ్యసించినవారు వెయ్యికి ఒకరో, లక్షకు ఒకరో వుంటారు. కేవలం ఏదో ఒక ఉద్యోగాన్ని ఆశించి వారు చదువుకుంటున్నారు కాని, జ్ఞానం ఆర్జించాలనే లక్ష్యం వివేకవంతులమవుదామనే స్పృహ వారిలో వుండదు. జీవన అవసరాలకు ఎంతో కొంత ధన సంపాదన అవసరమే. అయితే ఆ సంపాదన ఒక్కటే మన జీవిత గమ్యం కారాదు. చివరకు **'ఉద్యోగం పురుష లక్షణం' అనేది 'లంచం ఉద్యోగ లక్షణం'గా మారింది. విద్య కల్గించవలసిన వివేకం అదేనా? మనుషులు మనుషులుగా మారితేనే వారిలో మనుష్య లక్షణాలు చోటు చేసుకుంటాయి. అప్పుడే సహ మానవులపట్ల సహకార భావంతో, సమతా దృష్టితో మెలగడం సాధ్యమవుతుంది. మనిషిలో వివేకం పెరిగినప్పుడే అది సాధ్యమవుతుంది. మనుషుల్లో**

**వివేకం పెరిగే విధంగా మన విద్యా విధానం వున్నప్పుడే మనుషులు మనుషులుగా ప్రవర్తించగలుగుతారు. అందుకు మనుషులకు సరయిన విద్యా సంస్కారం అందాలి. అందుకే ఎడ్యుకేట్ ద ఎడ్యుకేటర్స్ అని నినదించాడు ఎం.ఎన్. రాయ్.**

మనుషులు మారకుండా సమాజం మారాలనీ, అందుకు దేశాధికార పీఠంపై కూర్చున్న అధిపతులు చట్టాలు చేస్తే చాలుననీ అనుకోవడం భ్రమ. 'చేతబడి' లాంటి వాటిని నిషేధించాం పో అని ప్రభుత్వాధిపతులు 'తూతూ మంత్రాలు' వల్లించినందు వల్ల ప్రయోజనమేముంది? లార్డ్ బెంటిక్ హయాంలో సతీసహగమనం చేసేవారికి మరణశిక్ష బెదరింపులివ్వబట్టి, అది ఆగిపోయింది. ఆ గద్దింపు ఫలితంగా విధవా వివాహ చట్టం చేయబడింది. అలా పునర్వివాహానికి ఎందరు స్త్రీలు సిద్ధమవుతున్నారు? వారిని వివాహమాడడానికి ఎందరు పురుషులు సిద్ధపడుతున్నారు? అది ఆచరణలో కొరవడడానికి కారణం స్త్రీ పురుషుల్లోని 'ఆచార' దోషం కాదా? ఆ దోషాన్ని తొలగించడానికి తగిన మానసిక సంస్కారం అవసరం లేదా?

**అందుకే మనుషులు సంస్కారవంతులుగా మారాలి. అలా మారనీయని మతనాగరికతలో వారు యిరుక్కున్నారు. చట్టాలు వారిని మార్చలేవు. మనుషులు స్వతంత్రాలోచనా పరులుకావాలి. మూఢాచారాల వూబి నుంచి వారు బయటపడగల స్వతంత్ర చింతనాపరులు కావాలి. అలా అయ్యేట్లు వారిని ఎడ్యుకేట్ చేయాలి. ఎంతకాలం పట్టినా అదొక్కటే సాంస్కృతికోద్యమకారుల లక్ష్యం కావాలి. కేవలం ఊకదంపుడు వుపన్యాసాల వల్ల ప్రయోజనం శూన్యం.**

ఈ దేశంలోని మనుషులను బండ్లకొలదిగా వున్న మత సాహిత్యం, మూఢాచార ప్రచారం, అవి మానవ మనస్తత్వాన్ని కొల్లగొట్టి, కుళ్లబొడుస్తున్న రీతిని మనం తక్కువగా అంచనా వేయడానికి వీలులేదు. పైగా, తమకు నమ్మకమున్నా, లేకున్నా, రాజకీయ పీఠాలపై వున్న ఆశ రాజకీయ పార్టీల వారిని మత సూత్రాలను, మౌఢ్యాలను ప్రచారం చేసే రీతి నుంచి తప్పించడం అంత తేలిక కాదు. నిజానికి ప్రగతివాదులు సైతం రాజకీయాలకు బలి అవుతున్న స్థితిలో సమాజం వుంది. కాబట్టి, ప్రగతివాదుల కృషి, ప్రజల్ని కదిలించడం. అంత తేలిక కాదు.

అందుకే, సమాజం ప్రగతిపథంలోకి మారాలంటే, ముందుగా సమాజ స్రష్టలైన మనుషులు మారాలంటున్నాం, అందుకు ఏండ్లు, పూండ్లు పట్టవచ్చు. అయినా

మానవ సమతను సాధించడానికీ, రాజకీయ బానిసత్వం నుంచి తప్పుకోడానికీ మనిషికి మిగిలిన మార్గం అదొక్కటే. ఈ పద్ధతినే అంటిపెట్టుకొని హేతువాద ఉద్యమం కృషి చేస్తున్నది. అందుకు అనువుగా ప్రగతివాద సాహిత్యాన్ని ప్రచురించి విడుదల చేస్తున్నది. ఈ సాహిత్యం ఏ ప్రగతి నిరోధకుల్నీ, వారి తత్వాల్నీ మన్నించడం లేదు. కండగల సాహిత్యమే కొంతగానైనా చదువుకున్నవారిలో పరివర్తన తెస్తుంది.

నిజానికి, నా ఆరోగ్యం అస్తవ్యస్తంగా వున్న దశలో అదే నా చివరి రచన కాబోతుందనే దృష్టితో ప్రగతివాదులకు సూచనగా "మనం ఏమి చేయాలి" అనే గ్రంధాన్ని 1997లోనే వ్రాశాను. దాన్ని కొంతగా సంక్షిప్తం చేసి "హేతువాది" మాసపత్రికలో క్రమంగా ప్రచురించే ప్రయత్నం చేస్తున్నాము. ఆ గ్రంధాన్ని ఆవిష్కరించిన జ్వాలాముఖిగారు దాన్ని హేతువాద ప్రణాళిక (రేషనలిస్ట్ మేనిఫెస్టో)గా వర్ణించారు. దాన్ని వ్రాసి 20 సంవత్సరాలైంది. ఈలోగా చరిత్ర భయంకర మలుపులు తిరగబోతున్నట్లు తోస్తున్నది. ఐనా, చింతనాపరులు ఇంకా ఈ దృక్పథానికి కలుపవలసినదేమైనా వుంటే, ఆ పని చేబడితే, నేను సంతోషిస్తాను. ఎందుకంటే, ఏదీ తుది మాట కాదనేది నా అభిప్రాయం. ఇంతకుముందు ఎందరెందరో చాలా తాత్విక, తాత్వికేతర ముఖ్యాంశాలు చాలా చెప్పారు. కాని, ఏదీ తుది మాటగా నిలువలేదు. అది తాత్విక నైజం. అందువల్ల 'తాబట్టిన కుందేలుకు మూడేకాళ్ళు' అంటూ ఎవ్వరూ మారాము చేయనవసరంలేదు. సెలవు.



*"అశాంతిలో, ఆందోళనలో, తిరుగుబాటులో మహోన్నత విప్లవాల ప్రభంజనాల్లో సమాజానికి కళాకారుడికి ఉన్న సంబంధం చరిత్రలో ఎక్కడన్నా బలహీన పడిందేమో వెదుకుదాం. లేదు. అట్లా జరగలేదు. ఉత్కృష్టమైన కళాసృష్టే జరిగింది. భూమ్మీద జరిగే ప్రతి మార్పూ కళని మారుస్తూ ముందుకొచ్చింది. ప్రపంచం మూలల్లోకి వెళదాం. అంతా అట్లాగే జరిగింది. ప్రతీ మూలలో సంఘర్షణే చరిత్రగా నిలిచింది. మా విషాదం మొదలు మహాప్రస్థానం దాకా పుట్టుకొచ్చిన పదాలనన్నీ రాసిపోస్తే ఆ రాసిలో దొరికేవి మూడే మూడు పదాలు. అలజడి, ఆందోళన, తిరుగుబాటు, ఆ అలజడే కళ, ఆ ఆందోళనే పాట. ఆ తిరుగుబాటే ఆట."*

# ౨. సంస్కృతి అంటే...

- ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు
(కేంద్రీయ విశ్వవిద్యాలయ విశ్రాంత ఆచార్యులు, హైద్రాబాద్)

సంస్కృతిని గురించి ఏకరూపత కలిగిన నిర్వచనం ఇంతవరకు కనిపించదు. భావ, భౌతికవాద తాత్విక ధోరణులను బట్టి సంస్కృతీ స్వరూపాన్ని అనేక రకాలుగా నిర్వచించటం కనిపిస్తుంది. కొందరు సంస్క ృతిని అమూర్త (ఆబ్‌స్ట్రాక్ట్) భావ పదార్ధంగా పరిచయం చేశారు. అంటే సంస్కృతిని స్పష్టమైన నిత్య జీవిత విధానానికి సంబంధం లేని ఒక అమూర్త అతీత అంశంగా నిర్వచించినవారున్నారు. నాగరికతలో భాగంగా మానవ నిర్మాణాలు, సృజనాత్మక కళల సమాహారంగా సంస్కృతిని కొందరు వివరిస్తారు. మానవుని ప్రవర్తనా విధానంగా కూడా సంస్కృతిని కొందరు విశ్లేషించారు. కొందరు సంస్కృతిని అమూర్త రూపంలో దాన్ని ప్రదర్శించే ప్రయత్నం చేశారు. ఒక సంప్రదాయవాది సంస్కృతిని అనేక రూపాలలో భావపదార్థంగా నిర్వచించి, దానికి ఉదాహరణగా తెలుగు సాహిత్య చరిత్రను సంగ్రహించాడు. భారతీయ సంస్కృతిని స్వరూప, స్వభావాలను వివరించేటప్పుడు అనేక వైరుధ్యాలు కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. వేదకాలం నుంచి భారతదేశ చరిత్రను, నాగరికతను, సృజనాత్మక నిర్మాణాల చరిత్రను ఒక వరుసలో చెప్పి వాటి మధ్య పూసలలో దారంలాగా కనిపించే ఏకసూత్రత భారతీయ సంస్కృతిలోని ప్రధానాంశంగా పేర్కొనటం జరుగుతున్నది. భారతదేశానికి సంబంధించి సంస్కృతి అనగానే చాలామందికి మతపరమైన విశ్వాసాలు, ఆచార్యవ్యవహారాలు, కర్మకాండలు జ్ఞాపకం వస్తాయి. సంప్రదాయాన్నే సంస్కృతిగా భావించే సంప్రదాయం కూడా ఉంది. భారతీయ సంస్కృతి అనగానే ఆధ్యాత్మిక సంస్కృతి చాలా మందికి జ్ఞాపకం వస్తుంది. భారతదేశంలోని తత్వం, చట్టం, సంగీతం, సాహిత్యం, ఇతర కళలు - అన్నీ ఆధ్యాత్మిక సంస్కృతినే ప్రతిబింబిస్తాయన్న భావం కూడా చాలామందిలో ఉంది. కొంతమందికి సంస్కృతి మేధావుల సృష్టి పాలకుల ఆస్తి, సంస్కృతి అంటే ఉత్తముల ఆదర్శప్రాయమైన నడవడిక, గత ప్రాబవ స్మృతి, సనాతన వ్యవస్థ స్థిరత్వం, సంతత్వం, శాశ్వతత్వం, సంస్కృతికి ప్రధాన లక్షణం. కొందరికి సంస్కృత భాషా, సాహిత్యాలే మొత్తం భారతీయ సంస్కృతికి ప్రతీకలు. ఆ మధ్య ఒక ఇంగ్లీషు ప్రొఫెసర్‌గారు "Samskrut is language of Silence" సంస్కృతం మౌనలేక నిశ్శబ్ద భాష అని

అభివర్ణించాడు. భక్తి, విశ్వాసాల సంస్కృతిలో భాగంగా భక్తి శ్రద్ధలతో చెప్పిన మాట ఇది. సంస్కృతం భారతీయ సంస్కృతికి ప్రతిబింబం. సంస్కృతం అనగానే మనకు ఆ భాషలోని విజ్ఞానం, శాస్త్ర విషయాలు, భౌతిక జీవన పరంపర జ్ఞాపకం రావు. మునులు, మౌనులు, ఋషులు జ్ఞాపకం వస్తారు.

భారత దేశానికి సంబంధించి సర్వ సాధారణ సంస్కృతిని గురించి మాట్లాడేవారు భారత, రామాయణాలను పేర్కొంటుంటారు. భారత, రామాయణాల ప్రభావం పై వర్గం నుంచి కింది వర్గం వరకు భారతీయులందరిపైన ఉందని, అందులోని పాత్రలు, ఆదర్శాలు భారతీయులందరికి ఏకైక ప్రేరణ అని వాదిస్తుంటారు. అవి అన్ని ప్రాంతాల, వర్గాల జన జీవనంలో పెనవేసుకొనిపోయాయని, అదే భారతీయ సర్వ సాధారణ సంస్కృతికి తార్కాణమని వారి అభిప్రాయం. కాని భారత రామాయణ కథలను అర్థం చేసుకునే పద్ధతిలో, ఆదర్శీకరించుకొనే విధానంలో, తమ జీవితానికి సమన్వయం చేసుకోవటంలో భిన్న వర్గాల మధ్య చాలా తేడాలు కనిపిస్తాయి. సంస్కృత భారత, రామాయణాలు, వాటి ఆధారంగా వచ్చిన కావ్య నాటకాలతో పోలిస్తే జానపద సాహిత్యంలో కనిపించే భారత, రామాయణ గాథలు భిన్నంగా ఉంటాయి. చాతుర్వర్ణ విధానం, అగ్రవర్ణాల ఆధిక్యత వీటితో సంబంధం లేకుండా జనజీవితానికి, సాధారణ మనస్తత్వానికి దగ్గరగా ఉండే పాత్రలు వాళ్ళ కథలలో కనిపిస్తాయి. అది ఆ రెండు వర్గాల సంస్కృతిలో ఉండే బేధాన్ని సూచిస్తుంది. ఈ పాత్రలే ఒకే వర్గంలో చరిత్రలో వ్యవస్థలు మారినప్పుడు కొత్త రూపాలను సంతరించుకోవటం చూడవచ్చు. పురాణేతిహాసాల లోని రాముడు, దుష్యంతుడు మధ్యయుగంనాటి కావ్య, నాటకాలలోని రాముడు, దుష్యంతుడు భిన్నంగా కనిపిస్తారు. వైవిధ్యంలో ఏకత్వం భారతీయ సంస్కృతికి సంబంధించిన మరొక ప్రధాన లక్షణంగా చెప్తుంటారు. ప్రాంతీయ భేదాలు ఉన్నా పై వర్గంలో, ముఖ్యంగా పాలకవర్గంగా వారి ప్రయోజనాలలోని సామ్యం దృష్ట్యా సమాన లక్షణాలు, ఏకత్వం కనిపించవచ్చు. కాని అది సర్వ వర్గ సమాన సంస్కృతిగా భావించటానికి ఎంతవరకు వీలుంటుందో చెప్పటం కష్టమే.

ఇటీవల ఒక హైకోర్టు జడ్జిగారు ఒక సాహిత్య సమావేశంలో మాట్లాడుతూ దేశభక్తి, సమాజం వీటిని గురించి మన వాళ్ళెప్పుడూ ఆలోచించలేదని, ఆత్మవంచన, ఆత్మశక్తి, ముక్తిని గురించే వారు ఆలోచించేవారని అదే మన సంస్కృతి అని సగర్వంగా చాటి చెప్పారు. ఆ మాటకు వస్తే సంస్కృతి అన్న పదమే ప్రస్తుతం మనం వాడుతున్న

అర్థంలో, భావంలో కల్చర్ అన్న ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా భాషలో కొత్తగా ప్రవేశించింది. కల్చర్ అంటే వ్యవసాయం, కృషి, సేద్యం, సాగుబడి, పశుపోషణ మొ॥ అర్థాలే బ్రౌన్ నిఘంటువులో కనిపిస్తాయి. సంస్కృతి అంటే 'సమ్యక్ కారణం' 'శుద్ధి' అన్న అర్థమే సంస్కృత నిఘంటువుల్లో కనిపిస్తుంది. జాతి, సంస్కృతి అన్న పదాలు పూర్వార్థాలను కోల్పోయి ఒక ప్రత్యేకార్థంలో ఈరోజు మాత్రమే కనిపిస్తున్నాయి. ఏ ప్రాచీన గ్రంథాల్లోను, కావ్యాల్లోను జాతి అన్నది ప్రస్తుతం తెలుగులో కనిపిస్తున్న అర్థంలో కనిపించదు. దేశభక్తి అన్న కాన్సెప్ట్ కనిపించదు. సంస్కృతి అన్న పదం ప్రస్తుతం ఉన్న భావంలో కనిపించదు. తిక్కన భారతంలో ఇది సంస్కారం అన్న అర్థంలో కనిపిస్తుంది. మౌసల పర్వంలో బలరామకృష్ణులు మరణించినప్పుడు అర్జునుడు, భూసురకోటి "కావున వేగమగ్నియును గాష్ఠములున్ సమకూర్చి సద్విధి, శ్రీవిలసిల్లఁ గృష్ణుని శరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱంబోవుట బుద్ధియంచు..." అనుకుంటారు. ఇక్కడ సంస్కృతి అన్న పదం దహన సంస్కారం అన్న అర్థంలో ఉంది. చేలోపనయనాది సంస్కారాలకు సంస్కృతి అన్నది మరో పేరు అయి ఉంటుంది. ఆధునిక యుగంలోనే అది ప్రత్యేక భావాన్ని సంతరించుకుంది. అలాంటప్పుడు 'సంస్కృతి అంటే జాతికి సంక్రమించిన సామాజిక వారసత్వంగా, శాశ్వతమైందిగా, సర్వకాలాలకు, సర్వజనాలకు సంబంధించిన అతీత లక్షణంగా ఎలా కొనసాగుతుంది? నా జాతి తరతరాల సంస్కృతి అనుకోవటం సంప్రదాయం గురించే. పదార్థం నుంచి, భౌతిక సత్యం నుంచి భావం, చైతన్యం పుడ్తుంది. భౌతిక జీవిత విధానాలలో వచ్చే మార్పులను బట్టి సంస్కృతి స్వరూప స్వభావాలు మారుతుంటాయి. ఒకప్పుడు ఆర్థిక వ్యవస్థకు మూలాధారమైన ఉత్పత్తి కార్యక్రమాన్ని సూచించే కల్చర్ అన్న పదం, ఆర్థిక వ్యవస్థ పునాదిగా గల సామాజిక పరిస్థితుల భావప్రతిబింబాన్ని సూచించే పదంగా స్థిరపడింది. దానికి సమాన భావాన్నిచ్చే పదంగా 'సంస్కృతి' వాడుకలోకి వచ్చింది.

మనది సంస్కృతి కాదని, అది అధ్యాత్మిక సంస్కృతి అని, అది సనాతనం, నిత్యం, సత్యం, అమేయం, అనవద్యం, అవ్యక్తం, అచింత్యం, అనికార్యం అన్న భావం మౌలికంగా మనకున్నది. అలా అని పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాల వరకు ఎవరూ చెప్పలేదు. విశ్రాంతి వర్గం మేధస్సు నుంచి పుట్టిన ఒక తత్వంగా జగన్మిథ్య, ఆత్మనిత్యం, బ్రహ్మసత్యం అన్న భావాలు కింది వర్గాలను కూడా ఏదో ఒక రూపంలో ప్రభావితం చేసిన మాట నిజమే కాని అదే ప్రధాన జీవన విధానంగా జనసామాన్యం ఎప్పుడూ భావించినట్టు కనిపించదు. ఆధ్యాత్మిక సంస్కృతి ఆధిక్యతా భావాన్ని వలస

పాలన కాలంలో బాగా ఎరువు వేసి నాటినట్టు కనిపిస్తుంది. అది ఈ రోజుకూ మన మెదళ్ళను, మనస్సులను పాలిస్తున్నది. ఆధునిక పారిశ్రామిక నాగరికతకు ఫలితమైన సంస్కృతిలో దారితప్పిన కొందరు పాశ్చాత్య మేధావులకు ఉపనిషద్భావాలు, జగన్మిథ్యా తత్వం, అతీత జగద్వాదం కొత్తగా అనిపించాయి. వారి మనస్సుల లోని శూన్యాన్ని మాయా, శూన్యవాదాలు పూరించాయి. అది ఆ కాలంలో వ్యాపిస్తున్న కాల్పనిక ధోరణులలో భాగం.

భారతదేశాన్ని గురించి వాళ్ళు చాలా కాల్పనికంగా ఆలోచించారు. భారతదేశం గొప్ప ఆధ్యాత్మిక దేశమని, ఉన్నత ప్రాచీన సంస్కృతి గల దేశమని అభివర్ణించారు. మాక్స్‌ముల్లర్ విద్యార్థిగా ఉన్నప్పుడు తన నోటు పుస్తకం అట్టపైన ఉన్న బనారస్ దృశ్యాన్ని చూచి కలలు కన్నాడు. భారతదేశాన్ని గురించి కాల్పనికమైన ఆలోచనలతో చాలా చెప్పాడు, రాశాడు. కాని ఆయన భారతదేశాన్ని ఎప్పుడూ చూడలేదు. ఒకసారి ఆయనను బనారస్‌కు రమ్మని ఆహ్వానిస్తే "I do not desire to see the geografical Benaras with my physical eyes. My idea of that city is so high that I cannot risk a dissillusionment" దీన్ని అర్థం చేసుకుంటే భారతదేశాన్ని గురించి ఆయన ఆలోచనలు ఎంత కాల్పనికమైనవో తెలుస్తుంది. తమకు అనుకూలం కానిచోట పాశ్చాత్యుల భావాలను, ప్రభావాన్ని ఖండించే సంప్రదాయవాదులు, పాశ్చాత్యులు ప్రశంసించారన్న కారణంగానే ఆధ్యాత్మిక సంస్కృతి పేరిట మక్కువ పెంచుకున్నారు, పెంచారు. దీనివల్ల సంప్రదాయంపైన ఇంతకు ముందెన్నడూ లేని గర్వం, వివేచన లేని దురభిమానం పెరిగింది. అది నేటికీ కొనసాగుతూ రోజురోజుకు పెరుగుతున్నది. ఈ దురభిమానమే స్వాధిక్యతా భావానికి దారితీస్తుంది. తీసింది కూడా. సంస్కృత భాషాధ్యయన, పరిశోధనల ద్వారా ఆర్య సంస్కృతి ప్రాచీనతా వైభవాలు తలకెక్కటం జర్మనులే నిజమైన ఆర్యులనీ, ఇతరులంతా 'బార్బేరియన్స్' అని హిట్లర్ చెప్పటం ప్రపంచ చరిత్ర తెలిసిన వారందరికీ తెలిసిందే. బహుశా జర్మనులు మన దేశం నుంచి విజ్ఞానం అంతా ఎత్తుకుపోయి లాభపడ్డారంటే ఇదేనేమో! సుమారుగా సుదీర్ఘ చరిత్ర కలిగిన ప్రతి జాతిలోను గతౌన్నత్యం మీద అభిమానం, సంప్రదాయం మీద మమకారం, తమ మతమే సత్యం చెప్తుందన్న విశ్వాసం కనిపిస్తుంది. వారికి గతమే ఆదర్శం అవుతుంది. సంప్రదాయ జీవిత విధానమే ఆశయంగా మారుతుంది. మారిన ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులలో ఆశయాలు, ఆదర్శాలు ఆచరణాత్మకం కాలేవు. దీనివల్ల

ఆశయానికి, ఆచరణకు వైరుధ్యం ఏర్పడుతుంది. ఈ వైరుధ్యాలు అరాచక సంస్కృతికి దారితీస్తాయి.

భారతదేశ చరిత్రలో భిన్న చారిత్రక దశలలోని తాత్విక భావాలు కలగాపులగమై వైరుధ్యాలు కనిపించేమాట నిజమే. కాని ఆధ్యాత్మిక సంస్కృతి పేరిట ఆధిక్యతా భావన ప్రాచీన భారతీయ చరిత్రను, సాహిత్యాలను అధ్యయనం చేస్తే చాలా తక్కువ గానే కనిపిస్తుంది. బౌద్ధం, జైనం, వైష్ణవం, వీరశైవం మొదలైన మతాలు, భక్తి ఉద్యమాలు భారతదేశ చరిత్రలో ఎన్నో వచ్చాయి. ఈ మతాలన్నీ మొదట ఆయా చారిత్రక దశలలోని వైరుధ్యాలలో జీవన విధానాన్ని, వ్యవహార విధానాన్ని నిర్దేశించే కట్టుబాట్లుగా ప్రారంభమై మత రూపాన్ని పొందాయి. ఈ మతాలన్నీ ఆయా సందర్భాలలో చాతుర్వర్ణ్య ప్రధానమైన సామాజిక వ్యవస్థను వ్యతిరేకిస్తూ వచ్చాయి. కాని పరిణామక్రమంలో ఆ మతాలన్నీ వర్ణ విభజనకు సంబంధించిన వ్యవస్థతో రాజీ పడ్డాయి. వైదిక మతం అని చాలామంది అంటున్నది చాతుర్వర్ణ్య విధానానికి, శ్రమ విభజనకు సంబంధించిన సామాజిక వ్యవస్థే కాని మరొకటి కాదు. పై మతాలు కాని, చాతుర్వర్ణ్య వ్యవస్థ కాని భౌతిక జీవన విధానానికి సంబంధించినవే మౌలికంగా, ప్రతి దశలోను ఆ మతాలకు సంబంధించిన ఇతివృత్తాలతో సృజనాత్మక సాహిత్యం వచ్చింది. ఆధ్యాత్మిక భావాలకు సంబంధించిన సృజనాత్మక సాహిత్యం చాలా తక్కువగా కనిపిస్తుంది. అదొక తత్వంగా విస్తరించిందేగాని భౌతిక జీవనానికి వైముఖ్యాన్ని కలుగజేసే శక్తిగా ఎదగలేదు. కాకపోతే కింది వర్గాలు తమ బాధలకు, కష్టాలకు భ్రమాత్మకమైన ఓదార్పును కలిగించే సాధనంగా అది ఉపయోగించింది. తెలుగు సాహిత్య చరిత్రను పరిశీలిస్తే కనీసం భౌతిక జగత్తు అస్తిత్వాన్ని నిరాకరించే శంకరుని అద్వైతానికి ప్రాధాన్యం ఇచ్చిన, ఆ తత్వాన్ని ఆధారం చేసుకున్న ప్రసిద్ధ కావ్యాలు గాని, ప్రబంధాలు గాని కనిపించకపోవడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆ సాహిత్యం వర్గ సాహిత్యం అని చెప్పవచ్చు గాని ఆధ్యాత్మిక సాహిత్యం మాత్రం కాదు. దైవం భావన, భక్తి ఉన్నాయి. కాని జగన్మిథ్యా తత్వం కనిపించదు. ప్రత్యేకంగా అద్వైత కావ్యాలు కొన్ని వచ్చాయి. కాని అవి అంత ప్రచారంలో లేవు. ఆధ్యాత్మిక సంస్కృతీ హిందూ సంస్కృతి, సర్వస్వం అన్న భావం వలస పాలనతోనే ప్రారంభమైంది. కొందరు పాశ్చాత్య మేధావులు హిందువులలో నాటిన ఆధ్యాత్మిక సంస్కృతి ఔన్నత్యభావాన్ని బ్రిటిష్ పాలకులు బాగా ఉపయోగించుకున్నారు. ఆ భావాలు మరింత బలపడటానికి

కావలసిన వాతావరణాన్ని కల్పించటం ద్వారా దాన్ని ఆర్థిక దోపిడీకి సాధనంగా వినియోగించుకున్నారు. భౌతిక జీవనానికి అతీతమైన ఉన్నతమైన ఆధ్యాత్మిక సంస్కృతీ సంపన్నులుగా భారతీయులు, ముఖ్యంగా తమలోతాము కుంచించుకు పోవటానికి అది దారి తీసింది. కర్మసిద్ధాంతం, మాయావాద తాత్వికత ఏదో ఒక రూపంలో మొదటి నుంచీ కొనసాగుతున్న మాట నిజమే కాని అదే సర్వస్వంగా గర్వించటానికి కావలసిన పరిస్థితుల్ని సృష్టించారు వలస పాలకులు. ఆర్థిక ప్రగతిపైన, దేశ ఆర్థిక వ్యవస్థపైన దృష్టి లేకుండా చేయటం ద్వారా ఆర్థిక దోపిడీ చేయటానికి వలసపాలకులకు ఇది చక్కగా, చల్లగా ఉపయోగపడింది. చరిత్రను ఆర్థిక రాజకీయ వ్యవస్థలను బట్టి కాకుండా, దేశాన్ని పాలించిన పాలకుల మతాలను బట్టి విభజించటం విభిన్న మతాల వారి మధ్య విభేదాలు పెరగటానికి దోహదం చేసింది. దీనివల్ల స్వాతంత్ర్యోద్యమ కాలంలో మతాలతో ప్రసక్తిలేని ఒక జాతిగా భారతీయులు ఎదగటానికి, మతాలతో ప్రసక్తిలేని సమకాలీన సంస్కృతి ఏర్పడటానికి తగిన అవసరం ఉండి కూడా దానికి తగిన వాతావరణం ఏర్పడలేదు. వలస పాలకులు తమ విధానాల ద్వారా ప్రాచీన భారతీయ సంస్కృతిగా, ఆధ్యాత్మిక సంస్కృతిగా హిందూ సంస్కృతి ఔన్నత్యాన్ని చాటి చెప్తూనే, రాజకీయంగా మహమ్మదీయులలో హిందూ వ్యతిరేక భావాన్ని పెంచారు. మనలో పునరుద్ధరణ వాద ధోరణులు పెరగటానికి కూడా కారణం వలస పాలన, వారి ఆర్థిక విధానాలు. స్వాతంత్ర్యానంతరం కూడా ఇదే విధానాలు కొనసాగుతున్నాయి. స్వాతంత్ర్యం వచ్చి దశాబ్దాల తరువాత కూడా ఈ వలస సంస్కృతి ప్రభావం ఇంకా కొనసాగుతూనే ఉంది. సామ్రాజ్యవాదం ఆర్థిక పెత్తనం చేస్తూ తన సంస్కృతిని రుద్దుతూనే ఉంది. ప్రస్తుతం పరిపాలన ఆధ్యాత్మిక సంస్కృతి పేరిట భూస్వామ్య సంస్కృతిని రక్షిస్తూనే ఉంది. దేశంలోని రాజకీయాలు కూడా వలస పాలన కంటే భిన్నంగా లేవు. అల్ప సంఖ్యాక వర్గాల వారిని బుజ్జగిస్తూనే, అధిక సంఖ్యాకుల మద్ధతును, బలాన్ని జాగ్రత్తగా సేకరించుకోవటం, ఉపయోగించుకోవటం, మరచిపోని రాజకీయ సంస్కృతి రోజురోజుకు పెరుగుతున్నది. స్వతంత్రమైన, స్వతస్సిద్ధమైన, సామ్యవాద ఆర్థిక విధానాన్ని రూపొందించుకోవటం ద్వారా వర్తమాన భౌతిక పునాదులపైన మతంతో సంబంధంలేని సాధారణ భారతీయ ఆధునిక సంస్కృతి పెరగటానికి వీలులేని విధానాలను పాలకవర్గాలు అనుసరిస్తున్నాయి. 'సహనమే సంస్కృతి' అన్న అధికార

వర్గ తత్వవేత్తల నిర్వచనం నినాదంగా మాత్రమే మిగిలి ఆచరణలో వైరుధ్యాలకు దారితీస్తున్నది. అందుకే కాబోలు సహనం గాడిద లక్షణం అంటున్నారు విప్లవకారులు. వర్గ సమాజంలో విభిన్న వర్గాల మధ్య సహనం సాధ్యం కాదనేది వాస్తవం.

సంస్కృతి మార్పులేని స్థిరపదార్థమో, ఆద్యంత రహితమైన బ్రహ్మ పదార్థమో కాదు. ఈ రోజు ఆదిమ సంస్కృతి, జానపద సంస్కృతి, సనాతన సంస్కృతి, సంప్రదాయ సంస్కృతి, భూస్వామ్య సంస్కృతి, భౌతిక సంస్కృతి, ఆధ్యాత్మిక సంస్కృతి, వలస సంస్కృతి, ఎరువు సంస్కృతి, సామ్రాజ్య సంస్కృతి, ప్రజాస్వామ్య సంస్కృతి, బూర్జువా సంస్కృతి, ఆధునిక సంస్కృతి, ధనస్వామ్య సంస్కృతి వ్యాపార సంస్కృతి, పాలకవర్గ సంస్కృతి, రాజకీయ సంస్కృతి జాతీయ సంస్కృతి నూతన ప్రజాస్వామిక సంస్కృతి, శ్రామికవర్గ సంస్కృతి, అంతర్జాతీయ సంస్కృతి మొదలైన రకరకాల సంస్కృతుల పేర్లు వినవస్తున్నాయి. వీటిలో కొన్ని చరిత్రలోని విభిన్న దశలను సూచిస్తున్నాయి. కొన్ని ఒకే దశలోని భిన్న వర్గాలను సూచిస్తున్నాయి. మరికొన్ని ఆర్థిక వ్యవస్థలను సూచిస్తున్నాయి. రాజకీయ పార్టీల పేరుతో కాంగీ సంస్కృతి, తెలుగు దేశం సంస్కృతి మొదలైన వినిపిస్తున్నాయి. గత లోక్ సభ ఎన్నికలకు కొన్ని ప్రతిపక్షాలు 'నూతన రాజకీయ సంస్కృతి (New Political Culture)' ని తమ నినాదంగా ప్రకటించారు. కొంత హాలీవుడ్ నుంచి దిగుమతి అయి, దేశంలోని బందిపోటు దొంగల జీవితాల ఇతివృత్తాలతో కలసి సినిమా సంస్కృతిగా వ్యాపిస్తున్న ప్రతీకార సంస్కృతి culture of revenge లంపెన్ వర్గాన్ని బాగా పాలిస్తున్నది. దీన్నిబట్టి సంస్కృతి స్వరూప స్వభావాలు స్థిరమైనవి, మార్పులేనివి, సర్వ జన సాధారణమైనవి కావని తెలుస్తుంది. ఆర్థిక పరిస్థితులను బట్టి ఏర్పడే వర్గాలు, సామాజిక, రాజకీయ వ్యవస్థలు, వాటిల్లోని వైరుధ్యాలు సంస్కృతి స్వరూప స్వభావాలను నిర్ణయిస్తాయని, వర్గ విభక్త సమాజంలో సర్వవర్గ సమాన సంస్కృతి, విభిన్న వ్యవస్తలకు అతీతమై అన్ని వ్యవస్థలలో సమానంగా అన్వయించే సంస్కృతి సాధ్యం కాదని తేలుతుంది.

ఇంతకీ సంస్కృతి అంటే ఏమిటి? కళలు, సాహిత్యం, విజ్ఞానం, మానవ సంబంధాలు, పరస్పర ప్రవర్తన – ఇవి సంస్కృతికి చిహ్నాలని, అందులో ఎంత ఔన్నత్యాన్ని సాధిస్తే ఆ సంస్కృతి అంత ఉన్నతమైందని, ఆ ఔన్నత్యంపైన వ్యక్తిగాని,

సమాజం గాని ప్రత్యేక శ్రద్ధను చూపిస్తే అది ఆ వ్యక్తి సంస్కృతి అవుతుందని కొందరి అభిప్రాయం. విద్యా, విజ్ఞాన, శిక్షణల వల్ల మానసిక వికాసం చెందటం సంస్కృతి అని మరొక నిర్వచనం. సంస్కృతి అంటే కొన్ని సామాజిక సమూహాలను గుర్తింపజేసే లక్షణం అని మరి కొందరంటున్నారు. ప్రత్యేక చారిత్రక పరిస్థితులలో, ప్రత్యేక ప్రాంతంలో ఒక గుంపులో నియమితంగా పునరావృతమయ్యే లక్షణాలే సంస్కృతి అని అది సమకాలీన ప్రత్యేకతలను ప్రతిబింబిస్తుందని ఇంకొక అభిప్రాయం. ప్రాచీన సంస్కృతీ నాగరికతలను తవ్వి తీయటం అంటే పురావస్తు తవ్వకాలలోని భౌతిక వస్తు సంపద, నిర్మాణం ఆధారంగా ఆనాటి జీవన విధానాలను, సమకాలీన లక్షణాలను బయటికి తీయటం అన్నమాట. ఒక ప్రత్యేక దశలో, ప్రత్యేక ప్రాంతంలోని, ప్రత్యేక గుంపు యొక్క ప్రత్యేక లక్షణాలు సంస్కృతి అన్నమాట. అంటే సమకాలీన భౌతిక జీవన పరిస్థితులే ఆనాటి సంస్కృతి అని అర్థం. భావాలు, నమ్మకాలు, వ్యవస్థా నిర్మాణం, కళాసృజన, ఆచార వ్యవహారాలు, వివాహాది విధానాలు, ప్రత్యేకంగా గుర్తింపదగిన మానవుల ప్రవర్తనా విధానం - ఇవి సంస్కృతిలో భాగాలయితే, వీటి స్వరూప స్వభావాలను నిర్ణయించేది సమకాలీన ఆర్థిక వ్యవస్థ.

సమాజంలో మానవ సమూహంలో ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమించిన జీవన విధానమే సంస్కృతి అని, అది జాతికి సంక్రమించిన సామాజిక వారసత్వమని అవిచ్ఛిన్న సంతతత్వం సంస్కృతి ప్రధాన లక్షణమని వారంటారు. కాని ఈ రోజుకీ మతపరంగా వచ్చిన కర్మకాండలను, వివాహాది విధులను కొన్ని ప్రత్యేక సందర్భాలలో నామమాత్రంగా, యాంత్రికంగా అనుసరిస్తున్నా, విశ్వాసాలుగా కొన్ని కొనసాగుతున్నా సాధారణ జీవన విధానంలో ఎన్నో మార్పులు కనిపిస్తాయి. భూస్వామ్య వ్యవస్థ నాటి ఉమ్మడి కుటుంబ జీవనం ఇప్పుడు పోయింది. బాల్య వివాహాలు పోయాయి. విధవా వివాహాలు జరుగుతున్నాయి. స్త్రీలు చదువుకొని, ఉద్యోగాలు చేసుకోవటానికి అవకాశాలు ఏర్పడ్డాయి. మానవ సంబంధాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. మొత్తంమీద ఏ సంస్కృతీ దేశకాలాలతో నిమిత్తం లేకుండా, ఆర్థిక సామాజిక వ్యవస్థలతో సంబంధం లేకుండా ఉండదు. ఆర్థిక సంబంధాలు సమాజ స్వరూపాన్ని, రాజకీయ స్వరూపాన్ని నిర్ణయిస్తాయి. అవి మానవ సంబంధాలను, విలువలను, నీతులను నిర్దేశిస్తాయి. వాటి వ్యక్తరూపమే మానవుని ప్రవర్తనా విధానాలు కళా నిర్మాణాలు వాటినే ప్రతిబింబిస్తాయి. సమాజాన్ని గురించి శాస్త్రీయమైన అవగాహన సంస్కారవంతుని లక్షణం అయితే, తదనుగుణమైన వ్యక్తికి

సంబంధించిన ప్రవర్తన ఆ వ్యక్తి సంస్కృతి. ఒక సమాజానికి ఆధారమైన మానవ సంబంధాలు ఆ సమాజానికి సంబంధించిన సంస్కృతి.

ఒక్కొక్కసారి భౌగోళిక నైసర్గిక పరిస్థితులు కూడా సంస్కృతిలో భాగంగా చెప్పుకుంటున్న ఆచార వ్యవహారాలను నిర్ణయిస్తాయి. అవి మతంలో భాగమైనప్పుడు విశ్వాసంగా మారి భౌతిక పరిస్థితులు మారినా, భిన్న భౌగోళిక పరిసరాల్లో కూడా సంప్రదాయంగా కొనసాగుతాయి. మహమ్మదీయులు శవాలను ఖననం చేయటం, వారి స్నానపానాదులు మహమ్మదీయ మతం పుట్టినచోట భౌగోళిక పరిస్థితులను బట్టి ఏర్పడ్డ అలవాట్లు ఖురాన్‌లో చెప్పిన షరియత్ చట్టం మొదలైనవి ఒక ప్రత్యేక చారిత్రక పరిస్థితులలో ఏర్పడ్డాయి. ఇవన్నీ మాతాచారాలుగా వేరే దేశాలలో వేరే కాలాలలో కూడా అవి అట్లాగే కొనసాగుతున్నాయి. వ్యవసాయం జీవితం ఆధారంగా రూపొందిన వివాహాది కర్మకాండలు మారిన ఆర్థిక పరిస్థితుల్లో నేటికీ అట్లాగే కొనసాగటం చూడవచ్చు. దీన్నిబట్టే తరతరాలుగా సంక్రమించే సంప్రదాయమే సంస్కృతి. అన్న అభిప్రాయం ఏర్పడి ఉంటుంది. ఆ మధ్య మన రాష్ట్రంలో ఒక ఉన్నత విద్యాపీఠాధిపతి విద్యార్థులను సంస్కృతీపరులుగా తీర్చిదిద్దటం తన ధ్యేయం అని ప్రకటించాడు. ఆయన ఉద్దేశించినది తాను విద్యార్థిగా ఉన్నప్పుడు కనీసం పాలనలోని ఆధునికతకు కూడా నోచుకోని ఫ్యూడల్ సంస్థానంలోని ఒక వర్గానికి సంబంధించిన సంస్కృతి అయి ఉండాలి. ప్రస్తుతం విద్యార్థుల ప్రవర్తనకు సమకాలీన అరాచక సామాజిక, రాజకీయ పరిస్థితులతో సంవదించుకోవటం తెలియక, విద్యార్థుల ప్రవర్తనను తను విద్యార్థిగా ఉన్న నాటి పరిస్థితులతో పోల్చుకొని ఆయన ఖంగుతిని ఉంటాడు. విభిన్న ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థలలో పుట్టిన మానవ సంబంధాలు సంస్కృతీ విభేదాలు ప్రత్యేక తెలంగాణా, ఆంధ్ర ఉద్యమాలకు దారితీసాయి. పైకి అవి మానసికమైనవిగా కనిపించినా వాటి పునాది ఆర్థికమైనది. మతపరమైన సంస్కృతి పేర, ద్విజాతి సిద్ధాంతం పేర పాకిస్తాన్ అవతరించినా పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లు ఆ దేశం చీలక తప్పలేదు. బంగ్లాదేశ్‌లుగా ఏర్పడటానికి కారణం పైకి ప్రత్యేక భాషా, సంస్కృతులుగా కనిపించినా, అక్కడి ఆర్థిక పరిస్థితుల వల్ల పుట్టిన అసంతృప్తిని రెచ్చగొట్టటానికి అవి సాధనాలు మాత్రమే అయ్యాయి. ఇరాన్‌లో షా అనుసరించిన వలస ఆర్థిక విధానానికి వ్యతిరేకంగా చేసిన పోరాటానికి మతశక్తులు దోహదం చేశాయి. సరియైన ఆర్థిక విధానంలేని ఆ శక్తులు అధికారానికి వచ్చిన తరువాత ప్రజల దృష్టిని తమ సమస్యల నుండి మళ్ళించటానికి స్వమతానికే చెందిన ఇరాక్‌తో కొన్ని సంవత్సరాలుగా యుద్ధం కొనసాగిస్తూనే ఉన్నాయి. యుద్ధం

మొదలైన రోజులలో ఆర్యజాతికి, ఆర్య సంస్కృతికి వ్యతిరేకంగా యుద్ధం చేస్తున్నామని ఇరాక్, అరబ్బులకు వ్యతిరేకంగా యుద్ధం చేస్తున్నామని ఇరాన్ పరస్పరం ప్రకటించుకొన్నాయి. కాని ఆ దేశాలను పాలించేవారి ఆర్థిక విధానాల వైఫల్యాలే ఆ యుద్ధాలకు ప్రధాన కారణం. తమ వర్గ ప్రయోజనాలను కాపాడుకోవడానికి మతాన్ని సాధనంగా వాడుకోవటం ఈ మధ్య పెరుగుతున్నది. కారంచేడు బాధితులైన హరిజనులు క్రైస్తవులు. వాళ్ళంతా ఐక్యతతో నిలచి భూస్వాములను ఎదిరించి నిలవటంతో భూస్వామ్యవర్గం 'హిందూమత రక్షణ' 'క్రైస్తవుల దాడి నుంచి హిందువులకు రక్షణ' అన్న నినాదాలను చేపట్టింది. గోవాలో కొంకణి, మరాఠీ భాషావాదం కేథలిక్‌లకు, హిందువులకు మధ్య చీలికగా పరిణామం చెందుతున్నది.

సమకాలీన ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థల భావ ప్రతిబింబం, ప్రవర్తనాసరళి, జీవన విధానం సంస్కృతి అయితే ఆర్థిక విధానాలలోని, పాలనా వ్యవస్థలోని వైరుధ్యాలు సంస్కృతిలోనూ ప్రతిబింబిస్తాయి. అధికారంలో ఉన్నవారు ఈ వైరుధ్యాలను తమ అస్తిత్వం కోసం పెంచిపోషిస్తూనే ఉంటారు. జాతీయ సంస్కృతిగా ఈరోజు చెప్తున్నది నూతన ఆర్థిక వ్యవస్థ పునాదిగా ఏర్పడ్డ సమకాలీన సర్వసాధారణ సంస్కృతి కాదు. సంప్రదాయ సంస్కృతి పేరిట భూస్వామ్య సంస్కృతి, దేశ ఆర్థిక వ్యవస్థపైన పెత్తనం చేస్తున్న సామ్రాజ్యవాద సంస్కృతులకు పుట్టిన వింత శిశువు అది. విరుద్ధ ఆర్థిక విధానాల ఫలితమైన రాజకీయ సంస్కృతి అది. సాంస్కృతిక ప్రదర్శనల పేరిట జరిగే మత ఉత్సవాలలో, ఊరేగింపులలో, కళలలో ఈ సంస్కృతి ప్రతిఫలిస్తున్నది. బొంబాయి లాంటి నగరాలలో ఏ మతానికి సంబంధించిన ఊరేగింపుల్లోనయినా స్మగ్లర్ల, బ్లాక్ మార్కటీర్ల పాత్ర తెలియంది కాదు. తమ అస్తిత్వం కోసం ఈ మేళాలలో పాల్గొనటానికి రాజకీయ నాయకులు పడే పాట్లూ తెలియనవి కావు. సాంస్కృతిక పాట్లూ తెలియనివి కావు. సాంస్కృతిక కార్యక్రమాల పేరిట జరిగే ప్రదర్శనలలో కూడా ఈ వైరుధ్యాలు కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి.

ఆర్థిక అసమానతలు, ఆర్థిక విధానాలలోని వైరుధ్యాలు, జాతీయత పేరిట భూస్వామ్యయుగంనాటి భావాలు, ఆధునికత పేరిట పాశ్చాత్యీకరింపబడుతున్న పై వర్గం జీవన విధానం, స్వాతంత్ర్యానికి ముందు వలస ఆర్థిక వ్యవస్థ నాటిపోయిన భ్రమత్మాకమైన సాంస్కృతిక ఆధిక్యతా భావన, ఆలోచనలు, మధ్యయుగం నాటి స్త్రీ పురుష సంబంధాలను నేటికీ ఆదర్శంగా చూపే కౌటుంబిక గాథలతో వస్తున్న సినిమాలు, సినిమాలే పెంచుతున్న ప్రతీకార సంస్కృతి, విభిన్న సంస్కృతులను దేనికదే

వేరువేరుగా గుర్తింపును పెంచుకోవటానికి దోహదం చేస్తూ కృత్రిమ ఐక్యతను ప్రచారం చేయటానికి ఉపయోగిస్తున్న ఆధునిక వైజ్ఞానిక సాధనాలు, ఎంత ఎక్కువగా లాభం చేకూర్చిపెడితే అంత గొప్పదిగా చలామణీ అయ్యే వ్యాపార సంస్కృతి, తదనుగుణంగా పెరుగుతున్న మానవ సంబంధాలు, వ్యక్తుల ప్రవర్తనా విధానాలు అరాచక సంస్కృతిని పెంచి పోషిస్తున్నాయి. గత సంస్కృతిలోని ఉత్తమ లక్షణాలను కాక అవలక్షణాలనే ప్రస్తుత సంస్కృతి పుణికి పుచ్చుకుంటున్నది. క్రౌర్యం పక్కనే కొనసాగిన భూస్వామ్య సంస్కృతిలోని మంచి లక్షణాలైన మానవ సంబంధాలను వదలి దానికి సంబంధించిన భావజాల సంస్కృతే సంస్కృతిగా చెలామణీ అవుతున్నది. ప్రజాస్వామ్య సంస్కృతిలోని స్వేచ్ఛా భావాలు వ్యక్తి ప్రాధాన్య వాదంగా మిగిలిపోయాయి.

మధ్యయుగంలో కళలు, మతాలు దేవాలయాలు చుట్టూ తిరిగేవి. అప్పటి ఆర్థిక వ్యవస్థ కూడా అంతే. ఉత్పత్తి పంపకం దేవాలయాలపైన, దేవభోగాలపైన, ఆధారపడి ఉండేవి. అందుకా దేవాలయాలు కళలకు కూడా కేంద్రాలయ్యాయి. ఆ రూపంలోని కళల పునరుద్ధరణను ఆధునిక వైజ్ఞానిక సాధనాలైన సినిమాలు ప్రచారం చేస్తున్నాయి. ధర్మ శాస్త్రాలను వర్ణాశ్రమ వ్యవస్థను సృష్టించిన అగ్రవర్ణాలవారే వాటిని ఛేదించగల సమర్థులన్న అభిప్రాయాన్ని కలిగించే సినిమాలూ వస్తున్నాయి. వాటిని ప్రభుత్వాలు ఆదరిస్తున్నాయి. నిన్నటి తరంలోని సామాన్యుల కళా నిర్మాణాలను కాపాడుకోవలసిన అవసరం ఉన్నమాట నిజమే కాని వాటినే ఆ రూపంలోనే పునరుద్ధరించాలనటం సమకాలీన వాస్తవాలను గుర్తించక పోవటమే. నిజమైన జాతీయ సంస్కృతి అంటే పూర్తిగా పాత సంస్కృతి గాని, దిగుమతి సంస్కృతి గాని కాదు. అలాగే ఉత్పత్తి సాధనాల మీద అధికారం గల పాలకవర్గ సంస్కృతి అంతకంటే కాదు. ప్రజాబాహుళ్య సంస్కృతే జాతీయ సంస్కృతి. సమకాలీన జీవిత వాస్తవాలను ప్రతిబింబించే సంస్కృతే నిజమైన జాతీయ సంస్కృతి, పాత సంస్కృతిలోని సామాజికాంశం గల ఉత్తమ లక్షణాలను మాత్రమే అది స్వీకరిస్తుంది. ప్రస్తుత అరాచక సంస్కృతి వ్యాపించి ఉన్న దశలో ఈ నూతన సంస్కృతిని నిర్మించటానికి ప్రయత్న పూర్వకంగా కృషి చేయవలసి ఉంటుంది. అందుకోసం దానికి తగిన ఆర్థిక వ్యవస్థను రూపొందించుకోవాలి.

**(డిసెంబర్ 1985 ప్రజాసాహితి పత్రిక నుండి...)**

# ౩. జాతీయోద్యమ సంస్కృతి - పూర్వరంగం

**– డా॥ వకుళాభరణం రామకృష్ణ** (చరిత్ర పరిశోధకులు, హైదరాబాద్)

సంస్కృతి, నాగరికతలు రెండూ వేర్వేరు చారిత్రకాంశాలు. అవి చరిత్రలో భాగాలు. ప్రజల జీవన రీతిని వ్యక్తపరిచేది సంస్కృతి. సంస్కృతిలో మతంతోపాటు తాత్వికత, జీవన విధానం, లలిత కళలు విడదీయరాని భాగాలుగా వుంటాయి. అంటే, మతం ఆధ్యాత్మికపరమైనదే గాక భౌతిక పరంకూడా. వాస్తవంలో ఆధ్యాత్మిక సంస్కృతీ విశేషాలు, భౌతిక సంస్కృతి పునాది నుండి పుట్టుకొచ్చినవే – భౌతికంగా, ఏదేని ఒక సమాజం ఎదుగుతున్న సమయంలో, ఆదిమ దశ నుండి ఆధునిక దిశదాకా, మానవాళి నిరంతర ప్రగతివర్గం నుండి, దశలవారీగా, సంస్కృతి మార్పులకు లోనవుతూ రూపు దిద్దుకుంది. సంస్కృతి ఏకశిలాసదృశం కాదు. రెండు విభాగాల సంగమం. సమాజంలో వున్నత వర్గాల, సామాన్య ప్రజల సంస్కృతులు ఒకటి కావు. కొన్ని సామాన్య లక్షణాలున్నా, ఉన్నత వర్గాల సంస్కృతికి రాజ్యం (స్టేట్) ప్రాముఖ్యత యిచ్చి, ప్రజా సంస్కృతి పట్టించుకోకున్నా, ప్రజల సంస్కృతి, సమాజపు అట్టడుగు వర్గాల్లో, పొరల్లో దాగి వెలుగొందుతూ వుంటుంది. ఇది నిత్యనూతనం, సామాన్య ప్రజానీకపు ఊపిరులే యీ సంస్కృతికి జీవగర్రలు.

1857 తిరుగుబాటు తర్వాత వలస పాలన మూడోదశలో, ఆంగ్ల పాలనా స్వభావంలో మార్పు రావడం, ముందున్న భారతీయ సమాజాన్ని 'ఆధునీకరించి' తమ వాణిజ్య ప్రయోజనాలను పరిరక్షించుకోవాలన్న విధానానికి భిన్నంగా, తమ పాలనను శాశ్వత పర్చుకోవాలన్న ధ్యేయం బలపడింది. దాని ఫలితమే, విద్యాభివృద్ధి జరిగి (ఆంగ్లేయుల ప్రయోజనం కోసమే) సామాజిక, రాజకీయ మార్పు బలంగా మొదలై, క్రమేపీ 1885 నాటికి జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావానికి దారితీసింది.

ఇదలా వుంచి, వలస పాలన రెండవ దశలో (19 శతాబ్ది మొదటిభాగం వరకూ), దేశంలో, ముఖ్యంగా బెంగాల్‌లో సాంస్కృతిక పునరుజ్జీవనానికి దారులేర్పడ్డాయి. రామ్మోహన్‌రాయ్ దీనికి ఆద్యుడుగా చెప్పుకొన్న, రాయ్ సమకాలికులు, ముందున్న సంస్కరణ భావాలలో సామాజిక సంస్కరణల పట్ల ఆసక్తి పెరిగి, బ్రహ్మ సమాజంతోపాటు, యితర ఉద్యమాలు ఆరంభమై పలు

ప్రాంతాల్లో మొలకలెత్తాయి. ఇందులో భాగంగానే, ఆంధ్రదేశంలో గోదావరి మండలం కేంద్రంగా, జాతీయ సంస్కృతికి సామాజిక సంస్కరణల రూపంలో పునాదులు ఏర్పడ్డాయి. ఇక్కడొక సైద్ధాంతిక అంశాన్ని ప్రస్తావించి, ఆంధ్రదేశానికి వద్దాం.

రాజకీయ చైతన్యానికి ముందు, నేపథ్యంగా సాంస్కృతిక రంగంలో చలనం ఆరంభమవుతుందని ప్రముఖ సామాజిక వేత్త, అంబేద్కర్ పేర్కొన్నాడు.

"The study of the history of national liberation struggles shows that generally these struggles are preceded by and increase in expression of culture, consolidated progressively into a successful or unsuccessful attempt to affirm the cultural personality of the dominated people, as a means of negating the oppressed culture. Whatever may be the conditions of the people's political and social factors in practicing this domination it is generally within the culture that we find the seed of opposition, which leads to the structuring and development of liberation movement."

"In our opinion the foundation of national liberation rests in the inalienable right of every people to have their own history... The object of national liberation is, therefore, to reclaim the right, userped by imperiolist domination... The liberation of the process of development of national productive forces."

పై కొటేషన్‌లో, జాతీయవాద ఆవిర్భావానికి పూర్వం, సాంస్కృతిక రంగంలో చైతన్యం మొదలవుతుందనుంది. ఈ సైద్ధాంతిక కోణాన్ని భారతదేశ జాతీయోద్యమానికి అన్వయించడమే కాక, ఆంధ్రదేశంలో జాతీయోద్యమానికి, జాతీయ సంస్కృతి పెరుగుదలకు అన్వయించుకోవచ్చు.

గోదావరి ఆనకట్ట నిర్మించేనాటికి, ఆ ప్రాంతంలో సామాజిక మార్పులు పొడసూపిన దాఖలాలున్నాయి. సామినేని 'హితసూచని' సరే! జియ్యర్ సూరిలాంటి సంస్కర్తలు రావడం మరో విశేషం. ఇవి ఏం తెలియచేస్తున్నాయి. సమాజపు అట్టడుగు పొరల్లో చలనం, మథనం జరుగుతోంది. ఆంగ్ల విద్య యింకా రాలేదు యీ

ప్రాంతానికి. 1850 ప్రాంతాల్లో 'ఆధునిక విద్య'కు పునాదులేర్పడుతున్నాయి. మిషనరీలు వున్నారు. ఆంగ్ల పాలనలో భూ సంబంధాలు, పాలనాపరమైన మార్పుల ప్రభావం క్రమేపీ పెరుగుతున్నది. చిన్న, చితకా సమాజాలు ఏర్పడి, శిష్టుల (ఎలైట్స్) ఆలోచనల్లో మార్పు మొదలైంది. సామాజిక చలనం ఊపందుకోవడానికి, గోదావరిపై ఆనకట్ట నిర్మించిన తర్వాత కాలంలో వచ్చిన ఆర్థిక మార్పులూ ఇతోధికంగా తోడ్పడ్డాయి. ఆనకట్ట, ఆర్థికాభివృద్ధికి తోడ్పడి, గోదావరి మండలం రాజధానిలో, 13వ స్థానంలో (22 జిల్లాల్లో) వుండిన గోదావరి మండలం రెండవ స్థానానికి ఎదిగింది. జనాభా (1891 జనాబా లెఖ్ఖలు) మూడు వందల శాతం పెరిగింది. మిగతా వివరాల్లోకి పోకుండా దీనికి వుదాహరణగా రేట్ స్కూల్స్ (Rate schools) స్థాపన గూర్చి పేర్కొనాలి. ఆర్థిక స్థితిగతులు మెరుగుపడినందున, రైతులు, టేలర్ అనే ఆంగ్లోద్యోగి ద్వారా తాము ప్రత్యేక రుసుం చెల్లించి పాఠశాలల స్థాపనకు దోహదం చేస్తామనడం, యీ క్రమంలో రేట్ స్కూల్స్ ఏర్పడ్డం, ఆర్థిక పరిస్థితులతో పాటు, సాంస్కృతిక, వైజ్ఞానిక ప్రగతికి దోహదం చేకూర్చినట్లయింది. గోదావరి పంటకాలువలను బకింగ్‌హామ్ కెనాల్‌తో కలిపి, మద్రాసు (రాజధాని) రేవులో సరుకుల వ్యాపారం మొదలైంది. పట్టణీకరణ ఆరంభమైంది. గ్రామాల నుండి అప్పుడప్పుడే పుట్టుకొస్తున్న చిన్నా, చితకా పట్టణాలకు ప్రజలు తరలడంతో ఆధునిక భావాలకు అంకురార్పణ జరిగింది.

ఇదీ, నేపథ్యం. కాగా, గోదావరి మండలం సాంఘిక పునరుజ్జీవానికి కేంద్రమని అనడంలో ఔచిత్యం వుందా? 19వ శతాబ్ది అంతానికి రాజమహేంద్రవరంలో ప్రాజ్ఞా (Enlightened) వాతావరణం నెలకొంటున్నదని చెప్పగలం. ప్రభుత్వ పాఠశాల కళాశాల (మూతపడి కొంతకాలానికి మళ్ళీ ప్రారంభమైంది). ఉత్తరాంధ్ర, విద్యాభివృద్ధికి కృషి చేసిన మెట్‌కాఫ్, వార్తా పత్రికలు ఇత్యాదివి అక్కడ వుండడం కొన్ని కారణాలు. ఒక వాతావరణం వుంది. ముందే చెప్పుకొన్నట్టు, కొందరు వ్యక్తులు, వారి రచనలు వున్నాయి. న్యాయశాఖకు చెందిన కోర్టులు వగైరా పనిచేస్తున్నాయి.

ఇక్కడ మనం, రాజమండ్రి కేంద్రంగా కాకినాడ తదితర ప్రదేశాలు ఉప కేంద్రాలుగా, లేక క్రమేపీ ప్రముఖ కేంద్రాలుగా రూపొందడం గమనించగలం. కందుకూరి వీరేశలింగం పంతులు సంస్కరణోద్యమాలు ప్రారంభించి, కోస్తా ప్రాంతానికి విస్తరింపచేయడం, దేశానికే తలమానికమైంది. దక్షిణ దేశపు

విద్యాసాగరుడుగా (విద్యాసాగర్ ఆఫ్ సౌత్ ఇండియా) ప్రస్తుతింపబడ్డారు. కాకినాడ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వచ్చి, బ్రహ్మ సమాజాన్ని నిర్మించి, శాఖోపశాఖలుగా విస్తరింపచేసిన బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు, అక్కడ, పిఠాపురం రాజా సాయంతో నిర్మించిన సంస్థలు, నేటికీ నిలిచే వున్నాయి. కాకినాడలో పురమందిరం లాంటిది నిర్మించి, లిటరరీ అసోసియేషన్ స్థాపించి, నిర్వహించిన, వీరేశలింగం ఉద్యమాలకు ఆర్థిక సాయం అందించిన పైడా రామకృష్ణయ్య – ఆ తర్వాత కాలంలో, చిలకమర్తి, రాయసం వెంకటశివుడు – మరెందరో మహానుభావులు – జాతీయ సంస్కృతీ నిర్మాణానికి దోహదం చేశారు.

గోదావరి మండలం కాకున్నా, యిక్కడ కార్యకలాపాలను గమనిస్తూ సాహిత్యంలో సంస్కారానికి దారులు వేసిన గురజాడ, **"కందుకూరి వీరేశలింగం నిశ్చయముగా మహాపురుషుడు"** అని కొనియాడుతూ జాతీయ సంస్కృతి ప్రతిబింబించే దేశభక్తి గీతాన్ని రచించాడు.

*(జాతీయ సంస్కృతి ఏర్పడ్డం, మొదలవడం వరకే*
*యీ వ్యాసపరిధి. విస్తరణ మరోసారి)*



*"ఎందరో కళాకారులు కాలగర్భంలో కలిసిపోయారు. చరిత్ర వాళ్ళని తన పేజీల్లో రాసుకున్నట్లు దాఖలాలు లేవు. ఈ దేశంలో కళకన్నా కులం ముఖ్యమైనది. కళని కూడా కులం తక్కెట్లో తూచారు. భూమ్మీద ఇన్ని పాటలు పుట్టాయి. ఈ పాటకి ప్రాణం పోసిందెవరు? ఆ ప్రాణానికి రాగం ఇచ్చినదెవరు? భూమ్మీద జరిగిన ప్రతీ పనిలోంచి పాట పుట్టింది. నాట్లు వేస్తో నాట్ల పాటలు పాడారు. కలుపుతీస్తో కలుపు పాటలు పాడారు. కోతలు కోస్తో కోతల పాటలు పాడారు. ఆ పాటల్లో జీవితం దాచారు. ప్రణయం, శృంగారం, హాస్యం, కరుణ మహామహాకవులు రాసినట్లు కృత్రిమంగా కాకుండా, చాలా సహజంగా గాలీ, నీరూ, సూర్యుడు, చంద్రుడు, చుక్కలు ఉన్నంత సహజంగా పలికించారు. శ్రమ చేసిన భూమి వారికి కాకుండా పోయినట్టే పాట నిలిచినా ఆ పాట అల్లింది వాళ్ళని చెప్పుకోడానికి ఈ విశాల విజ్ఞానం ఎందుకు కుంచించుకు పోయింది?"*

# 4. సంస్కృతి

– డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
(కేంద్రసాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత, అనంతపురం)

**"కేవలం సంపదలకే కాదు
సంస్కృతికి కూడా మూలం ప్రజాశక్తే"**

*(చలసాని ప్రసాద్, సాహిత్యం–కళ–సంస్కృతి, సృజన ఫిబ్రవరి 1973)*

సంస్కృతి, నాగరికత అనే రెండు పదాలు మన వ్యవహారంలో నిరంతరం కలుగుతూ ఉంటాయి. ఈ రెండూ వేరని కొందరు – ఈ రెండూ ఒకటేనని కొందరు అభిప్రాయపడుతున్నారు. సంస్కృతి మారదని, నాగరికత మారుతుందని ఒక అభిప్రాయముంది. ఈ అభిప్రాయాలను అలా ఉంచి, సంస్కృతిని గురించి ఆలోచిద్దాం.

సంస్కృతి అనే పదాన్ని అనేక సందర్భాలలో అనేక పదాలతో కలిపి ప్రయోగిస్తూ ఉంటాం. వాటినన్నిటినీ పరిశీలిస్తే 'సంస్కృతి' ఒక్క మాటలో ఒక చిన్న నిర్వచనానికి లొంగేది కాదని, అది చాలా విస్తృతమైనదని అర్థమౌతుంది. ప్రాచ్య సంస్కృతి, పాశ్చాత్య సంస్కృతి, భారతీయ సంస్కృతి, తెలుగు సంస్కృతి, మత సంస్కృతి, ముద్రా సంస్కృతి, రాయలసీమ సంస్కృతి, ప్రాచీన సంస్కృతి తెలుగు సంస్కృతి, జానపద సంస్కృతి, దళిత సంస్కృతి, శ్రామిక సంస్కృతి, గ్రామీణ సంస్కృతి, వ్యవసాయ సంస్కృతి, భూస్వామ్య సంస్కృతి, మత సంస్కృతి, మార్క్సీయ సంస్కృతి, పాశవిక సంస్కృతి, దౌర్జన్య సంస్కృతి, రాజకీయ సంస్కృతి, కుల సంస్కృతి, లంచగొండి సంస్కృతి – ఇలా అనేక ప్రాంగణాలలో సంస్కృతి పదాన్ని ఉపయోగిస్తున్నాం. ఈ ప్రయోగాలను పరిశీలిస్తే సంస్కృతికి రంగు, రుచి, వాసన ఉంటాయని తెలుస్తుంది. అది ఎవరికీ అర్థంకాని బ్రహ్మపదార్థం కాదని అనిపిస్తుంది. ఒక ప్రాంతం, ఒక మతం, ఒక వృత్తి, ఒక అలవాటు, ఆచారం, భావజాలం, వంటి అనేక అంశాలు ముడిపడి ఉంటాయి. చూడబోతే సంస్కృతి, ఒక విద్యారూపంగా కనిపిస్తున్నది.

సాధారణంగా మన జీవితమే మన సంస్కృతి అని చాలామంది అంటూంటారు. మన జీవిత విధానమే మన సంస్కృతి. మన ఆచార వ్యవహారాలు, మన వేషభాషలు, మన ఆహార విహారాలు, మన మానవ సంబంధాలు, మన వివాహ బాంధవ్యాలు, మన పనిపాటలు, మన నివాస సంచారాలు, మన కళా

కార్యకలాపాలు మొదలైన వన్నీ సంస్కృతిలోని అంతర్భాగాలు. మన జీవితంలో ప్రతి అంగుళమూ మన సంస్కృతే. మానవులు నడిచివచ్చిన దారంతా మానవ సంస్కృతి పరచుకొని ఉంటుంది. చరిత్ర, సంస్కృతి అనే మాటల్ని జంటగా ఉ పయోగిస్తూ ఉంటాం. మనం నిర్మించే చరిత్ర మన సంస్కృతికి భూమిక. మనం నిర్మించే సంస్కృతి, మన చరిత్రకు చిత్రిక. చరిత్ర లేని జాతిలేనట్లే సంస్కృతి లేని జాతి కూడా ఉండదు.

సంస్కృతి ఎవరు నిర్మిస్తారు? ఒక కాలంలో ఒక స్థలంలో ఎవరు నివసిస్తున్నారో వాళ్ళే వాళ్ళ సంస్కృతిని నిర్మించుకుంటారు. సంస్కృతీ నిర్మాతలు, సంస్కృతి సృష్టికర్తలు ఎక్కడినుంచో ఊడిపడరు. ప్రజలే చరిత్ర నిర్మాతలైనట్లు, సంస్కృతీ నిర్మాతలు కూడా ప్రజలే. ప్రజలు తమ జీవితావసరాలకు కావలసిన సమస్త వస్తు సముదాయాన్ని సృష్టించుకున్నట్లే, సంస్కృతిని కూడా నిర్మించుకుంటారు. ఒకచోట ఒక ప్రజా సమూహం నివసిస్తున్నదంటే, అక్కడ సంస్కృతీ నిర్మాణం జరుగుతున్నదని అర్థం.

సంస్కృతిమీద ప్రాదేశిక అవసరాలు, ప్రాదేశిక వనరుల ప్రభావం ఉంటుంది. వీటికి అతీతంగా సంస్కృతి మనుగడ సాగించదు. స్థలకాలబద్ధమైన సంస్కృతి కాలాన్నిబట్టి, స్థలాన్ని బట్టి వైవిధ్యమూ, విస్తృతి కలిగి ఉంటుంది. సంస్కృతి జడ పదార్ధం కాదు. నిలవ నీటిమరుగుకాదు. అది చలన శీలం గలది. ప్రవాహగుణం గలది. స్థానిక కాలమాన పరిస్థితులు మానవ జాతి సంస్కృతిని నిర్ణయిస్తాయి. స్థానిక కాలమాన పరిస్తితులంటే ఒక నిర్దిష్టకాలంలో, నిర్దిష్ట స్థలంలో సంభవించే పరిణామాలని అర్థం. "The October Revolution and Socialism have also enriched the history of mankind by bringing about the intellectual and cultural emancipation of the working people" అన్నారు సోవియట్ రష్యా నాయకుడు అయొనిర్ బ్రిజ్నెవ్. (Essay : culture and social progress by K.M. Dolgov) ఒక మహోన్నతమైన మానవ జాతిచరిత్రనూ, సంఘ సంస్కరణ ఉద్యమం మొదలు నేటి ప్రపంచీకరణ దాకా అనేక ఉద్యమాలు, భావజాలాలు, పరిస్థితులు మన సంస్కృతిని తాకాయి.

భారతీయ సంస్కృతి అంటే మన కళలు, సాహిత్యం మాత్రమే కాదు. విశేష సందర్భాలలో మనం పాడుకొనే పాటలు, ఆడు ఆటలే కాదు. మనిషి పుట్టింది మొదలు గిట్టేదాకా జరిగే సకల కార్యకలాపమూ సంస్కృతే. సాధారణంగా "భిన్నత్వంలో

ఏకత్వం" అన్నది భారతీయ సంస్కృతి అని మనం చెప్పేసుకుంటూ ఉంటాం. భారతదేశంలో అనేక మతాలు, అనేక కులాలు, అనేక భాషలు, అనేక ఆచారాలు ఉన్నా, అందరూ భారతీయులే అని భావించమని అర్థం. అయితే భారతీయ సంస్కృతి అంటే భిన్నత్వంలో ఏకత్వమా? లేక ఏకత్వంలో భిన్నత్వమా? అనే చర్చకూడా ఉంది. ఏదైనా ఈ సంస్కృతీ తీర్మానం ప్రజలదే అన్నది కల్తీలేని నిజం. అనేక చారిత్రక దశలలో ప్రజలు అప్పటి కవసరమైన సంస్కృతిని నిర్మించుకుని, కాలక్రమంలో అవసరమైనంత వరకు పాతదానికి కొత్తదనాన్ని చేర్చుకొని సాంస్కృతిక పునర్నిర్మాణాన్ని కొనసాగిస్తారు.

ఏ దేశ సంస్కృతికైనా క్రమవికాసం ఉంటుంది. చరిత్ర ఒకరి ఇష్టప్రకారం నడవనట్లే, సంస్కృతి కూడా ఒకరికి అనుకూలంగా నిర్మాణం కాదు. అది సామూహిక సృష్టి. సంస్కృతికి సమాఖ్య స్వభావముంటుంది. అది అల్పసంఖ్యాకుల గుత్తసొత్తుకాదు. అది సమస్త మానవ జాతి సమాహార విశేషం.

తెల్లగా మిషనులో ఆడించిన బియ్యం వండుకొని తినేవాడెంత సంస్కృతీ పరుడో కారంతో జొన్నరొట్టె అద్దుకొని తినేవాడూ అంత సంస్కృతీ పరుడు. ఏంటండీ అనేవాడే కాదు, ఏవప్పా అనేవాడూ సంస్కృతీ పరుడే. సంస్కృతిలో హెచ్చుతగ్గు లెన్నడం సంస్కారం కాదు. "సామజాతమాయె / సకలకులము" అని వేమన అన్నట్టు సంస్కృతిలోని వైవిధ్యమంతా సామజాతమే. అందులో ఎక్కువ తక్కువలు లేవు.

సంస్కృతి మానవజాతి సుదీర్ఘ కాలసామూహిక శ్రమ ఫలం. అది అందరిది. కొందరిది కాదు. మానవ ఆకారాలు, ఆలోచనలు, అనుభూతులు అవసరాలు సంస్కృతి పునాదులు. సామాజిక వ్యవస్థలను బట్టే సంస్కృతీ నిర్మాణం జరుగుతుంది. ఇంకోరకంగా మన సంస్కృతి మన సామాజిక వ్యవస్తకు ప్రతిఫలనం. రాచరిక భూస్వామ్య వ్యవస్థలో మానవ సంబంధాలు అన్ని సందర్భాలలో దాని కనుగుణంగానే ఉండేవి. పెట్టుబడిదారీ వ్యవస్థలో పాత సంబంధాలు నశించి కొత్తగా పెట్టుబడిదారీ సంబంధాలు ఉద్భవించాయి. ప్రజాస్వామ్య యుగంలో ఆ సంబంధాలు నశించి ప్రజాస్వామ్య సంబంధాలు ఉద్భవిస్తున్నాయి. ఈ మానవ సంబంధాల సారమే మన సంస్కృతి.

సంస్కృతి మానవజాతి సౌందర్యభావనా ప్రతిఫలనం. మానవుడు తన సమాజాన్ని ఎంత అందంగా మలచాలనుకుంటాడో ఆ ఆకాంక్షా ప్రతిఫలనమే సంస్కృతి. సమాజాన్ని వికారంగా బీభత్సంగా మార్చేవాడెవడూ సంస్కృతీపరుడు కాదు. సమాజాన్ని నిన్నటికన్నా ఇవాళ, ఇవాల్టికన్నా రేపు మరింత అందంగా తీర్చిదిద్దేవాడే సంస్కృతీపరుడు. ఏకాంత వాసంలో మగ్గిపోయే వాళ్ళకన్నా ఆరుబయట అందరి మధ్య బతికేవాళ్ళే అందరితో కలిసి శ్రమించి సుఖించేవారే సంస్కృతీపరులు. మాలపల్లి నవలలో జొన్న చేనులోకి వెళ్ళిన రామదాసు, మంచె ఎక్కి చేనంతా చూసి, "వెనక చల్లినది పండితే గాని పోలి ఉండదు ముందు యెక్కి వచ్చిన ఏ పరికర్రలోపండితే యేం ప్రయోజనం? అందరూ బాగుంటేనే బాగు" అనుకుంటాడు. ఆయన సంస్కృతీపరుడు. "కూలి వాళ్లంతా యెట్లా జీవిస్తారో మాకవసరం లేదు. వాండ్లందరినీ పోషించవలసిన బాధ్యతా మాకు లేదు" అని దబాయించే చౌదరయ్య సంస్కృతీపరుడు కాదు.

*పదుగురికీ కలిమిని పంచి*
*అందరిలో చెలిమిని పెంచి*
*తన గడ్డను తెరిచి దిద్దే*
*మనిషే మనిషిరా*
*ఆ మనసే మనసురా*

*(డా. సి.నారాయణరెడ్డి : రైతు కుటుంబం సినిమాలో పాట)* అనుకునేవాడు సంస్కృతీపరుడు. సంస్కృతి సామాజికం, చారిత్రకం, సౌందర్యాత్మకం.

**ముగ్గురు వ్యక్తులు సంస్కృతిని నిర్మిస్తారు.**
**శాస్త్రజ్ఞుడు, కళాకారుడు, శ్రామికుడు**

– *మాక్సింగోర్కి : గోర్కి సాహిత్యవ్యాసాలు*



# 5. సంస్కృతిలో మిగుల్చుకోవలసినవీ, వదుల్చుకోవలసినవీ

– **దివికుమార్** (రాష్ట్ర అధ్యక్షులు : జనసాహితి, విజయవాడ)

సంస్కృతిలోని ఏ అంశాలను మిగుల్చుకోవాలో, వేటిని వదుల్చుకోవాలో గ్రహించటం చాలా సున్నితమైన, సంక్లిష్టతతో కూడిన విషయం! సంస్కృతిని ప్రభావితం చేసిన సాహితీకారుల కృషి వారి విశిష్టతలను బేరీజువేయటం కూడా అంతే. సంస్కృతొక్కటే కాదు ఏదీ శూన్యం నుండి నిర్మాణం కాదు. సంస్కృతి సామాజిక సంఘర్షణకు చలనానికి అతీతంగా, వాటి వెలుపల రూపొందేది కాదు. సామాజిక సంబంధాల, మానవీయ భౌతిక, ఆత్మికతత్వాల వ్యక్తీకరణగా రూపంకట్టే సంస్కృతిని చారిత్రక పరిణామక్రమంలో, నిర్దిష్ట కాల పరిమితుల్లో, ప్రగతికీ అభివృద్ధి నిరోధకత్వానికీ నడుమ సంఘర్షణ – చలనంలో భాగంగా పరిశీలించాలి.

"నూరు దోషాలలో వొక సుగుణం – నూరు పుణ్యాలలో ఒక ఘోరం" అన్నాడు శ్రీశ్రీ. వ్యక్తిలోగాని, సంఘంలోగానీ దోషమూ సుగుణమూ విడివిడిగా వుండవు. ఏక కాలంలో కలగలసీ వుంటాయి. కలహించుకుంటూ వుంటాయి. మనం మిగుల్చుకోవలసినవీ, వదుల్చుకోవలసినవీ అర్థం చేసుకోవటంలోనే ఆయా వ్యక్తుల, శక్తుల సాంస్కృతిక వివేచనా, సామాజిక దృక్పథమూ, సాంఘిక చైతన్యమూ ఎరుకలో కొస్తాయి.

నన్నయ కాకపోతే మరొక చిన్నయ – తెలుగు సాహిత్యం నోటిమాటల రూపంలోనూ, జ్ఞాపకాల సంపుటిగానూ మాత్రమే వుండిన కాలంలో దానికొక అక్షర రూపం కల్పించటం; భాషను మౌఖిక రూపాన్నుండి గ్రంథస్త రూపానికి మలచటం ఆనాటికి ఆ మేరకు ఒకానొక సుగుణంగానే చెప్పుకోవాలి. సంస్కృత పదభూయిష్టమైన గ్రాంధిక పద ప్రయోగాలకు భిన్నంగా తిక్కనా, పాల్కురికి సోమనాథుడు, అన్నమాచార్యుడు తెలుగు ప్రజాసమూహాల వ్యావహారిక పదసంపదను, భాషా పలుకుబడులను తమతమ సాహిత్యాలలో రంగరించటం, భాషాభివృద్ధి క్రమానికి తోడ్పడిన సుగుణాలే. వారి వారి సాంఘిక దృష్టికీ భాషాసృష్టికీ గల సంబంధాన్ని కూడా గమనంలో వుంచుకోవాలి.

దోషాలను కూడా సుగుణంగా చెప్పే ప్రయత్నాలను అడ్డుకోదలచినవారు, ప్రజా దృక్పథానికి ప్రాతినిధ్యం వహించేవారు, సుగుణం నూరింట ఒక వంతే వుండినా పట్టించుకోకుండా వదిలేయకూడదు. ఎందుకంటే అలాంటి అనేక సుగుణాల

మొత్తమే మనం మిగుల్చుకోవలసిన, మన తర్వాత తరాలకు అందించాల్సిన సాంస్కృతిక విలువ అవుతుంది కనుక! వెతికి వెతికి పుణ్య పురుషుల్ని తెలుసుకోవాలని వేమన చెప్పినట్లు సారం లోతుల్లోకి వెడితే తప్ప సుగుణాన్ని సాధించలేము. ఘోరాన్ని మాత్రమే వందసార్లూ చెప్పుకుంటూపోతే మనం స్వీకరించాల్సిన పుణ్యం ఏం మిగులుతుంది? "మంచి గతమున కొంచెమేనోయ్" అని గురజాడ చెప్పినది దాన్ని గ్రహించి మిగుల్చుకోమనీ, చెడును వదుల్చుకోమనే!

"మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును"; "ఆధునిక స్త్రీ చరిత్రను తిరగరాస్తుంది" "దేశమంటే మట్టికాదు - మనుషులు", "మనిషికి ప్రమాణం కులంగాదు గుణం" అని నూరేళ్ళ క్రితమే విస్పష్టంగా ప్రకటించి, వ్యావహారిక భాషకున్న శక్తిని తన సాహిత్యం ద్వారా వ్యక్తం చేసిన గురజాడ, తన సమకాలీన సమాజం కంటే ఎంత ముందున్నాడు! ఆయన కాలం నాటికి అంతటి దూరదృష్టిని ప్రదర్శించిన మరో భారతీయ రచయితే లేడంటే అది ఆశ్చర్యంగాదు. ప్రసిద్ధికెక్కినవారు, అయినా, మతం లేని సమాజాన్ని వారు ఊహించలేకపోయారు. జ్ఞానం పెరిగినకొద్దీ మతం తరుగుతుందని గురజాడ సరిగ్గా గ్రహించాడు.

పైపైన చూస్తే జ్ఞానమూ పెరుగుతోంది, మతమూ పెరుగుతోందనిపిస్తోంది. రాజ్యాన్ని తానే శాసించిందా అన్నట్లుగా రాచరిక యుగంలో వెలిగిన మతం, యిప్పుడు దోపిడీ రాజ్యాలు ప్రజలకు సృష్టిస్తున్న దిక్కులేనితనం మీదా, వాటి బిచ్చపు మెతుకులమీదా దేబిరించుకుంటూ బతుకుతోంది. సామాజిక వైరుధ్యాలూ, సంక్షోభాలూ తీవ్రతరమైన కొలదీ మతంయొక్క "మారెమ్మ"తనం పెరుగుతున్నట్లే వుంటుంది. కానీ వైజ్ఞానిక శాస్త్రాభివృద్ధికి మతం విపరీతంగా భయపడుతోంది. మానవులు గ్రహిస్తున్న ప్రకృతి ధర్మాలను, గుణాలను, గడిస్తున్న విజ్ఞానాన్నీ, తమ దుష్ట దోపిడీ, అణచివేతలకు ప్రజల్ని పక్కదార్లు పట్టించటానికీ వినియోగించుకుంటున్న దోపిడీ, సామ్రాజ్యవాద శక్తులే, మరోవైపు మతాల్ని పక్కదార్లు పట్టించటానికీ స్వార్థ రాజకీయ, మార్కెట్టు ప్రయోజనాల కొరకు క్రూరంగా వినియోగిస్తున్నారు. నేటి 'మతం' దోపిడీ రాజ్యాలనే నూనెతో చీకటిని వెదజల్లుతున్న దీపం మాత్రమే.

గురజాడ తెలుగు జాతికొక జ్ఞానదీపం! తన కాలంలో గురజాడ విజయనగరం బజారుల్లో నడుచుకుంటూ వెడుతున్నప్పుడు, బ్రాహ్మనాభిజాత్యపు పెద్దలు, ఆయన సమీపించగానే నేలమీద కాండ్రించి ఊసేవారట! గుణ దోషాలను పుట్టుక కారణంగా ఎంచకూడదని చెప్పిన గురజాడను, మనుషుల్లో ఉన్నవి 'మంచి-చెడు' అనే రెండే

కులాలని చెప్పిన గురజాడను, ఆయన పుట్టుక కారణంగా నేడు విమర్శకు గురిచేసేవారు ఏ సంస్కృతిని మిగుల్చుకుని ఏ సంస్కృతిని వదుల్చుకోదలుచుకున్నట్లు?

తనకు విజయవాడలో జరిగిన ఒక ఘన సన్మాన సభ (1946)లో తన కాలికి బంగారు గండపెండేరాన్ని తొడిగిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిని 'శుభ రక్తనాళమని' అభివర్ణించారు గుర్రం జాషువా. గాంధీవాదం ద్వారా ఆర్థిక దారిద్ర్యమూ, సాంఘిక వివక్షలూ అంతరించగలవని ప్రగాఢంగా విశ్వసించిన గుర్రం జాషువా దళిత కవేగాని, దళితవాదకవి గాదు. ఆయనలోని దళిత ఆవేదన, ఆగ్రహం దళిత సమస్యకు ఒక పరిష్కారం దొరికేదాకా, మనం సాధించాల్సిన ప్రజాస్వామిక సంస్కృతి నెలకొనేదాకా, ప్రేరణగా నిలిచివుంటుంది. గుర్రం జాషువాలోని గాంధీవాది మిగిలివుంటాడా, దళితకవి నిలిచివుంటాడా అంటే రెండవదేనని చరిత్ర రుజువు పరిచింది.

మిగుల్చుకోవలసినది ఎరిగినవారే వదుల్చుకోవలసినదీ తెలుసుకోగలుగుతారు. "మా కొద్దీ నల్లదొరతనమని" నిచ్చెనమెట్ల బ్రాహ్మణీయ సాంఘిక వ్యవస్థను తీవ్రంగా నిరసించిన కుసుమ దర్మన్న తొలి దళితకవిగా పేరొందారు. తన దళిత భావజాలానికి ప్రజాస్వామిక ఆదర్శానికి ఆసరాగా వుంటారని భావించిన ప్రతి వ్యక్తినీ – రామానుజాచార్యుల నుండి, కందుకూరి, చిలకమర్తిదాకా – పూచిక పుల్లను కూడా వదిలేసుకోకుండా పోగుచేసుకున్న ఉద్యమకారుడు కుసుమ ధర్మన్న. ఆనాటి భారతదేశం వలస సమాజం. అది భూస్వామిక వ్యవస్థను పునాదిగా కలిగివుంది. వాటికి ప్రత్యామ్నాయంగా జాతీయ ప్రజాస్వామిక వ్యవస్థలనూ, సంస్కృతినీ నిర్మించుకోవటం నాటికీ నేటికీ మన ముందున్న కీలక కర్తవ్యం. గరిమెళ్ళవారి "మాకొద్దీ తెల్లదొరతనం" బ్రిటీషు సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ స్వభావం గల్గినదైతే, కుసుమ ధర్మన్న – నల్ల దొరతనం భూస్వామ్య వ్యవస్తనూ, బ్రాహ్మణీయ సాంఘిక వివక్షల పెత్తందారీ సంస్కృతినీ నిరసించినది. బ్రాహ్మణాధిక్యతాతత్వాన్ని ఖండిస్తూ, నిరసిస్తూ, వ్యతిరేకిస్తూ త్రిపురనేని రామస్వామి నడిపిన సాహిత్య, సాంఘికోద్యమం ఆనాటి చారిత్రక పరిస్థితులలో ప్రగతిశీల స్వభావం గలదే. చారిత్రక ప్రాముఖ్యమున్నదే. మన సమాజాన్ని ఒకడుగు ముందుకు నడిపించినదే! నేటి పరిస్థితులకు అన్వయించుకోవాల్సిన ప్రజాస్వామిక స్ఫూర్తిదాయకమైనదే!

ప్రశ్నించటాన్నే భరించలేని సమాజాన్ని లాగి లెంపకాయ కొట్టినవాడు చలం. ఏం చేయమన్నాడనేదీ చివరకు తానెక్కడకు చేరిందీ ప్రశ్నార్థకమే అయినా, స్త్రీల పట్ల కపటత్వమే విలువగా వుండిన పితృస్వామిక సమాజానికి ఆయనిచ్చిన షాక్ ట్రీట్‌మెంట్ ప్రభావాన్ని విస్మరించకూడదు. నిరంకుశ మునగాల జమీందార్లవద్ద

దివానుగా పనిచేసిన కొమర్రాజు లక్ష్మణరావు, తాను గ్రాంధిక భాషావాదే అయినా తెలుగుజాతి వికాసానికి ఆయన గావించిన చరిత్ర పరిశోధన, సాహిత్యకృషీ, గ్రంథాలయోద్యమం స్ఫూర్తిదాయకమైనవి, ఆ మేరకు పదిలపర్చుకోవాల్సినవీను! తెలుగువారి ఊపిరిపై కూడా నిఘాసాగిన నిజాం పాదుషాల పాలనలో, సురవరం ప్రతాపరెడ్డి లాంటివారు తెలుగు భాషా సాహిత్యాలను, చారిత్రక వారసత్వాలను వెలికితీసి జాతిని జాగృతపరచటంలో తర్వాత కాలపు మహోద్యమాలకు తొలి బీజాలు నాటటంలో విశిష్టకృషిని మరువకూడదు. మూఢ విశ్వాసాలతో కునారిల్లుతున్న సమాజంలో శాస్త్రీయ హేతువాద, బీజాల్ని చల్లిన గోపరాజు రామచంద్రరావు లాంటివారి కృషి నూతన సమాజానికి అవసరమైన ఆలోచనలు రేకెత్తటానికి దోహదపడినవే!

తెలుగు సమాజంపైనా, సాహిత్యంపైనా విశ్వనాథ సత్యనారాయణ ప్రభావం లేదనుకోవటం పొరపాటు. **"వేయి పడగల పాము, విప్పారుకొని వచ్చి, కాటందుకొనియె, కలలోన రాజును"** ఈ పద్యం **వేయి పడగలు** నవలకు ఆరంభం. ఎంత గొప్ప చారిత్రక సత్యాన్ని, వేయి పేజీల నవలయొక్క సారాంశాన్ని సరిగ్గా తల్లక్రిందులుగా చిన్న కవితగా చెప్పాడాయన! నాటి రాచరిక జమీందారీ వ్యవస్థ, అప్పుడే తలఎత్తి పెరుగుతున్న రైతు–కూలీ ఉద్యమాన్ని వేయిపడగలుగా భావించి భయవిహ్వాలమైపోయింది. అది తనను కాటువేసిందన్నట్టే పీడ కలలు గంటూ ఉలిక్కిపడింది. ఆ వ్యవస్తను, దాని నిచ్చెనమెట్ల కుల సమాజాన్ని, దాని కాలం చెల్లిన భూస్వామ్య సంస్కృతీ, విలువలను సమర్ధిస్తూ, ప్రచారం గావిస్తూ (కొద్ది మినహాయింపులతో) సాగినదే విశ్వనాథవారి సాహిత్య కృషి విశ్వనాథ – త్రిపురనేని; విశ్వనాథ – జాషువాల నడుమ సాంస్కృతిక సంఘర్షణ వుండేది. కానీ అది కాలక్రమంలో శ్రీశ్రీ–విశ్వనాథ సాహిత్యాల, దృక్పథాల నడుమ సంఘర్షణగా, వచ్చి అభివృద్ధి నిరోధకత్వానికీ విప్లవ ప్రగతిశీలతకూ నడుమ సంఘర్షణగా స్థిరపడింది. "నన్నయభట్టు విశ్వనాథ వేషంలో వచ్చాడనీ, విశ్వనాథ వేయేండ్ల క్రితమే జన్మించినవాడనీ" శ్రీశ్రీ చమత్కరించిందందుకే! వేల ఏండ్లనాటి భూస్వామ్య వ్యవస్థీకృత వికృత సంస్కృతికి విశ్వనాథ ప్రతీకయితే, శ్రామికవర్గ అంతర్జాతీయ దృక్పథంగల నూతన ప్రజాస్వామ్య సంస్కృతికి శ్రీశ్రీ ప్రతినిధి అయ్యాడు.

ఫ్రెంచ్ విప్లవం (1789) ఆధునిక ప్రజాస్వామిక చరిత్రకు ప్రాతిపదిక. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పటానికి ఒక విప్లవాత్మక మలుపుగా మానవ సమాజం దాన్ని పరిగణించింది. దాని తదనంతరం పరిస్థితులలో సామాజిక

విప్లవానికి రెండే వర్గాలు (బూర్జువా వర్గం లేక కార్మికవర్గం) నాయకత్వం వహించగలుగుతాయని ఆధునిక చరిత్ర నిరూపించింది. ఫ్రెంచ్ విప్లవంలో కూడా కార్మికవర్గం, రైతాంగం, పెటీ బూర్జువా వర్గాలు బూర్జువా వర్గ నాయకత్వాన ఐక్యంగా పోరాడినందువల్లే అది విజయం పొందింది.

భారతదేశంలోనూ, తెలుగు నాటా కాలంచెల్లిన రాచరిక సంస్కృతిపై ప్రశ్నలు, సాంఘికోద్యమాలు చెదురుమదురుగా, శకలాలుగా గతంలో కూడా వెలువడినాయి. కులవృత్తుల భూస్వామ్య సమాజం స్థానంలో ఆధునిక పారిశ్రామిక సమాజం రూపొందటానికి బూర్జువా విప్లవానికి - కావాల్సిన భౌతిక పరిస్థితులు పరిణితిచెందకముందే మనపై బ్రిటీషు వ్యాపార, వలస, సామ్రాజ్యవాద శక్తుల ఆధిపత్యం ఏర్పడింది. అభివృద్ధి చెందిన పారిశ్రామిక (సామ్రాజ్యవాద) దేశాలు, ప్రపంచాన్ని తమ పెట్టుబడితో చుట్టుముట్టాయి. పెట్టుబడిదారీ సంబంధాల వల్ల మన వ్యవస్థలో కొత్త వర్గాలు పుట్టుకొచ్చాయి. అవి 1. బూర్జువా వర్గం, 2. కార్మికవర్గం, 3. మధ్యతరగతి వర్గం.

వలస సామ్రాజ్యవాదుల ఆర్థిక – రాజకీయాల ప్రవేశంతో పాత వ్యవస్థలోని వర్గాలకు, సాంఘిక సమూహాల ఉనికికీ, అస్తిత్వానికి చలనం వేగవంతమైంది. భారతీయ బూర్జువావర్గమూ, పెటీబూర్జువా వర్గమూ, కార్మిక వర్గమూ పాత సమాజపు కులవృత్తుల వర్గాలు కావు. దీనితో కాలం చెల్లిన భూస్వామ్య సంఘాన్ని సంస్కృతిని వ్యతిరేకించటానికి కనీస ప్రాతిపదిక ఏర్పడింది. దేశభక్తి, జాతీయవాదము, లౌకికవాదము, ప్రజాస్వామ్యం, సోషలిజం మొదలైన భావజాలాలు, ఉద్యమాలు ప్రవేశించాయి, విస్తరించాయి.

రష్యా బోల్షివిక్ విప్లవ ప్రభావంతో శ్రామిక విప్లవ దృక్పధానికి ప్రాతినిధ్యం వహించగల కవిత్వంతో తెలుగుజాతిని తీవ్రంగా ప్రభావితం గావించినవాడు శ్రీశ్రీ. తెలుగు సాహిత్య స్వరూప స్వభావాలను కష్టజీవుల పరంగావించినవాడు శ్రీశ్రీ. ఈ లోకం మీదేనండి, మీ రాజ్యం మీరేలండి అని బడుగు జీవులకు పిలుపునిచ్చినవాడు శ్రీశ్రీ. తెలుగుజాతిని రెండు మహత్తర విప్లవ పోరాటాలకు (తెలంగాణా–నక్సల్‌బరీ) పురిగొల్పిన ప్రయత్నాలకు సాహిత్య ప్రేరణైనవాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ చెప్పినట్టే ఆయన సృజించిన సాహిత్యంలోని సుగుణాలన్నిటినీ మిగుల్చుకుందాం. ప్రజావ్యతిరేకమైనవి వుంటే వదుల్చుకుందాం.

సంఘంలో, సాహిత్య రంగంలో (వస్తు, రూపాల) ప్రజాస్వామిక సంస్కరణల కొరకు భావ విప్లవం రగిలించినవాడు గురజాడ. కొన్ని సాంఘిక సంస్కరణలకు ఆచరణ రూపం యిచ్చిన కార్యశీలి కందుకూరి. ప్రజాస్వామిక సాంస్కృతికోద్యమ కృషి గావించినవారి లక్ష్యాలు ఏవీ నేటికీ నెరవేరలేదు. కాలం చెల్లిన భూస్వామిక వ్యవస్థనూ దానితో పెనవేసుకుని వున్న కులవ్యవస్థనూ, పితృస్వామిక కుటుంబ వ్యవస్థను అంతం చేయగలిగిన సమూలమైన సామాజిక విప్లవం భారతదేశంలో పరిపూర్తి కాలేదు. భారతదేశం లాంటి వెనుకబడిన దేశాల్లో ఫ్రెంచ్ విప్లవ (1789) లక్ష్యాలు యూరోపియన్ సమాజంలో తెచ్చిన ప్రజాస్వామిక ప్రగతికి ఒకనాడు బ్రిటీష్, నేడు అమెరికన్ సామ్రాజ్యవాదాలే అడ్డంకి. అవి రాచరిక, జమిందారీ, భూస్వామ్య వర్గాలను వాటి సంస్కృతులను తమ సాంఘిక పునాదులుగా మలుచుకున్నాయి. ప్రపంచీకరణ పేరిట దోపిడీని తీవ్రతరం చేశాయి. సామాజిక అంతరాలను పెంచేశాయి. భారత పాలక వర్గాలు సామ్రాజ్యవాదులకు ఆర్థిక పరాధీనులుగా, రాజకీయ లొంగుబాటుదార్లుగా వున్నారు. అగ్రకుల దురహంకారమూ, పితృస్వామిక తత్వమూ, నీచ పతన ధన సాంస్కృతిక విలువలూ, మతతత్వమూ భారత పాలకవర్గ సంస్కృతిగా రూపొందింది. కలగలిసి పోయిన ఈ భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతులకు వ్యతిరేకంగా నూతన ప్రజాస్వామిక సామాజిక విప్లవం, దాన్ని బలోపేతం గావించగల సాంస్కృతికోద్యమం కావాలి. దీనిని పెంపొందించే ప్రతి చిన్న ప్రయత్నాన్నీ సమస్త భావజాలాన్నీ ఉద్యమాల్నీ (ఉదా॥ కార్మిక, రైతాంగ, దళిత, మహిళా ఉద్యమాల్ని) ఐక్యం గావించగల సంయమన కృషి కావాలి. అందుకు, పిచ్చుక, గూడును అల్లుకోవటానికి ప్రతి పుల్లనూ పుడకనూ సమకూర్చుకున్నట్టుగా సమస్త జాతీయ ప్రజాస్వామిక సాంస్కృతిక భావజాలాన్నీ, కృషినీ మిగుల్చుకోవాలి. వాటిని విచ్ఛిన్నపరిచే, పక్కదారి పట్టించే సామాజిక, సాంస్కృతిక ధోరణుల్ని వదుల్చుకోవాలి.

**(సెప్టెంబర్ 2009, ప్రజాసాహితి సంచిక నుండి...)**



# ౬. ఏది ప్రజా సంస్కృతి?

**– కె. శాంతారావు,** (ప్రజాప్రయోక్త, హైదరాబాద్)

ఇది ఏం సంస్కృతి?

గోమాంసం తింటున్నారని మనుషుల్ని వధిస్తారా?

కులాంతర వివాహాలు చేసుకుంటే పరువంటూ హత్యలు చేస్తారా?

మత్తు మాదకద్రవ్యాలకు పసిపిల్లల్ని బానిసలుగ మారుస్తారా?

అశ్లీల దృశ్యాలకు అరచేతిలోని స్మార్ట్‌ఫోన్లు కేంద్రాలా?

అసభ్యత, అవినీతి, ఆత్మహత్యలు – ఇలాంటివి మన జీవన శైలిలో విడదీయలేని విధంగా పెనవేసుకుపోయే భాగాలా? పర్యావరణ పరిరక్షణ, రైతు రక్షణ అనేవి కేవలం చెల్లని నేతల వాగ్దానాలా?

అసలు ఈ విషయాలు మాట్లాడటానికి, ఆలోచించడానికి మనం భయపడు తున్నామా?

మనలోని ఈ ఉదాశీనతను లేదా జడత్వాన్ని మనం బద్దలు కొట్టుకోలేమా?

మనిషిగా మనం అంత అచేతనులమా? అసహాయకులమా లేక అవకాశ వాదులమా? అంతఃచేతన కొరవడిందా? ఆలోచించుకోవాల్సిన సమయం ఆసన్నమైంది.

ఇవన్నీ సాంస్కృతిక రంగానికి సంబంధించిన అంశాలు.

ఇంకా చెప్పాలంటే ప్రజా సంస్కృతికి ఎదురౌతున్న సవాళ్ళు.

ప్రజలు అంటే ఎవరు. సంపన్నులా? పేదలా? పాలకులా? పాలితులా?

అవసరాలు తీరినవారా? తీరనివారా?

అగ్రవర్ణాలుగా, బలహీనవర్గాలుగా, మైనార్టీలుగా, దళితులుగా, గిరిజనులుగా వర్గీకరించారు – ఇది వర్ణ విభజన.

అత్యంత ధనికులుగా సంపన్నులుగా మధ్య తరగతి వారిగా, పేదలుగా గర్భ దరిద్రులుగా ఉంటున్నారు – ఇది వర్గ విభజన.

వృద్ధులు – నడివయసువారు, యువత – పిల్లలు – ఇదో విభజన.

పురుషులు – స్త్రీలు, ట్రాన్స్‌జండర్స్ (హిజ్రాలు) – ఇదో వర్గీకరణ.

అడ్డంగా, నిలువుగా ఇన్ని విధాలుగా చీలిన సమాజంలో

సంస్కారవంతులుగా ఆరోగ్యకరమైన సాంస్కృతిక జీవనం గడపటం కష్టసాధ్యమైన విషయమే. మనిషిని మనిషిగా అర్థం చేసుకునే ప్రక్రియ ఇది. అసలు పుట్టుకతో మనిషి స్వార్థజీవి, పశుప్రాయంలోనే ఉంటాడు అంటాడు థామస్ హాబ్స్. అందుకే ఆటవిక న్యాయం చెల్లుబాటు అవుతుంది అంటాడు. బలవంతుడిదే రాజ్యం (మైట్ ఈజ్ రైట్). బలహీనులు బలవంతునికి లొంగి ఉండాల్సిందే అని చెప్తాడు.

కాని గుంపు జీవితం, సామాజిక జీవితం ఒకటి కాదు. అని అటు ఉదారవాదులు, ఇటు మార్క్సిస్టులు పేర్కొన్నారు.

జంతువులు గుంపుగా జీవిస్తాయి. ఆహార, నిద్రా మైథునాలను యధేచ్ఛగా అనుభవిస్తాయి. వావి వరసలుండవు, ఆ భౌతికావసరాలకోసం హింసాయుతంగా అవి వ్యవహరిస్తాయి.

మనిషి అలా కాదు. గుంపు జీవితం నుండి ఉత్పత్తి సంబంధాలు ద్వారా సామాజిక జీవనానికి ఎదిగాడు. అసలు అలా సామాజిక జీవనానికి ఎదగడంలోనే మనిషిగా మారాడు. దీనినే ఏంగెల్స్ వానరుడు నరుడిగా మారిన క్రమంలో శ్రమపాత్రను విశదపరుస్తాడు.

భౌతిక అవసరాలతోపాటు మానసిక అవసరాలు తెలుసుకున్నాడు మనిషి. భౌతిక అవసరాలు తీర్చుకునేందుకు ఎలా శ్రమించాడో, మానసిక అవసరాలు తీర్చుకునేందుకు అలానే శ్రమించాడు.

భావ వ్యక్తీకరణ క్రమం ఆ విధంగానే వృద్ధి చెందింది. లక్షల సంవత్సరాలనాటి ఆఫ్రికా కొండ గుహల్లోని కుడ్య చిత్రాలు నేటికీ మనకు ఈ విషయాలనే నేర్పుతాయి. తాము ఏ జంతువును చూసిందీ, ఎలా వేటాడిందీ, అవి తెలియజేస్తాయి. అంతేకాదు, నెగళ్ళ మధ్య, వెన్నెల రాత్రిలో ఎలా ఆడుకున్నదీ, పాడుకున్నదీ కూడా ఆ చిత్రాలు చెప్తాయి.

ఆ భావ వ్యక్తీకరణ దృశ్యాల్లో ఒక విద్య, ఓ ఆనందం, ఓ విషాదాన్ని చూడవచ్చు. అది వైయుక్తం కానేకాదు. సమిష్టితత్వమే. అన్నిటికంటే అంతర్లీనంగా మనకు గోచరించేది, ఓ మానవీయ కోణం, ఓ ప్రజాస్వామ్య దృక్పథం కన్పిస్తాయి. దీనినే మనం మానవతగా చెప్పుకోవచ్చు.

మనిషిలోని మానవత అనేది అకస్మాత్తుగా ఆకాశంలోనుంచి ఊడింది లేదు. లేదా రుషులు తపస్సు చేసుకుంటూంటే రాలేదు.

పరిణామ క్రమంలో మనిషి సమైక్యంగా సాధించుకున్న విజయం ఇది. దీనినే మహాకవి శ్రీశ్రీ 'శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనే లేదోయ్' అని అభివర్ణిస్తాడు.

అప్పటి నుండి మానవ సంబంధాల్లో (ఉత్పత్తి సంబంధాలలో) ఈ ప్రజా సంస్కృతి లేదా మానవీయ సంస్కృతి పరిఢవిల్లుతూ వస్తూనే ఉన్నది. అందరం కలిసి మాట్లాడుకోవడం, ఆలోచించడం (సమాలోచన), అందరూ కలిసి ఆమోదయోగ్యంగా ఒక ఒడంబడికగా జీవించడమే సంస్కృతి. కల్చర్ (సంస్కృతి) అనే పదంకు కల్టివేట్ (మార్పు, ఎదుగుదల) అగ్రికల్చర్ (సేద్యం) పదాలతో సంబంధం ఉన్నది. సివిల్‌కోడ్ (పౌర ఒడంబడిక) నుండి సివిలైజేషన్ (నాగరికత) పదం వచ్చింది.

సభ్య నాగరికతా ప్రపంచం సంస్కృతితో ముడిపడి ఉన్నదే. నేడు యావత్ ప్రపంచం వ్యవసాయ నాగరికత నుండి పారిశ్రామిక నాగరికత వైపుగా దూసుకుపోతున్నది.

పారిశ్రామిక విప్లవానంతరం, శాస్త్రీయ దృక్పథం, హేతువాద దృష్టి ప్రజల్లోకి ప్రవేశించి మూఢనమ్మకాలను తుత్తునియలు చేసింది. భౌతికవాదం భావవాదానికి (భగవంతుడే సమస్తం) ప్రతిగా నిలిచింది. ఎందుకు? ఏమిటి? విశ్లేషించుకోవడంతో పాటు, శాస్త్రీయతే ఆధారంగా ప్రణాళికలు రచించుకుని ముందుకు పోతున్నాడు మనిషి. హక్కులను నిర్వచించుకున్నాడు. ప్రగతిశీలతవైపు అడుగులు వేస్తున్నాడు.

రాజరిక ప్రభువుల స్తానంలో ప్రజాస్వామ్య పాలన రావడమే ఇందుకు పెద్ద తార్కాణం.

అయితే సమాచార, సాంస్కృతిక రంగంలో నేడు పెనుమార్పులు వస్తున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా దోపిడీవర్గం శాస్త్ర సాంకేతిక పద్ధతులను ఉపయోగించుకుని శ్రమ సంస్కృతి స్థానంలో భ్రమ సంస్కృతిని నెలకొల్పేందుకు తీవ్రంగా కృషి చేస్తున్నది. అందుకోసం ఐదవవంతు పెట్టుబడిని విచ్చలవిడిగా ఖర్చు చేస్తోంది.

మానవుల్ని రసహీనులు, ఆలోచనా రహితులుగా మార్చడం, శ్రమజీవుల్ని నిర్వీర్యుల్ని గావించడం, మతఛాందసత్వంలో కొట్టాడుకునేటట్లు చేయడం, మానవ సంబంధాలను దెబ్బతీయడం మనిషిని పరాయీకరణ గావించడం, అశ్లీలతను, అసభ్యతను పంచి శాంతి సామరస్యాలకు విఘాతం కల్పించడం, ఉన్మాదంతో మారణహోమాలను సృష్టించడం, సాంస్కృతిక నేరాలను పెంచి పోషించడం ఈ సాంస్కృతిక ఉత్పత్తుల లక్ష్యం.

అందుకనే మనకు హక్కులు గల్లంతు అవుతున్నాయి. మనలో అసమానతలు పెరుగుతున్నాయి. అమానవీయ ధోరణి విజృంభించేలా ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాలు తోడ్పడుతున్నాయి. విద్యావ్యవస్థ కూడా అశాస్త్రీయ భావజాలంతో వైయక్తిక అభివృద్ధి (కెరీర్ సర్వస్వం)తో నడుస్తున్నది. మార్కెట్ సంస్కృతి సకల విలువలను కాలరాస్తూ రాజ్యమేలుతున్నది. అవసరం ఉన్నా లేకున్నా అనుసరించడమే ఆధునికతై కూర్చున్నది. విచక్షణ లేదు.

సాంస్కృతిక రంగం ఉపరితలం అని భావిస్తున్న వారు సైతం మార్కెట్ సంస్కృతిలో కొట్టుకుపోతున్నారు అందుకే **మాయమైపోతున్నడమ్మా మనిషన్నవాడు** (అందెశ్రీ రచన) అనే పాటలు వస్తున్నాయి.

ఈ స్థితిలో ప్రగతిశీలతవైపు నిలిచే ప్రతి ఒక్కరు, పరిస్థితులకు బెంబేలు పడిపోకుండా సత్తువనంతా కూడదీసుకుని, అభిప్రాయ బేధాలు ఉన్నప్పటికీ చారిత్రక వాస్తవాన్ని గమనించి, ప్రజాస్వామ్య సంస్కృతికి పట్టం కట్టేందుకు కృషి చేయాలి. ఆరోగ్యకరమైన చర్చలు, సమావేశాలు జరగాలి. రచనలు రావాలి. యువతను ఆకర్షించాలి. జాతిని జాగృతం చేసే కళా సాంస్కృతిక రూపాలు ఎక్కడికక్కడ సాగేలా ఈ కృషిని చైతన్యవంతంగా బాధ్యతాయుతంగా నిర్వహించవలసిన తరుణం వచ్చింది.

అవస్తను తెలుసుకుంటేనేగాని వ్యవస్థను మార్చుకోలేం. ఐక్యతను సాధిస్తేగాని విష సంస్కృతిని ప్రతిఘటించలేం, కొసమెరుపు ఏమిటంటే సంస్కృతిలో రాజకీయాలు భాగం తప్ప, రాజకీయాల్లో సంస్కృతి ఎన్నటికీ భాగం కాదు. సంస్కృతి ఓ ప్రజాస్వామిక నిర్మాణం.



# 7. ప్రజా సంస్కృతి - ప్రధాన అవరోధాలు

– **గౌరి** (సాంస్కృతిక కార్యకర్త)

ప్రజాస్వామికమైందంతా ప్రజా సంస్కృతి, ప్రజాతంత్ర భావన సంస్కృతికి మౌలికమైనది. వ్యక్తిస్థాయి అతడి సంస్కారంలో వెల్లడైతే, వ్యవస్థ తీరు దాని సంస్కృతిలో ప్రతిబింబిస్తుంది. సమాజ పరిణామానికి సంస్కృతి ఒక సజీవ ధాతువు. సంస్కృతి ప్రవాహశీలమైంది, నిరంతర మార్పు దాని సహజ లక్షణం. అలా ఎప్పటికప్పుడు కొత్తనీరు నింపుకుని ముందుకు సాగడం సంస్కృతికి గల మరో ముఖ్యమయిన గుణం. అందుకే సంస్కృతి సచేతనమైంది![1]

అప్రజాస్వామికమైందంతా ఆధిపత్య సంస్కృతి, అసమానతా భావన దీనికి మూలం. మానవ సంబంధాలు మారతాయని నమ్మేది మానవీయ సంస్కృతైతే, మానవ సంబంధాలు మారవని విశ్వసించేది అమానవీయ సంస్కృతి. ప్రేమ, స్నేహం, కరుణ, సహనం, సమిష్టితత్వం మానవీయ సంస్కృతికి తోడ్పడితే, ద్వేషం, శత్రుత్వం, క్రూరత్వం, అసహనం, వ్యక్తి ఆరాధన అమానవీయ సంస్కృతికి దోహదపడతాయి. వ్యక్తి ఆరోగ్యానికి ఆహారమెంత ముఖ్యమో వ్యవస్థ ఆరోగ్యానికి సంస్కృతి అంత ముఖ్యం.

సంపూర్ణత దిశగా మానవాళి చేసే ప్రయాణం, గెలుపోటములు, చరిత్ర సంస్కృతిలో భాగం. సమాజంలో వ్యక్తులు నిత్యజీవితంలో పాటించే విలువలే సాంస్కృతిక స్థాయిని పెంపొందింపజేస్తాయి. వ్యక్తుల హేతుబద్ధత వారి జీవితంలో కనిపిస్తే సమాజ హేతుబద్ధత దాని సంస్కృతిలో ప్రతిఫలిస్తుంది. సవ్యమయిన ఆలోచన వ్యక్తికెంత అవసరమో, అటువంటి ఆలోచనాపరుల సంఖ్యను నిలుపుకుంటూ పెంచుకోడానికి నిరంతరం ప్రయత్నించడం సంస్కృతి అభ్యున్నతికి అంతే అవసరం.

అనాదిగా ఈ దేశంలో ఇరురకాల సంస్కృతులు వాటి అస్తిత్వాన్ని నిలుపుకుంటూనే వచ్చాయి. ఆత్మీయ సంస్కృతి – ఆధిపత్య సంస్కృతి రెండూ విభిన్న మార్గాలలో పయనిస్తూనే వచ్చాయి. ప్రపంచంలోని ఇతరేతర దేశాలన్నింటిలోనూ పరలోక భావనను ఆధారంగా చేసుకుని భగవంతుడికి అనుకూలంగానో, ప్రతికూలంగానో ఆలోచనల్ని ఏర్పర్చుకోవడం జరిగింది. దైనందిన జీవితాన్ని నమ్మకానికి ముడిపెట్టి ఆస్తికత్వాన్నో లేదా నాస్తికత్వాన్నో పాటించిన చిత్రం అన్ని సమాజ చరిత్రల్లోనూ ఎంతోకొంత కనిపిస్తుంది.[2]

ఐతే, ఆ రెంటిలోని సారాన్ని తీసుకుని మానవీయ మధ్యేమార్గం అన్వేషించిన బౌద్ధం మొట్టమొదటిసారి మనిషికి ప్రాధాన్యతనిచ్చింది. మనిషి కేవల జీవి కాదనీ సంస్కారవంతమయిన జీవితాన్ని గడపడమే మంచి జీవనానికి సాధనమనీ, ఎప్పటికప్పుడు జీవన పరిణితికి చేసే సాధన ద్వారా అత్యున్నత మానవుడుగా రూపొందడమే సాధన లక్ష్యమని చెప్పింది. మనిషి ఆంతరిక వికాసంపై దృష్టిపెట్టి మానసిక విప్లవమే మానవాళికి శరణ్యమని ప్రతిపాదించిన మొదటి వాదం బౌద్ధం.

మానవ చరిత్ర సుదీర్ఘమైనది. గతి దాని లక్షణం. మనిషి భౌతికాభివృద్ధికి శారీరక శ్రమ ఎంత సాయపడిందో, బౌద్ధికాభివృద్ధికి మానసిక శ్రమ అంతే ఉపయోగపడింది. నాగరికత వికాసానికి భౌతిక వ్యక్తీకరణగా శ్రమ వెల్లడైతే, భావ వికాసానికి ఆలోచనాత్మక వ్యక్తీకరణగా భాష అభివృద్ధయింది. మనిషి ఆ రెండింటి ద్వారా సాధించిన పురోగమనమంతా సాంస్కృతికమైనదే. సంస్కృతి లక్ష్యం పరిణితి చెందిన భౌతిక, బౌద్ధిక మానవ సమాజ నిర్మాణమే.

బౌద్ధం మనిషి ఆంతరిక విముక్తి వరకే పరిమితమయింది. సామూహిక అంశాల్లోని సంక్లిష్టతను పరిష్కరించడం బౌద్ధానికి తోచలేదు. పైగా నాటి కాలంలో ఉత్పత్తి సంబంధాలు బౌద్ధ సారస్వతానికి ఎంత తోడ్పడ్డాయో అంతే స్థాయిలో పరిమితం కూడా చేసాయి. రెండువేల సంవత్సరాల క్రితం బౌద్ధం ఆంతరిక విముక్తికి మానవాళికి చూపించిన మార్గమయితే ప్రభావశీలమైనదే కాని ఆర్థిక రాజకీయ అంశాల్లో అది పూరించాల్సిన ఖాళీ ఉంటూనే వచ్చింది. నా అభిప్రాయం ప్రకారం రెండొందల సంవత్సరాల ముందర వృద్ధిచెందిన మార్క్సిజం మాత్రమే ఎంతోకొంత ఆ ఖాళీని పూరించే పనిని చేయగలిగింది.

ముందే ప్రస్తావించినట్లు త్యాగం పరిధి ఎంత విస్తృతమైనదో స్వార్థం కూడా అంత శక్తివంతమైనది. బౌద్ధం భౌతికంగా ఈ దేశంలో పతనం కావడానికీ, మార్క్సిజం ఆచరణాత్మకంగా ప్రయోగించబడిన రష్యాలో విప్లవం ఎక్కువ కాలం నిలవకపోవడానికి ఆ రెండింటి సాంస్కృతిక సంకుచితత్వమే కారణం. సైద్ధాంతిక వారసత్వాన్ని కొనసాగించడానికి చూపిన ఆసక్తి సాంస్కృతిక వికాసాన్ని పెంపొందించడంలో చూపకపోవడం ప్రజాహితవాదాలకి ప్రధాన అవరోధం.

నిజం చెప్పాలంటే సాంస్కృతికంగా బౌద్ధం చాలా విశాలమయిన పాత్ర పోషించింది. ఉద్రేకాన్ని నిలువరించి వివేకంపై దృష్టిపెట్టిన ఉపనిషత్ చింతనను, చార్వాకలోకాయత సాంఖ్య సిద్ధాంత సత్యాన్వేషణాపిపాసను మేళవించి నూతన

తరహా తాత్విక దృక్పథాన్ని నిర్మించడం జరిగింది. ఆ కారణం వల్లనే వెయ్యి సంవత్సరాలు నిరాటంకంగా విలసిల్లింది. అంతేకాదు, భూగోళం నలువైపులా మెరుపులా దూసుకుపోయి సాంస్కృతిక పునరుజ్జీవనానికి అవిరామ కృషి చేసింది.

మార్క్సిజం కూడా సోషలిజం స్ఫూర్తితో ప్రజలనాడిని సంస్కృతి ద్వారా ప్రభావితం చేయదల్చి దశాబ్దాలపాటు ఎంతో కృషి చేసింది. ముఖ్యంగా మన దేశంలో సాంస్కృతిక పురోగమనానికి దోహదం చేసిన చరిత్ర కమ్యూనిస్టులకుంది. కానీ, స్వీయవిమర్శనాత్మక స్మృతి స్రవంతిని, అంటే ఎప్పటికప్పుడు నూతన ధోరణుల పట్ల అవలంభించవలసిన సంవేదనాభరిత స్పృహను ఏర్పర్చుకోవడంలో కొంతమేరకు లోపం జరిగింది. ప్రజాహిత ఆలోచనల బలం సంగతి తెల్సిన స్వార్థం, త్యాగం ఎప్పుడు బలహీనపడుతుందా అని వేచి చూడ్డం జరుగుతుంది.

ఈ ధోరణులని పసిగట్టి ముందునుండీ ఎంతోకొంత ఎరుకతో మానవాళి సాంస్కృతిక పునరుజ్జీవనానికి తమవంతు కృషి చేసిన వారెందరో ఉన్నారు. రాజారామ్మోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, రవీంద్రనాథ్ ఠాగోర్ మొదలుకుని ఎమ్.ఎన్. రాయ్, బి.ఆర్. అంబేద్కర్, లోహియా మొదలగువారు ప్రధాన స్రవంతిని ప్రభావితం చేసే '**మరోమార్గం**'పై దృష్టి పెట్టడమే కాక వారి వారి జీవిత కాలంలో అందుకోసం తీవ్రమయిన కృషి కూడా చేసారు. సంకుచిత దృక్పథాలకి వ్యతిరేకంగా పోరాడారు.

ముఖ్యంగా ఎమ్.ఎన్. రాయ్ సాయుధ పోరు నుంచి ఆరంభించి ప్రపంచంలోనే అరుదయిన అద్వితీయ తాత్వికుడిగా కృషి చేసాడు. సాంస్కృతిక ప్రజాస్వామ్యానికి ఈ దేశ సంకుచిత మతతత్వం ఎంత ప్రమాదకరమో గుర్తించినవాడు కనుకనే రినైజాన్స్ (సాంస్కృతిక పునర్వికాసాన్ని) గురించి చివరి వరకూ ప్రయత్నించాడు. ఇండియన్ రినైజాన్స్ ఇన్‌స్టిట్యూట్ స్థాపించడమే కాక వ్యక్తుల్ని వివేచనాపరులుగా తీర్చిదిద్దే బృహత్తర కార్యాచరణను నిబద్ధతగా నిర్వహించాడు.[3]

మార్క్సిజంలో మిగిలిపోయిన 'ఖాళీ' సంస్కృతికి సంబంధించినది. దానిని మార్క్స్ ఏంగిల్స్‌ల సమకాలీనులైన ప్రౌధాన్, బకునిన్‌లు మొదలుకుని లెనిన్ కాలం నాటికి రోజాలగ్జంబర్గ్, ట్రాటెస్కీ దాకా గుర్తించినవారున్నారు. ఎవరొప్పుకున్నా లేకపోయినా మానవ ప్రవృత్తనేది ఒక సాంస్కృతిక అంశం. మానవుడికెంత చరిత్రుందో అతడి మానసిక ప్రవృత్తికి అంతే చరిత్ర ఉంది. చరిత్ర అంటే భౌతికమైందనే భ్రమలో ఉండబట్టే భౌతికవాద దృక్పథం మనిషి ఆంతరిక స్వభావాన్ని

తక్కువగా అంచనావేసి వోటమిపాలైంది. ఎరిక్‌ఫ్రామ్ మొదలుకుని బాలగోపాల్ వరకూ మొత్తుకున్నప్పటికీ ఈ దేశంలోని కమ్యూనిస్టులకు పట్టలేదు. ఫలితంగా అభ్యుదయ శక్తులు చీలిపోయి ప్రజావ్యతిరేక శక్తులు వృద్ధి చెందాయి. దురదృష్టం ఏంటంటే ఇప్పటికి ప్రగతిశీల వాదులకి ఆ సఖ్యత లేదు.[4]

సాంస్కృతిక పరాయికరణ ఈనాటి ప్రధాన సమస్య. మనిషి వందల సం॥రాల నుంచి ఏర్పర్చుకున్న 'విలువల్ని' ధ్వంసంచేసి, 'ధర' ద్వారానే జీవితంలోని ప్రతి విషయాన్ని పరిగణించడం ఈ వ్యవస్థ లక్షణం. మనిషిని, పశుపక్ష్యాదుల్ని, ప్రకృతిని, సమాజాన్నంతటినీ ఆదాయ వనరులుగా చూడటం వర్తమాన సమాజ లక్ష్యం. అది మాత్రమే అలా చూస్తే చాలదు. అందరికీ దాని కళ్ళద్దాలనే పెడుతుంది. విననివారి కళ్ళు పొడుస్తుంది. ప్రపంచం చూపుని ఈరోజు కొద్దిమంది దృష్టే శాసిస్తుంది. అది దాని ప్రయోజనాలను నెరవేర్చే విధానాన్నే రుద్దుతుంది. ప్రసార మాధ్యమాలు మొదలుకుని అన్నింటా ఈ సాంస్కృతిక సంకుచితత్వమే కనిపిస్తుంటుంది. నాకు తెల్సి వైరిపక్షం పట్లా దాని ఎత్తుగడల పట్లా తక్కువ అంచనా వేయడం కాదుగానీ, దాన్ని తిప్పికొట్టడానికి కృషిచేసే బుద్ధిజీవులు, భిన్నత్వాన్ని ఆహ్వానించే స్వభావాన్ని సంతరించుకోకపోవడమే ప్రజాసంస్కృతికి అతిపెద్ద సవాలు.[5]

ప్రతి సంస్కృతికీ దానికంటూ ప్రత్యేకమయిన తాత్విక మూలాలుంటాయి. వికసిత లక్షణం కల సంస్కృతిలో భిన్నత్వాన్ని స్వాగతించే స్వభావం సహజంగా ఉంటుంది. అదే సంకుచితమయిన సంస్కృతిలో భిన్నత్వంపై అసహనం ప్రదర్శించే లక్షణముంటుంది. వాస్తవానికి సంస్కృతి అంటేనే వికసితమయ్యేది. ఇరుకుతనం సంస్కృతికి సరిపడదు.[6]

ప్రపంచంలో ఆర్యజాతి రక్తం స్వచ్ఛమైందనే అహంకారం లక్షలమంది ప్రాణాల్ని తీసింది. ఈ దేశం అనేక శతాబ్దాలపాటు అవకాశాల్ని బహుజనులకి దూరం చేసింది. 1831లో పోప్ బైబిల్లో దేవుడు చీకటినీ, వెలుతుర్ని వేరుగా సృష్టించాడు కాన దానికి విరుద్దంగా రాత్రి దీపాలు ఉండటం నేరంగా ప్రకటించి వాట్ని నిషేదించాడు. బౌద్ధం, ఇస్లామ్‌లు కూడా ఈ రకమయిన ఇరుకు దృష్టిని ప్రదర్శించిన దాఖలాలున్నాయి. ఉన్మాదం అది భావవాదమయినా భౌతిక వాదమయినా ప్రమాదమే.

మరి అదే విధంగా మతాలతో సంబంధం లేకుండా విశాల దృక్పథాన్ని కలిగిన వివేచనకూ కొదవలేదు. 1657లోనే షాజహాన్ కొడుకు దారాషికోవ్ భగవద్గీతతో సహా 50 ఉపనిషత్తుల్ని సంస్కృతం నుండి పర్షియన్‌లోకి అనువదించాడు. సూఫీ – వేదాంత సారాల్ని జీవితాంతం ప్రచారం చేసాడు. అలాగే ఈరోజు తెలుగులో వేమన సాహిత్యం బతికి వుండడానికి సి.పి. బ్రౌన్ కారణమన్న నిజం మనందరికీ తెల్సిందే. సాంస్కృతిక భిన్నత్వాన్ని స్వాగతించడం మానసిక వికాసానికి ముఖ్య లక్షణం. అది లోపించినప్పుడు ఉపనిషత్ చింతనయినా, వేదాంత సారమైనా, అష్టాంగ మార్గమయినా, గతితార్కిక భౌతికవాదమయినా, రాజ్యాధికారమయినా, మానవవాదమయినా ఆ వ్యవస్థని రక్షించలేవు.

సంస్కృతిలో మతం ఒక భాగం. కాని మత సంబంధ ఆచార వ్యవహారాల్ని మాత్రమే సంస్కృతిగా గుర్తించి దాని స్వచ్ఛతను, పవిత్రతను కాపాడే బాధ్యతను తలమీద వేసుకున్న మూకలు 'సంస్కృతీ పరిరక్షకులు'గా మారి వ్యవహరించడం కద్దు. మనిషిని మినహాయించి సంస్కృతనేది వేరేగా మనలేదు. సంస్కృతి మనిషిని సంస్కరించి పరిపూర్ణుడిగా చేసే మానవీయ సాధనమేకాని, సమాజం నుండి విడివడిన విశ్వాసాలపై ఆధారపడిన, ఆధిపత్య ప్రధానమయినది కాదు. [7]

సంస్కృతి సార్వజనీనతను కలిగి ఉండేది. సార్వత్రికంగా ప్రతీ భిన్న భావాన్ని ఆహ్వానించడం సంస్కృతిలో విశ్వజనీన అంశం. విలక్షణత సంస్కృతి స్వభావం. కుల, మత, ప్రాంత, వర్గ, లింగ బేధాల్ని ఆధారం చేసుకుని ఆధిపత్యం చూపకుండా ప్రజాతంత్ర స్ఫూర్తితో వ్యవహరించడం సంస్కృతి ప్రధానోద్దేశం. ప్రతీ వ్యక్తికి ఒకే విలువ అనేది సంస్కృతి లక్ష్యం. సంస్కృతికి సమానత్వం ప్రమాణం. రాజ్యాంగబద్ధత నేటి సంస్కృతికి గీటురాయి. మానవీయ విలువలతో కూడిన హక్కుల దృక్పథం, సత్యాన్వేషణ దృక్కోణంకల సాంస్కృతిక వారసత్వం మనది కావాలి. విస్తృతమైన విధానాలతో కూడిన విసంస్కృతీకరణే అందుకు మార్గం. [8]



## ఫుట్ నోట్స్ :

1. భారతదేశ చరిత్రను శాస్త్రీయంగా శోధించిన బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు "సంస్కృతీ కరణ ద్వారా కింది వర్ణాలవారు పై వర్ణాలకు ఎగబాకటం భారత సామాజిక చరిత్రలో ముఖ్యాంశం. ఇదొక నిరంతర అధిరోహణం" అంటారు. చూడు : విశిష్ట విశ్లేషణ, ఏటుకూరి బలరామమూర్తి, త్రిపుర సుందరి, గుంటూరు – 1996.

2. ఆచార్య నరేంద్ర దేవ్ బ్రాహ్మణ, శ్రమణ సంస్కృతులుగా విభజించి ఈ అంశంపై చర్చించారు. వివరాలకు చూడు : The Two Streams of Indian Culture by Narendra Deva 'A Selection of his writings', acharya Narendra Deva samajwadi Sansthan, Varanasi, New Delhi, Birth Centinary Publication - 1989, P-192, నరేంద్రదేవ్ బౌద్ధ ధమ్మదర్శనం గ్రంథంలో ఈ చర్చ విస్తృతంగా చేసారు. అంతేకాదు, ఇదే గ్రంథంలో Socialist Culture అనే వ్యాసంలో "Socialism is not only an economic movement but also a cultural movement. It strives as much for real human culture for a new economic order. It regards culture like social ethics, as human social and historical. Culture is but an expression of the social in man, cultural heritage is the collective achievement of history result of human experience, embodiment of human urges and needs. A cultural pattern is away of life under certain physical environment and historically determined social conditions. అంటారు. P-148.

3. ఎమ్.ఎన్. రాయ్ సంబంధిత విషయంపై విస్తృతమయిన చర్చ చేసాడు. వివరాలకు చూడండి, Indian Culture Article in Humanism Revivalism and The Indian Heritage by M.N. Roy, Renaissance Publishers Pvt. Ltd, Kolkata - 1999.

4. Human evolution is the result of cultural development, and not of an organic change. The infant of the most primitive culture, Put into a highly developed culture, would develop like all other children in this culture because the only factor determining his development is the cultural factor. వివరాలకు చూడు: The sane

society by Eric Fromm, Henry Holt and company, New York - 1990, P-71, ఇదే గ్రంథంలో We are a culture of consumers అంటాడు ఫ్రామ్, చూడు P-348.

5. రాజకీయంగా గాంధీ ఇందుకోసం కృషి చేసాడనే వాదన ఉంది. "సంస్కృతీ రహితమై దోపిడి తత్వాన్ని ఆధారం చేసుకున్న సామ్రాజ్యవాదపు బంధనాలలోంచి బయట పడటానికి గాంధీజీ మానవతాయుతమయిన రాజకీయాలతో సంస్కృతి సాధనాలయిన సత్యాహింసలను సమన్వయించారు. ఇట్లు ఆ ఫలితాన్ని సాధించడం గాంధీజీకే చెల్లింది" వివరాలకు చూడు : సంస్కృతి అంటే ఏమిటి? ఎమ్.ఆర్. అప్పారావు, ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం - 1977, పేజి-5.

6. బహిరంగ ప్రదేశాలలో విశాలత్వం ఆస్వాదించలేని రోగాన్ని ఎగోరాఫోబియా అంటారు. డాక్టర్ వ్యాకరణం అచ్యుత రామారావుగారు ఈ పేరుతో కవిత కూడా రాసారు. వివరాలకు చూడు : వాహిని యు.కె. తెలుగు క్లబ్, మొదటి సావనీర్, పేజి-65.

7. Every Authentic revolution is a cultural revolution అంటాడు పాలోఫ్రెరి. "ఒక నిర్దిష్ట సమాజపు ఆర్థిక, రాజకీయ సైద్ధాంతిక వ్యక్తీకరణే సంస్కృతి అన్న మావోకానీ, "ప్రకృతి పోరాటంలో మనిషి శ్రమ వల్ల జనించిందే సంస్కృతి. సంస్కృతి మనిషి సంకల్ప, మేథోశక్తివల్ల అపర సృష్టి కావించే ప్రయత్నపు ఫలితం" అన్న గోర్కి నిర్వచనం కానీ సంస్కృతికి కళను అన్వయించే యత్నాలే. వివరాలకు చూడు : కళలు - సంస్కృతి, అనుభవాలు - వ్యాఖ్యానాలు, కానూరి వెంకటేశ్వరరావు, ప్రజాపంథా ప్రచురణ, గుంటూరు - 1987. ఇక్కడో సంగతి చెప్పాలి. 1925లోనే ప్రముఖ అమెరికన్ రచయిత అప్టన్ సింక్లయిర్ కళా సంస్కృతులపై Mammonart అనే ఉద్గ్రంధం రాసాడు. (తెలుగులో ఇది, కాసుల కబంధ హస్తాలలో కళలు, సాహిత్యం "సోషలిస్టు సంస్కృతికి పాఠ్యగ్రంథం", పరిచయం : ముక్తవరం పార్థసారధి, ప్రచురణ - జనసాహితి - 2017) అందులో ఆయన "All art is propaganda. It is universally and inescapably propaganda; sometimes unconsciously but often deliberately, propaganda" అంటాడు. ప్రముఖ కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి కవుల్ని విశిష్టాద్వైతులతో పోల్చారు. "మానవత అంటే విభేదాలకు అతీతమైన రసాస్వాదనం. ఈ దృష్టిలో కవులందరూ విశిష్టాద్వైతులు. ఆధునిక యుగంలో రెండు ఉద్యమాలు బయలుదేరాయి. ఒకటి మానవోద్యమం మరొకటి హిందూ ధర్మ పునరుద్ధరణోద్యమం. మొదటి దానికి ప్రవర్తకుడు రామమోహన్‌రాయ్. నేను మానవోద్యమానికి చెందినవాడ్ని...." అన్నారాయన. వివరాలకు, చూడండి: మరపురాని

మనీషి, తిరుమల రామచంద్ర, యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ ప్రచురణలు, సికిందరాబాదు – 1975, పేజి–91, మహాకవి ఇక్బాల్ అన్నట్లు 'కళ ఒక్కటే నిజం' అనేది చర్చనీయాంశమే. కళ, సాహిత్యాల విస్తృతి దృష్ట్యా ఇదిక్కడితో ఆపడం మంచిది. వివరాలకు చూడు: Iqbal Essays and Studies, Ghalib Academy, New Delhi - 1978. "Thou art the only truth in the world, The rest is magic shadow world" అంటాడు ఒకచోట. p-135.

8. సహేతుకమయిన కార్యాచరణ లేనిది అసలు సమాజమే కాదంటాడు డ్యూయి. "The world without relationship to human activity is less than a world" The school and Society by John Dewey, Aakar, New Delhi - 2008. వివిధ ప్రత్యామ్నాయ విధానాలు తలెత్తుతున్న ఈనాటి పరిస్థితుల్లో సంస్కృతిని ఒకే కోణం నుండి చూడటం సరికాదు. "I want the cultures of all the lands to be blown about my house as freely as possible. I refuse to be blown off my Feet by any" అంటాడు కదా గాంధి.



*"కళలంటాం మనం. 64 కళలున్నాయని చెప్పుకొంటాం. ఎట్లా వచ్చాయా కళలు. అనుకొంటే అదోలా వుంటుంది. ఆశ్చర్యం గానూ అద్భుతంగానూ ఉంటుంది. వాటిలో జీవితానికి ఆధారాన్ని యిచ్చిన సజీవ కళలు ఎట్లా వున్నాయి. పశువు చర్మాన్ని అతి నేర్పుగా తీయడం, దాన్ని మృదువుగా చెయ్యటం, మట్టితోటి, కర్రతోటి, కుండలు చెయ్యడం, పాడి వుంటే పాలు పితకడం, వెన్న చిలకడం, కాచి నెయ్య తియ్యడం, నువ్వుల నుండి కొబ్బరి నుండి ఆముదాల విత్తనాల నుండి, పిచ్చిదిండిగ మొక్కల నుండి నూనె తియ్యడం, దూది వడకడం, బట్ట నెయ్యడం, నాగలి పట్టి నిటారుగా కొంఁడ్ర వేసి దున్నడం, విత్తడం కుప్పలు నురవడం, నీళ్ళు వుండే చోటు అన్వేషించి పుల్లనాటి చూపితే తియ్యటివో, ఉప్పటి నీళ్ళో పడడం, తాటి నారతో గోగునారతో తాటి ఆకుతో, వెదురుతో, వేముతో ఈత పుల్లలతో ఆకుతో, చివరకు నీటి కాలువ అంచులవెంట విస్తారంగా పెరిగే రెల్లుతో తాళ్ళు, బుట్టలు, అనేక రకాల అల్లకాలు అల్లడం, కమ్మరి కొలిమిలో ఇనుము కొడవళ్ళు కావటం, కత్తులు కావటం, గొడ్డళ్ళు కావటం, ఇళ్ళు కట్టడం, గ్రామాన్ని ముడిపెట్టుకొని, జీవితాన్ని అంటిపెట్టుకొని ఎన్ని కళలు. జానపదుడు ఎంత స్పష్టంగా చెప్పాడు. కళ ప్రజలకోసమే అని. అనుకుంటే సామాన్యుల బతుకుల్లో దాగున్నది చిన్నా చితకా కళ కాదు."*

# 8. సైన్సు - సంస్కృతి

- డా॥ నాగసూరి వేణుగోపాల్

(మీడియా విశ్లేషకులు, ఆల్ ఇండియా రేడియో, తిరుపతి)

సైన్స్-సంస్కృతి అనే పదబంధం కాస్తా కొత్తగా, వింతగా అనిపించవచ్చు. కొంతకాలంగా ఆ రెండింటిని అలా చూడటం మనకు అలవాటు కావడంవల్ల! ఇంకా చెప్పాలంటే దేవుడిని వ్యతిరేకించేది సైన్స్, దేవుడికి సంబంధించింది సంస్కృతి అనికూడా ఎంతోమంది భావిస్తున్నారు. అందువల్ల తెలుగులో ఈ రెండు పదాలు ఒకచోట ఎక్కువగా కనబడవు. నాకుమాత్రం సైన్స్-సంస్కృతి అనగానే మహా శాస్త్రవేత్త మేఘనాథసాహ (1893-1956) గుర్తుకు వస్తారు. కేంద్రక భౌతికశాస్త్రంలో అమోఘమైన పరిశోధన చేయటయే కాక సాహా ఇన్‌స్టిట్యూట్ న్యూక్లియర్ ఫిజిక్స్ సంస్థను ప్రారంభించారు. వారు 1951లో స్వతంత్ర్య అభ్యర్థిగా లోక్‌సభకు ఎన్నికయిన ప్రజల మనిషి. కానీ నాకు ఇక్కడ గుర్తుకు వస్తున్నది వీటిద్వారా కాదు, ఆయన స్థాపించిన పత్రిక పేరు “సైన్స్ అండ్ కల్చర్” కారణంగా. ఇప్పటికీ గౌరవప్రదంగా నడిచే ఈ పత్రికను ఎంతోమంది మక్కువగా అభిమానిస్తారు.

సైన్స్‌కి సంబంధించి మరో విషయం గుర్తుకు వస్తుంది. అది “ఐ.ఏ.సి.ఎస్ - ఇండియన్ అసోసియేషన్ ఫర్ కల్టివేషన్ ఆఫ్ సైన్స్” దీనిని స్థాపించిన మహాశయుడు మహేంద్రలాల్ సర్కార్ (1833-1904) వీరు రామకృష్ణ పరమహంసకు వైద్యం చేసిన వ్యక్తి మాత్రమే కాదు. దేశంలో సైన్స్ పరిశోధనకు బీజాలు వేసిన దార్శనికుడు. సైన్స్ విద్య, సైన్స్ పరిశోధన చాలా ఖరీదయిన వ్యవహారాలనీ, టెక్నికల్ స్కూల్స్ చాలనే వాదన బలంగా వినిపించేదట. ఆధునిక వైద్యశాస్త్రం చదివిన సర్కారుకు కలకత్తాలో ప్రాక్టీసు బ్రహ్మాండంగా ఉండేది. హెూమియోపతి, అల్లోపతి వైద్యవిధానాల మధ్య ఘర్షణాయుత వాతావరణం అక్కడ అప్పట్లో ఉండేది. మోర్గాన్ వ్రాసిన “ఫిలాసఫి ఆఫ్ హోమియోపతి” పుస్తకాన్ని సమీక్షించమని మిత్రులు అడిగారు. ప్రత్యర్థి విధానం గురించి తెలుసుకుంటే విమర్శ మరింత అర్థవంతంగా, సమగ్రంగా ఉంటుందని సర్కార్ భావించి అంగీకరించారు. కానీ పుస్తకం చదివాకా తమాషా జరిగింది. దేన్ని ఖండించాలనుకుని ఉపక్రమించారో, చివరకు దానినే గొప్పగా అభినందించారు. అయితే దీన్ని అతని వైద్య మిత్రులు అంగీకరించలేదు. హేళన చేయడం ప్రారంభించారు. ఇండియన్ మెడికల్ గెజిట్‌లో నిందిస్తూ వ్యాసాలు ప్రచురించారు. ఈ ధోరణి సర్కార్‌ను ఆలోచనల్లో పడవేసింది.

మౌలికంగానే మన భారతీయ సమాజంలోనే లోపం ఉందని పరిగణించారు. కేవలం సైన్స్ సంస్కృతి ఒకటే పరిష్కారమని మహేంద్రలాల్ సర్కార్ భావించారు. సైన్స్ ప్రసంగాలు చేయడం మొదలుపెట్టారు. ఇదొక్కటే సరిపోదని గ్రహించి పత్రిక కూడా కావాలని 1869 ఆగష్టులో 'కలకత్తా జర్నల్ ఆఫ్ మెడిసిన్' ప్రారంభించారు. తొలి సంచికలోనే భౌతికశాస్త్రాలకు ఒక జాతీయసంస్థ అవసరమని ప్రతిపాదించారు. పరిశోధనలు తెలుసుకునే వారిగా కాకుండా, మంచి పరిశోధనలు చేయగలవారుగా భారతీయులు ఉండాలని వారి ఉద్దేశ్యం. బ్రిటీషువారి జోక్యం లేకుండా భారతీయులే ఆ సంస్థను నడుపుకోవాలి. అలా తయారైన సంస్థ ఐఏసిఎస్. ఇది 1876లో ప్రారంభమైంది. 1907లో సి.వి.రామన్ ఇండియన్ ఫైనాన్స్ సర్వీస్ పరీక్ష పాసై కలకత్తాలో అసిస్టెంట్ అకౌంటెంట్ జనరల్‌గా చేరారు. అలా ఉద్యోగం చేస్తున్న రోజుల్లో ట్రామ్‌లో ప్రయాణిస్తూ సి.వి. రామన్ ఇండియన్ అసోసియేషన్ ఫర్ కల్టివేషన్ ఆఫ్ సైన్స్ అనే బోర్డు చూసి, కదిలే ట్రామ్ నుండి దిగిపోయారు. అప్పటికి మహేంద్రలాల్ లేరు. వారు తీవ్ర అసంతృప్తితో 1904లో గతించారు. సరైన పరిశోధనలు తన సంస్థలో జరుగలేదని సి.వి.రామన్ పరుగు పరుగున అమృతలాల్ సర్కార్‌ను కలిసి పరిశోధనకు అనుమతి అడిగారు. వారు ఆనందంగా అంగీకరించారు. అలా ప్రతిరోజు ఉదయం ఐదున్నరకు వెళ్ళి తన ఆఫీసుకు వెళ్ళే దాకా సైన్స్ పరిశోధనలు చేశారు. ఐఏసిఎస్‌లో 1928లో సి.వి. రామన్ చేసిన పరిశోధనకే 1930లో నోబెల్ బహుమతి లభించింది. ఇపుడు మనదేశంలో సైన్స్ బోధన, పరిశోధనలు ఈ మాత్రం ఉన్నాయంటే మహేంద్రలాల్ సర్కార్ మహాశయుని వంటివారి దార్శనికతే కారణం.

ఇక్కడ ఇంకో విషయం కూడా చెప్పాలి. ఇరవై ఎనిమిదేళ్ళ క్రితం ఆకాశవాణి ఉద్యోగం కోసం యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారి ఇంటర్వ్యూకు వెళ్ళాను. ఇంటర్వ్యూ మధ్యలో ఐదుగురిలో ఒకాయన "Do you read books on culture" అని నన్ను అడిగారు. "We don't find culture in books sir, culture is visible in the lives of the people" వంటి సమాధానం ఏదో చెప్పినట్లు గుర్తు. ప్రశ్న అడిగిన వ్యక్తి మొహం చిన్నబోయినా, మిగతా వారి వదనాలు వెలిగాయి. జీవన విధానంలో అన్నామనుకోండి. దీన్ని తక్షణమే లైఫ్ స్టైల్ అని అనువదించుకుని అర్జంటుగా నైట్‌లైఫ్, షికార్లు, షాపింగ్ వంటివి గుర్తుచేసుకునే పరిస్థితి దాపురించింది.

నిజానికి సైన్స్ – సంస్కృతి అంటే సత్యాన్వేషణ. రాగద్వేషాలు లేకుండా వాస్తవాలు అంగీకరించడం. ఇంకొంచెం లోతుగా వెళ్తే ఎక్కువమందికి దేనిద్వారా

లాభం, ప్రయోజనం, తక్కువ ప్రమాదం సంభవిస్తాయో వాటిని స్వీకరించడం. కనుక సైన్స్ అంటే ప్రజాస్వామ్య భావన కూడా! ప్రాంతం, కాలం, సమాజం, వ్యక్తులు, వ్యక్తుల వాదాలు వంటివాటితో పనిలేకుండా వాస్తవాన్ని అంగీకరించాలి. తెలియని విషయాలు బోధపడిన క్రమంలో కొన్ని విశ్వాసాలు, గుడ్డినమ్మకాలు పటాపంచలు కావచ్చు. నిజానికి ఈ రకంగా విశ్వాసాలు పటాపంచలు కావాలని సైన్స్ పరిశోధనలు జరుగవు. ఇవి కేవలం వాడుకోనటువంటి సందర్భములో ఎదురయిన మంచి ప్రయోజనాలు. ఇది బోధపడాలంటే మరో ఉదాహరణ చెప్పాలి. మనం టెక్నాలజిని వాడుతాం. కావల్సిన ఫలితం రావాలని – బైకును పెట్రోలుతో నడిపి తక్కువకాలంలో ఎక్కువ దూరం వెళ్ళినట్టు. అయితే మనం కోరుకోకపోయినా బైక్ ఎంతోకొంత వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. మరో ఉదాహరణ తీసుకుందాం. ఒకరు మామూలుగా పాడినపుడు కంటే మైక్రోఫోన్‌లో పాడినపుడు మెరుగ్గా ఉంటుంది. టెక్నాలజి కారణంగా ఎదురయిన పరిమితి ఇక్కడ గాయకునికి తోడ్పడింది. అయితే ఇది ప్రయోజనకరమైన సైడ్ ఎఫెక్ట్. ఇదే విధంగా సైన్స్ పరిశోధనలు మతం, దేవుడికి సంబంధించిన విశ్వాసాలు దెబ్బతినడం వంటివి కూడా అని గ్రహించాలి. అంతేకానీ అది సైన్స్ ప్రథమ కర్తవ్యం కాదు. దీన్ని గుర్తించకుండా కొందరు నాస్తికత్వాన్ని ప్రబోధించడమే, విశ్వాసాలను ఖండించడమే సైన్స్ కర్తవ్యమని భావిస్తారు, ప్రచారం చేస్తారు.

సైన్స్–సంస్కృతి అంటే రాగద్వేషాలు లేకుండా వాస్తవాలను అంగీకరించడం అలాగే సైన్స్–సంస్క ృతి అంటే వినమ్రతకూడా. అంతరిక్షంలోకి పోయినా, అణుకుహరంలోకి తొంగిచూసినా మనిషి మేధ, సామర్థ్యం ఎంత అల్పమో బోధపడాలి. నేటికీ ఒకజీవి ఏ కారణంగా ప్రాణంతో ఉందో పూర్తి స్పష్టంగా చెప్పజాలం. ఏ ధర్మాలతో ఉంటే ప్రాణంతో ఉన్నట్టు, ఏ ధర్మాలు లేకపోతే ప్రాణాలు లేనట్టో చెప్పగలం గానీ, ఆ ధర్మాలు ఎలా, ఎందుకు సిద్ధిస్తాయి వివరింపజాలం. ముందు ముందు పరిశోధనలు తప్పక చెబుతాయి. ఎందుకంటే భౌతికశాస్త్రాల పరిశోధన పనిముట్లనూ, అధ్యయన విధానాలను పరిపుష్టం చేశాయి. ఈ పరికరాలను, ప్రణాళికలను జీవ సంబంధమైన పరిశోధనకు వాడటమే ఇప్పటి గొప్ప పరిశోధన. అంతేకాదు దయ, కరుణ, ప్రేమ, వాత్సల్యం వంటి మానవీయ గుణాలు ఎందుకు, ఏ కారణంగా కొందరిలో ఉంటాయో లేదా కొందరిలో ఉండవో ముందు ముందు బోధపడవచ్చు. కనుక లోతయిన సైన్స్ అధ్యయనం అనేది

వినమ్రతను, సహిష్ణతనూ ఇవ్వాలి. జగదీష్ చంద్రబోస్ మహాశయుడు ఒక దశలో భౌతికశాస్త్రం, జీవశాస్త్రం, మనస్తత్వ శాస్త్రం ఒకటి కావాలని భావించారు. కానీ మనకు తారసపడే అనుభవాలు వేరే రకంగా పరిస్థితి ఉందని చెబుతున్నాయి. సైన్స్‌ను ప్రేమించే, గౌరవించే వారు కూడా పెళుసుగా, కటువుగా, తూష్ణీభావంతో మాట్లాడకూడదు. అలా ఉండటం సైన్స్ సంస్కృతి కాజాలదు.

ఉద్దేశించిన దానికి వ్యతిరేకమైన ఫలితాలు కూడా రావచ్చు. భూకేంద్ర సిద్ధాంతం ఋజువు చేయాలని టైకో్‌బ్రాహి పరిశీలనలు క్రోడీకరించడం ప్రారంభించారు. అనేక శ్రమలకోర్చి, ఎంతో సమాచారం సేకరించి, విశ్లేషణ చేయకుండానే గతించారు టైకో్‌బ్రాహి. ఈ సమాచారాన్ని టైకో్‌బ్రాహి శిష్యుడు కెప్లర్ అధ్యయనం చేసి ప్రతిపాదించిన సూర్యకేంద్రక సిద్ధాంతం భూకేంద్రక సిద్ధాంతానికి చావుదెబ్బ కొట్టింది. అలాగే హైగెన్స్ కాంతి తరంగ సిద్ధాంతం న్యూటన్ కాంతికణ సిద్ధాంతాన్ని విభేదించింది. న్యూటన్‌కి పేరు ప్రఖ్యాతలుండటం వల్ల హైగెన్స్ సిద్ధాంతం వ్యాప్తికావడానికి కొంత ఎక్కువ కాలం పట్టింది. అయితే ఆ తర్వాత ఎంతోకాలానికి కణప్రవృత్తి ఉందని కూడా ఐన్‌స్టీన్ ప్రతిపాదించి, ఋజువు చేశాడు. కనుక సార్వత్రికతకు కూడా పరిమితి ఉందని గుర్తించాలి. విబేధించే అంశం వాస్తవమయినపుడు పటాటోపాలు, రాగద్వేషాలు లేకుండా స్వీకరించడం కూడా సైన్స్ సంస్కృతి.

అర్థం చేసుకోవడానికీ, బోధించడానికీ కొన్ని చిత్రాలనూ, ప్రతీకలనూ సౌలభ్యం కోసం తీసుకుంటాం. ఇదే విధానం ఇతర చోట్లా కనబడుతుంది. అయితే క్రమంగా ప్రతీకలకూ, చిత్రాలకు పరిమితమై అసలు వాస్తవాలనూ, దృగ్విషయాలనూ నిరాదరించి, నిర్లక్ష్యం చేయడం కూడా బాగా కనబడుతుంది. ఇది సైన్స్‌లోనూ ఉండ కూడదు, ఇతర రంగాలలోనూ ఉండకూడదు. ముఖ్యంగా సైన్స్ అభిమానులం, విధానంగా గల వారమని చెప్పుకునేవారు ఈ రకం తయారుకావడం అనర్థదాయకం.

కనుక సైన్స్ సంస్కృతి అంటే – సత్యాన్వేషణ, వాస్తవాలను అంగీకరించడం, విభేదించే రీతిలో ధ్రువ పరిచినపుడు వాటిని కూడా స్వీకరించడం, ప్రతీకలను కాకుండా అసలు విషయాలపై దృష్టి పెట్టడం, వినమ్రతతో ఉండటం, అవసరమైన సైన్స్‌కుండే పరిమితిని కూడా గుర్తించడం. ప్రజాస్వామికంగా సాగుతూ గొప్ప ఆశావాదంతో, మానవతావాదంతో ప్రవర్తించడం. ఇంకా మాట్లాడితే మరింత.... అది మరోసారి!



# 9. భాషా సంస్కృతుల పరాయికరణ

**– ఆచార్య జయధీర్ తిరుమలరావు**

(అధ్యక్షులు : తెలంగాణా రచయితల వేదిక, హైదరాబాద్)

స్మృతులు అనే ధర్మశాస్త్ర గ్రంథాలు మన దేశంలో వ్యక్తిగత సామాజిక మత ఆర్థిక రాజకీయ రంగాల్ని ఎంతో ప్రభావితం చేశాయి. ఈనాటికీ వాటి ప్రభావం ఎనలేనిదిగానే ఉంది. నాలుగు వర్ణాల వ్యవస్థ, ఆయా కులాల హక్కులు బాధ్యతలు ఆ గ్రంథాలు స్పష్టంగా తెలుపుతాయి. సూత్రీకరిస్తాయి. ఈ సూత్రాలను ముందుకు తీసుకుపోవడమే ఆనాటి సాహిత్యం, కళలు, భాష చేయవలసిన పని. ఈ సూత్రాలను పాటించని వారు పొందే శిక్షలను సైతం ఇవి నిర్ణయించాయి. శిక్షలు పొందే అర్హత ఎప్పుడూ దాసులదే. శిక్షించే అధికారం ఎవరిదో అందరికీ ఎరుకే. ఈ దాసులే బానిసలు. యూరపు దేశాల్లో బానిసలను శిక్షించడానికి ఇంత పకడ్బందీగా అంటే – సివిల్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ అని పిలిచే ధర్మశాస్త్ర గ్రంథాలు అక్కడ లేవు. మన దేశంలో మాత్రమే ఉన్నాయి.

ఈ నేలమీద పురాణాలు, స్మృతుల సారం ఏమంటే శ్రమించని కులాల / వర్గాల ఆధిపత్యం కొనసాగాలి. ఇతరుల శ్రమని ఆనందించే విశ్రాంతి వర్గానికి ఎలాంటి బాధ కలగకూడదు. దాసులు లేదా శూద్రులు నిరంతరం శ్రమించాలి. వారు ఏ రకంగా కూడ ప్రశ్నించకూడదు. ఈ రెండు వర్గాలు రెండు ప్రత్యేకమైన, విభిన్నమైన వర్గాలు. ఇవి కనిపించని బలమైన సరిహద్దులచే దూరం చేయబడిన సమూహాలు. వేదమంత్రం వింటే ఒకరి చెవిలో సీసం పోయాలి. ఒకరు తినే ఆహారం మరొకరికి కనిపిస్తే మైల పడాలి. తాకితే అంటరానివాళ్ళను దండించాలి. ఒక్క అస్పృశ్యత గురించి కొత్తగా వేయి పేజీల గ్రంథం రాయొచ్చు. ఈ అస్పృశ్యత సజీవ సంప్రదాయంగా వివిధ రూపాలలో దేశమంతా వ్యాప్తిలో ఉంది. దీని ప్రభావం భాషలపై పడకుండా ఉంటుందా.

ఐనా విదేశీయులకి మనదేశపు ఆధ్యాత్మిక చింతన, పరమత సహనం, భిన్నత్వంలో ఏకత్వం, నాగరికతలపై ఎనలేని ఆసక్తి. ఈ వైపు నుండి కూడా పెద్ద ఆకర్షణీయమైన వాదంగా వివిధ కాలాల్లో వాటి గురించి గొప్పగా వినిపిస్తుంటారు. చిత్రిస్తుంటారు. కాని ఇక్కడ ప్రబలంగా ఉన్న భాషా సాహిత్య సంస్కృతులపై జరిగే అణచివేత కనబడలేదు. దాని గురించి ఎవరూ పట్టించుకోలేదు.

వారు ఈ దేశ ప్రత్యేకతగా గొప్పగా చెప్పుకునే 'భిన్నత్వంలో ఏకత్వం' అంటే మంచుకొండల నుండి కడలి వరకు వ్యాపించి ఉన్న బ్రాహ్మణ్య సంస్కృతి యొక్క

ఏకత్వం అనే అర్థం. దేశ వ్యాప్తంగా ఉన్న వేలాది గిరిజన తెగలు, జానపద సమాజాలు, వైవిధ్యభరిత బృందాలు, గణరాజ్యాలు – ప్రజల దేవతలు, మతాలు, విశ్వాసాలు, సాహిత్యాలు అన్నింట్లో తేడా కొట్టొచ్చినట్టుగా కనిపిస్తుంది. రెండు విడి ప్రపంచాలుగా ఉన్న చోట మరి ఈ ఏకత్వం ఎలా సాధ్యమైంది – అసలు ఏకత్వం అనే పదార్థం ఉందా. కనీసం అలాంటి భావన అయినా ఉందా లేదా ఉంటే దాని రూపం ఏమిటి అని ఆలోచించాలి. భిన్నత్వం తొంభై శాతం శ్రామికవర్గంగా ఉండగా పది శాతం ఉన్న ఏకత్వం మన సంస్కృతికి సంకేతం ఎలా అయి కూచుంది.

అసహనంతో అంటరానివాళ్ళకి మరణదండన విధించిన హైందవం పరాయి పాలకుల పట్ల వల్లమాలిన సహనాన్ని ప్రదర్శించింది. మన సహనశీలత వెనక దాగి ఉన్న ఈ అగాధం పూడ్చలేనిది. పరమతసహనం భారతీయ లక్షణమే. కాని ఏ కారణాల వల్ల పాలక మతాల పట్ల సహనం వహించామో అర్థం చేసుకోవాలి. దేశీయ ప్రజలను కట్టడి చేయడానికే విదేశీ శక్తులతో, వలస పాలకులతో సామరస్య పొత్తులకు ఒడిగట్టారని తెలుస్తున్నది.

పరమత సహనశీలిగా మన దేశానికి గుర్తింపు ఉంది. జైనం, బౌద్ధం, ఇస్లాం, క్రైస్తవం వంటి మతాలు వైదిక మతంతో కలసి జీవించాయని అంటారు. నిజానికి జైనాన్ని ఆనాటి ఇక్కడి ఆధిపత్య మతాలు ముఖ్యంగా వీరశైవం అణచివేశాయి. ప్రతి విగ్రహాన్ని, ఆలయాన్ని, రంగూరూపులతో మార్చివేసారు. జైన తీర్థంకరుల విగ్రహాలన్నీ నేలపాలయ్యాయి. అలాగే బౌద్ధం, బౌద్ధాలయాలు, స్థూపాలు దిబ్బల్లోనే నేటికీ కనిపిస్తాయి. వీటిని నేలమట్టం చేశామనుకున్నారు. కాని ఆ నేలే వాటికి ఈనాటి దాకా రక్షణకవచమైంది. ఆ మట్టిపొరలే కాలగర్భంలో కలిసిపోకుండా ఊపిర్లూదాయి. నిజానికి ఇస్లాం దాడిలో హైందవం డీలా పడింది. దేశవ్యాప్తంగా జరిగిన దాడుల్లో వారి ఆలయాలు సగానికి సగం దెబ్బతిన్నాయి. మహమ్మదీయ మతం ఇక్కడి మత వైరుధ్యాలను, కులం అంతరాలను ఆసరాగా చేసుకుని కాలూనింది. వాళ్ళకు ఈ దేశంలోనే ఉన్నత వర్గం సలాం కొట్టింది. ఆ తరువాత ఆంగ్లేయులు రెండు చేతుల్లో కేవలం బైబిల్, తుపాకి చేబూని వచ్చారు. అదే ఉన్నత వర్గం మొదట క్రైస్తవ్యానికి శాల్యూటు చేసారు. అంతేకాదు, మతాంతరీకరణకు అంగీకరించింది. గ్రామీణ, పట్టణ ఆధిపత్య కులాలు, వర్గాల వారే అందులో చేరిపోయి అధికారం ప్రాంగణం ముందు వరుసలో బారులు తీరిపోయారు. ఇదీ అసలు భారతీయ సాంస్కృతిక చిత్రపటం.

శ్రమ చేయవలసిన అవసరం లేని వర్గం రాజ్యయంత్రంలో భాగమై మంతనాలతో తమ భావజాలాన్ని విస్తరింప చేసుకోగలిగింది. నిత్యం శ్రమిస్తూ ఉత్పత్తికోసం ఆరుగాలం తంటాలు పడే వర్గం ఏం చేయగలదు! ఈ వర్గం వారికి ఇంటి వసతి, ఒంటినిండా కప్పుకునే గుడ్డా, ఆహార పదార్థాల లేమి సృష్టించబడేది. పైగా నిత్యం వెయ్యినొక్క అవాంతరాలు సృష్టించబడుతుంటే ఎవరైనా ఏం చేయగలరు. విద్యకు, లేఖనానికి దూరంగా ఉంచబడిన ఈ శ్రేణులు ఇటీవలి దాకా మధ్యయుగాల చీకటి బతుక్కే పరిమితమయ్యారు. జీవన ప్రమాణాలలోనే కాదు భాషా సంస్కృతుల మధ్య కూడా అంతరం ఎంతటిదో చెప్పలేనంతగా ఉండింది.

ఇక్కడ మరొక ప్రశ్న తలెత్తుతుంది. ఇవ్వాళ కూడా వందలాది పరిశోధనలు చేస్తున్నామని చెప్పే వ్యక్తుల్ని, సంస్థల్ని ఒక్క చిన్న ప్రశ్న అడగాలని ఉంది.

వేదాల్లో విమానాల తయారీ గురించి ఉంది అంటారు. వేదయాన విద్య ఉందంటారు. అత్యున్నత వేదగణితం ఉందంటారు. అత్యున్నత విజ్ఞాన సూత్రాలన్నీ ఉన్నాయని అంటున్నారు. ఒప్పుకుందాం. మరి ప్రపంచంలో అన్నిచోట్ల కనిపెట్టబడిన నాగలి కర్రు, కుమ్మరి కుండ, ఇనుప గొడ్డలి తప్ప సకల ఉత్పత్తి రంగాలలో ఉన్న ఈ దేశ శ్రామికుల కోసం మీరేమి కొత్తగా కనుక్కున్నారు? యంత్రరూపకల్పనతో ఎన్నో కోణాల్లో అనాదిగా అభివృద్ధి సాధించవలసి ఉండింది. కాని ఎందుకు అలా జరగలేదు? ఆహార పదార్థాల ఉత్పత్తి తక్కువైనప్పుడల్లా చెట్లు కొట్టేసి గిరిజనుల అటవీ భూమిని సాగుకు తేవడం తప్ప మరింకేమీ చేయలేకపోయాం. అందుకే భారతీయ సమాజ చలనాన్ని పరిశీలించినప్పుడు అది నత్తనడకే నడిచిందని చెప్పక తప్పదు. దేశంలో ఎలాంటి పురోభివృద్ధినీ సాధించకుండా అంతా సాధించామని చెప్పుకోవడాన్ని ఏమనాలి? ఇవ్వాళ భారతీయుల కొత్త ఆవిష్కరణలు ఏమైనా ఉంటే అవి దేశం వెలుపల జరగడం గమనించాలి.

## 2

ఇక్కడి శూద్ర, శ్రామిక వర్గాలు ఎంతో సృజనాత్మకతను కలిగి వున్నాయి. చరిత్రలోకి తరిచిచూస్తే వారి గొప్పతనం స్పష్టమవుతుంది. భూమిలో దాగిన వివిధ రకాల మట్టిని కనిపెట్టి ఎంతో జాగ్రత్తగా వస్త్రగాళితం పట్టి చక్కగా మట్టిముద్దలు చేసి వాటితో ఎన్నో రకాల పాత్రలు చేశారు. శాతవాహన రాజులకి ముందు నుండీ ఇలాంటి మట్టి పనికి పెట్టింది పేరు. పైన ఎరుపు లోన నలుపు రంగుతో తయారుచేసిన ఈ మట్టి పాత్రలు, తదితర సామాగ్రి ఈనాటికీ చెక్కు చెదరలేదు. అనేక ఆకారాలు, బొమ్మలు తయారుచేసి వాటిపై సంకేతాలను కూడా అద్దారు. ఆ తరువాత వాటినే అక్షరాలుగా రూపొందించారు. వీరు ఎవరు? అతి సామాన్యమైన కుమ్మరులే.

గుట్టలమీద కొండలమీద జీవించిన ఆదిమానవులు గుహల్లో బొమ్మలు చెక్కారు. వివిధ రంగుల్లో ఆకారాలు చిత్రించారు. మానవ చిత్రాలను అజరామరం చేశారు. తమ చుట్టూ ఉన్న జంతువుల్ని, పక్షుల్ని రంగుల్లో ముంచి వాటిని గోడలమీదకెక్కించారు. వీరు ఎవరు? ఈ దేశపు మూలవాసులు.

జంతు సంకేతాలను అక్షరాలుగా మార్చారు. శిలలపై చెక్కిన గీతలు రాతలయ్యాయి. ఆ రాతలే శాసనాలయ్యాయి. శిలలను శిల్పాలు చేసి చరిత్రని కళ్ళ ముందు నిలిపారు. వీరు అత్యంత సామాన్య మానవులు. వీరు రాతిపని చేసే నిత్య శ్రామికులు.

మరోవైపు మట్టి కోసం చేసే అన్వేషణలో ఖనిజాల ముడి పదార్థం లభించింది. ఆ రాళ్ళనూ రప్పలనూ ఏరి, వేడి చేసి, కరిగించి, శుద్ధి ప్రక్రియ ద్వారా లోహాలుగా మార్చారు. శిలాయుగంలో రాతి పరికరాలను చేయగా ఇనుము, ఉక్కు, రాగి, ఇనుము వంటి లోహాలతో చేతిలో సులభంగా అమిరే పరికరాలు చేశారు. వాటిపై తమ సమూహపు గుర్తులను దిద్దారు. కత్తులూ, కటార్లు చేసి వాటి ఒరలపై అక్షరాలను అందంగా తీర్చారు. వీరెవరు? అత్యంత సామాన్య లోహకారులే.

ప్రకృతి ఒడిలో కనిపించే బెరడుని తీసి, ఎండబెట్టి చదును చేసి దానిపై అక్షరాలను  రచించారు. ఎండిన ఆకులు, జంతు చర్మాన్ని ఎన్నో రకాలుగా రాతకి ఉపయోగించుకున్నారు. ఆ తరువాత వస్త్రం నేశారు. దానిపై రంగుల్ని అద్ది లేఖనయోగ్యం చేశారు. ఉత్తర భారతంలో బూర్జర పత్రంపై, దక్షిణాన తాళపత్రంపై అక్షరాలని కావ్యాలుగా చేశారు. పక్షి ఈకలు, పంది ముళ్ళూ రాతకి అంతగా పనికిరావని లోహకారుడు తాళపత్రంపై రాయడానికి లోహంతో ఘంటాలు చెక్కి ఇచ్చాడు.

తాటాకులు విరగకుండా, పగిలిపోకుండా సుతిమెత్తని ములుకును నిర్మించి ఇచ్చాడు. అందమైన గుండ్రని తెలుగు అక్షరాల దస్తూరిని తెలుగుజాతికి అంకితం చేశాడు. వీళ్ళంతా ఎవరు? వారే దస్యులు, దాసులు, శూద్రులు – మనుషులు అంటరాని శక్తులు. అగణిత మేధాశక్తి సంపన్నులు. అతి సామాన్యులు. ఏ వైజ్ఞానికావిష్కరణకి కూడా తామే కారకులమని చెప్పుకోలేని త్యాగమూర్తులు. వారే సామూహిక జీవన ఆనంద హేతువులు. సామాజిక సౌందర్య కళా తపస్వులు. ఉత్పత్తి సంబంధాల నుంచి నోటి భాషకి, నుడికారాలకి, మాండలికాలకి వారే సృష్టికర్తలు. వేదం మౌఖికమే. అది అపౌరుషేయం. సామాన్యుని మౌఖికగానం మాత్రం అనాదరణీయం. ఎందుకంటే ఇది తెలుగులో, అందునా ప్రజల భాషలో ఉంది కాబట్టి. నోటిమాటని అక్షరాలుగా తీర్చిదిద్దితే వాటిని మాత్రం అమాంతం వాటేసుకుని తమదిగా సొంతం చేసుకున్నది పండితవర్గం.

వేల ఏళ్ళ క్రితమే కర్రలపై అక్షరాలు చెక్కి అచ్చుకి నాంది పలికారు. వీళ్ళకి రావలసిన పేరుని గూటెన్‌బర్గ్‌కి ఆపాదించాం. జింకుతో అందమైన గీతల బొమ్మల బ్లాకులు చేసి అచ్చేశారు. అచ్చువచ్చాక రాజ్యయంత్రం సహాయంతో ఏర్పరచిన విద్యావిధానంలో హెచ్చు తరగతుల వారికే అనుమతి లభించింది. మాట, రాతలను సంస్కృతంలోకి తర్జుమా చేసుకున్నారు. భాష, లిపికి సంబంధించిన జ్ఞానం, పై వర్గాల సొంతమైంది. దాన్ని రూపొందించిన ఉత్పత్తి వర్గం చూస్తూ ఉండిపోయింది. ఇంకా అలాగే ఆశ్చర్యంతో పాలుపోక మాన్పడి పోయింది. వీరు మేధోహక్కులకి (ఇంటలెక్చువల్ ప్రోపర్టీ రైట్స్‌కి) ఆమడ దూరంలో ఉన్నారు. ఏ ప్రభుత్వం, ప్రభుత్వ సంస్థలు, ప్రగతిశీల సంస్థలు, వ్యక్తులు వారి పేర వారి విజ్ఞానాన్ని మేధోహక్కులని గుర్తించడానికి ముందుకు రావడం లేదు. ఇకముందు కూడా వస్తారని నమ్మకం లేదు. ఇదీ మన ప్రజాస్వామ్యం. ఈ దేశంలో ప్రజాస్వామ్యం కూడా పై వర్గాలకే ఊడిగం చేస్తుంది.

3

ఎప్పుడైతే శారీరక శ్రమ చేయకుండా బతికే హక్కు బ్రాహ్మణ్య వర్గాలకు ఇవ్వబడిందో అప్పటి నుండి ఒక కాల్పనిక జగత్తు సృష్టింపబడింది. ఇందులో కర్మ సిద్ధాంతం, పునర్జన్మ సిద్ధాంతం, ద్విజ భావనలు పెచ్చుపెరిగాయి. ఇలాంటి ఆలోచనలకు ఎక్కువగా చోటులేని సమాజం భారతదేశంలో ఎక్కడైతే ఉండిందో అక్కడ మాత్రమే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో మేధాశక్తి అలరారింది. సామాజిక దృక్పథం పెరిగింది. భారతీయమైన శాస్త్ర మేధో ఆవిష్కరణలకి పాదు పడింది. అయితే అలాంటి వాటిని సైతం పైవర్గం వారు తమ ఆవిష్కరణలుగా చెప్పుకుని వాటిని మెల్లిగా లోబరుచుకోవడం జరిగింది. ఇలాంటి ధోరణి అన్ని రంగాల్లోనూ కనిపిస్తోంది. బౌద్ధం నుండి అనేక ఉదంతాలను తాత్వికతలను గ్రహించి వైదిక / సనాతన / హిందూ మతం పేరిట చెలామణి చేసుకున్నారు. కేవలం దేశభాషలు, ప్రాంతీయ భాషలకి పరిమితమైన అంశాలను తమ భాషలోకి బదిలీ చేసుకున్నారు.

ఇలాంటి పెత్తనపు ధోరణిని మనం ఈనాటికీ చూడవచ్చు. శ్రమ, నైపుణ్యం క్షేత్ర స్థాయిలోనే లభిస్తాయి. అవి కలిగినవారు సృజనాత్మక శక్తి కలిగి ఉంటారు. వారే కొత్త ఆవిష్కరణలు చేయగలరు. అందుకే ధర్మశాస్త్రాల్లో బుద్ధిశక్తిని ఉపయోగించే పనులకు, విధులకు దూరంగా శూద్రులను, దళితులను ఉంచారు. కేవలం యంత్రంలా శరీరశ్రమ చేయడమే వీరికివ్వబడిన పని లేదా హక్కు. దీనికి భిన్నంగా ఎలాంటి గీత దాటకూడదు. అంటే తన పని / వృత్తి నైపుణ్యంతో సాధించే కొత్త ఆలోచనలు అతడు చేయకూడదు. ఆ వృత్తివిధానం సృష్టించిన భాషని సైతం,

భాషలో ఒక భాగంగా కూడా గుర్తించకూడదు. ఆ వృత్తి సముదాయం మానవ సంబంధాల సయోధ్య, సంఘర్షణల నుండి వెలువడిన భావజాలం భాష ద్వారా, సాహిత్యం ద్వారా వ్యక్తం కాకూడదు. అలా వ్యక్తం అయినప్పుడల్లా వారిమీద నైతిక దాడులు జరిగేవి. కొన్ని రకాల శిక్షలు కూడా విధించారు. వాటిని అమలుపరచేందుకే గ్రామాధికార వ్యవస్థని నిర్మించి కట్టుదిట్టం చేశారు. ప్రతిదశలో ఈ వర్గాల ద్వారా వెలువడిన కొత్త కళాసాహిత్యాలు పై వర్గాలవారికి చేరేవి.

భాషా సంపద వెల్లివిరిసిన ఒక గొప్ప వ్యక్తీకరణకి లోనైనప్పుడల్లా దానిపై నియంత్రణ ఉండేది. ఆ విధంగా భారతీయ ఆధిక్య వర్గాలు ఎన్నో భాషలను తొక్కివేశాయి. తెలుగు భాష కూడా ఎన్నో చారిత్రక పరిస్థితులలో చాలా ఒడిదుడుకులు ఎదుర్కొంది. రాజవంశాలు ఏదో ఒక మతం వత్తాసుతోనే అధికారంలోకి వచ్చాయి. లేదా మతం సహకారంతో అధికారం నిలుపుకున్నాయి. ఆ మతం ఏ భాషకు ఏ స్థానం ఇవ్వాలో నిర్ణయించింది. సమ్మతించబడిన అలాంటి భాష మాత్రమే కొంత వెలుగులోకి వచ్చేది. మధ్యయుగాల కాలం నుండి ప్రాంతీయ భాషల్లో కొన్ని శాసనాలు అక్కడక్కడా కనిపిస్తాయి. సాహిత్య గ్రంథాలు కూడా కొన్ని వెలువడ్డాయి. ప్రభుత్వ శాసనాలు ఎక్కువగా సంస్కృతంలో ఉండేవి. ఆ శాసనం ప్రజలకోసం అయితే దానిలో కొంతభాగం తెలుగు ఉండేది. లేదా సంస్కృతీకరించిన తెలుగులోనే రూపొందేవి.

శిల్పం, వైద్యం, జంతు శాస్త్రాల వంటివి ప్రజలకి సంబంధించినవి. ప్రజల నృత్యాలు, వైద్య విధానం, చికిత్సలు కూడా సంస్కృతంలోనే ఎక్కువగా రాశారు. అలా రాయాల్సిన పరిస్థితి వెనుక ప్రజావైజ్ఞానికాంశాల్ని పరాయీకరించడమే లక్ష్యం అని చెప్పక తప్పదు. గుర్రానికో, ఏనుగుకో అనారోగ్యం వస్తే ఏ మందు వాడాలో ఎలా తగ్గుతుందో దాన్ని నిరంతరం అంటిపెట్టుకుని కాపాడే రౌతుకో, మావటివాడికో తెలుస్తుంది. అలాంటి వారికి అర్థం అయ్యే పరిభాషలో రాయాలా లేదా సంస్కృతంలో రాయాలా? ఇది చాలా మామూలు విషయం. ఈ వైద్య పరిభాషని ఆకులు అలములతో కూడిన చికిత్సని సంస్కృతీకరించాల్సిన పరిస్థితి ఎప్పుడొస్తుంది. ప్రజల పరిజ్ఞానాన్ని వారికి చెందకుండా తమదిగా చేసుకోవాలనుకున్నప్పుడే, భాష కాని భాషలో దాన్ని గ్రంథస్థం చేయడం ద్వారా ఉన్నత వర్గాల వారికి ఊడిగం చేయించడం కోసమే. ప్రజల వాడుకని వారి కళ్ళముందే వారికి అర్థం కాకుండా చేయడం కోసమే. అలా కొన్ని భాషలు అదే పనిగా పనిచేశాయి. ఆశ్రమాలు, గురుకులాలన్నీ పై వర్గం వారి కోసమే పనికొచ్చాయి. ఈ పండితవర్గం ఎన్నడూ ప్రజల భాషలో

రాయలేదు. ప్రాంతీయ భాషని సంస్కృతమయం చేయడమో లేదా సంస్కృత ఛందోవ్యాకరణాల ఉపగ్రహంగా మార్చడమో జరిగింది. సంస్కృతంలో రాసి ఉంచిన గ్రంథాలను బహిరంగం కాకుండా గురువులు వాటిని దాచిపెట్టారు. వాటిని గురుకులాలలో భద్రపరిచేవారు. ఈ విజ్ఞానానికి మూలమైన ప్రజా రాశులను అంటరానితనం పేరుతో దూరంగా ఉంచారు. కట్టడి పేరుతో అస్పృశ్యతని అమలు చేశారు. అంటరానితనం యొక్క ప్రథమోద్దేశ్యం వారి జ్ఞానాన్ని తస్కరించి సంస్కృతీకరించడమే అనిపిస్తోంది. ఇందుకోసమే అంటరానితనం ఈ దేశంలో బలంగా పాటింపబడుతోంది.

ప్రస్తుతం ప్రజలు వైద్యంలో ఉపయోగించే మూలికల కోసం ప్రపంచ వ్యాప్తంగా బహుళజాతి సంస్థలు ఊరూవాడా తిరుగుతున్నాయి. ఆ మూలికలతో మందులు కనిపెట్టి వ్యాపారం చేయడమే వాటి పరమోద్దేశ్యం. అంతేగాని ప్రజలకు సేవ చేయడం కాదు. అలాగే వైద్య విజ్ఞానాన్ని సంకలనం చేసి కీర్తి ప్రతిష్టలు సంపాదించడం – ప్రజల అనుభవ వైద్యవిద్యని వారి నుండి దూరం చేయడమే ఉద్దేశ్యం. ఐతే తెలుగులో వైద్య పరిభాష మౌఖికంగానే ఎక్కువగా చెలామణిలో ఉంది. లిఖిత రూపంలో దేశీయ భాషా పదాలతో పండితవర్గం నమోదు చేయకపోవడం కూడా ఇక్కడ గమనించాలి. శాస్త్ర పరిజ్ఞానం ప్రజలకి చెందనీకుండా ప్రాపర్టీరైట్ ప్రశ్నే లేకుండా, కనీస కృతజ్ఞతాభావం లేకుండా వారికి దూరం చేశారు. కేవలం వేదాలే వినవద్దా. ఇలాంటి తమ తస్కర జ్ఞాన సూత్రాలు వినవద్దా. సీసం కరిగించడం వెనుక దాగిన అనేక కథలు బట్టబయలు కావాలి. అసలైన భారతీయ జ్ఞానచరిత్రని ఆ రకంగా కొత్తగా నిర్మించాలి. ఎన్నో అంశాలు పరాయికరింపబడినవనే ఆలోచనతో మన చరిత్ర, నాగరికతల కథల్ని, భాషల్ని తవ్వి తీయాలి. జాతి, భాష, సంస్కృతి కూడా అందులో భాగమే. చరిత్ర పొడవునా మన భాషలకి జరిగిన ఆటుపోట్లని తెలుసుకోగలిగితే దానిపై ఎంతో అనురాగం ఏర్పడుతుంది. ఆ భాషని రూపొందించిన మన పూర్వీకుల గొప్పదనం తెలుస్తుంది. బాధలకీ గాధలకీ ఎదురొడ్డి నిలిచిన, వారి ధీశక్తి ఎంతటిదో తెలుస్తుంది. మనం వారి నుంచి ప్రేరణ పొందాలి. ప్రజల జ్ఞానం పరులపాలు కాకుండా ఆలోచించాలి. అలాంటి జ్ఞానానికీ, భాషకీ మనం హక్కుదారులం కావాలి.

**(భాషావరణం, తెలుగు సమాజం – సంస్కృతి : ఒక చూపు గ్రంథం నుండి..)**



# 10. సంస్కృతి - కళ - సాహిత్యం

- డా॥ పాపినేని శివశంకర్
(కేంద్రసాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత, గుంటూరు)

భారతీయ సంస్కృతి గురించి ప్రత్యేకించి తెలుగు సంస్కృతి గురించి మాట్లాడుకొనే ముందు 'సంస్కృతి' అంటే ఏమిటి? అనే ప్రశ్న వేసుకుంటే బాగుంటుంది. ఒక జాతి జీవన విధానంలోని 'ఉత్తమ' లక్షణాలను సంస్కృతి అనుకుంటారు మామూలుగా. 'మన సంస్కృతి చాలా గొప్పది' అనుకొనేటప్పుడు తమ జీవనంలోని అనుకూల పార్శ్వాన్నే (పాజిటివ్ సైడ్) వారు గుర్తించదల్చుకొన్నట్లు అర్థమవుతుంది. అప్పుడు అందులోని అవలక్షణాలు లెక్కకు రావు. అయితే ఈ మాటను విశాలమైన అర్థంలో వాడటం మంచిది.

సంస్కృతి అంటే ఒక జాతి జీవన విధానంలోని విశిష్ట లక్షణాల సముదాయం.

ఈ భావనలో మంచి చెడులన్నీ కలిసే వుంటాయి. సందర్భాన్ని బట్టి వాటిని వేరు చేసుకోవాల్సి వుంటుంది. ఆహారం అలవాట్ల దగ్గర్నుంచి ఆలోచనా విధానం దాకా ఈ విషయం వ్యాపించి వుంటుంది.

ప్రపంచంలోని అతి ప్రాచీన సంస్కృతుల్లో భారతీయ సంస్కృతి ఒకటి. ఈ సంస్కృతిలో అవిచ్ఛిన్నమైన ఒక పరిణామం మనకు కన్పిస్తుంది. ఈ క్రమంలో భారతీయుల లలిత కళలు, దర్శనాలు విదేశీయులను అబ్బురపరుస్తూ ఈ దేశ ఔన్నత్యాన్ని చాటి చెపుతున్నాయి.

భారతీయ సంస్కృతి ఏకశిలా సదృశమైంది (మోనోలిథిక్) కాదు. ఏకముఖీనం కూడా కదు. అది విభిన్న సంస్కృతుల సమ్మేళనం. ఈ దేశంలో ఆర్యుల రాక కన్న ముందే ద్రావిడులు, నాగులు, కిరాతులు, యక్షులు, నిషాదులు మొదలైన జాతులున్నాయి. తర్వాత యవనులు, హూణులు, శకులు, తురుష్కులు మొదలైన వాళ్ళు వచ్చారు. ఆ తర్వాత ఆంగ్లేయులు. ఈ దేశంలో (ఆంగ్లేయులు తప్ప) స్థిరపడ్డ జాతులన్నీ ఈ సంస్కృతికి గొప్ప దోహదం చేశాయి. ఇక బౌద్ధం, జైనం, లోకాయతం, శైవం, వైష్ణవం మహమ్మదీయం, క్రైస్తవం, మరెన్నో ఆటవికజాతుల సంప్రదాయాలు ఈ దేశ సంస్కృతి పరిధిని విశాలం చేశాయి. సంస్కృత వాఙ్మయమే గాక పాళీభాష, ఇతర ప్రాకృత భాషలు, అనేక దేశభాషలు - వాటిలోని జానపద వాఙ్మయం ఈ దేశ సంస్కృతిని ప్రతిఫలిస్తున్నాయి. కాబట్టి వైదిక సంస్కృతి లేదా హిందూ సంస్కృతే భారతీయ సంస్కృతి అనటం తప్పు. ఇది సంకీర్ణ సంస్కృతి. సమ్మేళన సంస్కృతి.

చారిత్రకంగా జరిగిన ఈ సంస్కృతి పరిణామాన్ని మొదట ఆంగ్ల చరిత్రకారులు, తర్వాత భారతీయ జాతీయ వాదులు, వామపక్ష చరిత్రకారులు రకరకాలుగా విశ్లేషించారు. విశ్లేషిస్తున్నారు.

భౌతిక రంగం సంగతి ఎట్లా ఉన్నా మత, తాత్విక రంగాల్లో భారతీయుల సాధన అపారమైంది. ఈ సాధన అంతా భారతీయుల ఆధ్యాత్మికతలోకి వస్తుంది. ఈ ఆధ్యాత్మిక స్వభావం భారతీయ సంస్కృతికి మూలం అని ముందుగా పాశ్చాత్య విద్వాంసులు, ఆ తర్వాత భారతీయ విద్వాంసులు పేర్కొన్నారు. హిందూ జీవన విధానంలోని చతుర్విధ పురుషార్థాల్లో ధర్మానికి ప్రాధాన్యం ఇచ్చారు. అయితే వైదిక సంస్కృతిలో కనపడే యజ్ఞయాగాదులు మొదలు ఎన్నో అంశాల్లో భౌతిక ప్రయోజన దృష్టి స్పష్టంగా కనపడుతుంది. 'జగన్మిథ్యా, పరం సత్యమ్' అని జగద్గురువు శంకరాచార్యులు చెప్పారు. ఈ భావం భారతీయులకు ఇహ సాధనపట్ల ఒక ఉదాసీనత కల్గించింది. అయితే పరంపట్ల గాఢమైన విశ్వాసం కల్గించలేదేమో.

ఏ రంగంలోనైనా సహనం, సహజీవనం భారతీయుల జీవన విధానం, పారలౌకిక అన్వేషణతో పాటు జీవిత పరమార్థ అన్వేషణ కూడా మన ఉపనిషత్తుల్లో కనపడుతుంది. కర్మకాండకు దూరంగా జ్ఞానమార్గం అన్వేషించింది ఉపనిషత్ వేదాంతం.

ఓం సహనా భవతు సహనౌ భునక్తు
సహ వీర్యం కరవా వహై
తేజస్వినావదీతమస్తు మా విద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః (తైత్తరీయోపనిషత్తు)

(మన ఇద్దరిని అతను కాపాడు గాక! మన యిద్దరికి భుక్తి కలిగించుగాక! వీరత్వం ప్రసాదించుగాక! మన చదువు తేజస్వంతం అగును గాక! మన యిద్దరి మధ్య విద్వేషం లేకుండు గాక!)

'యుగయుగాలుగా అవిచ్ఛిన్నంగా వచ్చే సంప్రదాయాల పట్ల అభిమానమే భారతీయ సంస్కృతిలోని ప్రత్యేకత' అని ప్రముఖ చరిత్ర పరిశోధకులు బి.ఎస్.ఎల్. హనుమంతరావు మాట. ఈ అభిమానం సంప్రదాయపరుల్లో పైకే కనబడుతుంది. సంప్రదాయ వ్యతిరేకులు కూడా ఏదో ఒక ప్రత్యేక పరిస్థితిలో ఆచార వ్యవహారాల్ని పాటించటం చూస్తున్నాం. ఆర్య వివాహ విధిని ఒక తంతుగా కొట్టి పారేసేవాళ్ళు

ఎప్పుడో ఒకప్పుడు ఆ పద్ధతినే పాటించడం, దైవ భావనని తిరస్కరించేవాళ్ళు బ్రతుకుబాటలో ఎదురుదెబ్బలు తగిలేటప్పుడల్లా దేవాలయాలను దర్శించటం - ఇవి ఆ వ్యక్తులమీద సంప్రదాయం పట్టును సూచిస్తాయి. కాకపోతే మార్క్స్ - లెనిన్ - మావో ఆలోచనా విధానంలో తలమునకలైన ప్రజా గాయకుడు గద్దర్ ఏ ప్రయోజనం కోసమైన భద్రాద్రి సీతమ్మని దర్శించటం ఎట్లా అర్థం చేసుకోగలం? అంటే మార్క్సుకి మాధవుడికి సయోధ్య కుదర్చగల శక్తి మన సంప్రదాయాని కుందన్నమాట. భౌతికవాది అయిన బుద్ధుడినే అవతారంగా మార్చగలిగిన శక్తి అది! ఇక్కడ గమనించాల్సిన సంగతి ఒకటి వుంది.

ఒక సంప్రదాయం యొక్క బలం దాని గొప్పతనాన్ని నిరూపించలేరు. ఏ విశేషం లేని మామూలు తంతులు కూడా ప్రజల మనోభావాల మీద ఎంతో పట్టు కలిగి వుండొచ్చు. కనుక అవన్నీ నిజంగా మేలైనవని చెప్పలేం. కనపడ్డ విగ్రహాల కల్లా మొక్కటం ఈ దేశ మంతటా ఉన్న ఆచారమే. అది మన (మత) సంస్కృతిలో ఉన్న గొప్పతనంగా ఎలా చెప్పగలం? 'చిల్లర రాళ్లకు మొక్కుతువుంటే చెడిపోదువురా ఒరే ఒరే' అంటున్నాడు ఒకవైపు ఒక సాధువు.

భారతీయ సంస్కృతికి బౌద్ధం చేసిన దోహదం అపారం. బౌద్ధాన్ని అన్ని మతాలకు మల్లే ఒక మతంగా గుర్తించటం సరైంది కాదు. మతంలో ప్రధానంగా పరతత్వ అన్వేషణే ఉంటుంది. అది భౌతికత్వం గాక, ఆధ్యాత్మికత్వం మతంలో ముఖ్యం. బౌద్ధం అటువంటిది కాదు. దానికి అది భౌతికమే. ఇహలోక జీవనమే అసలు ప్రమేయం. పరలోకంతో దానికి పని లేదు. పూజా పురస్కారాల అవసరం లేదు. దైవతత్వం గురించి అది ఉపన్యసించదు, మానవ తత్వాన్నే పరిశీలిస్తుంది. కాబట్టి అది ఒక మతం కాదు. బౌద్ధం ఒక జీవన విధానం.

మతాలన్నీ ఒక విశ్వాసం మీద ఆధారపడి, అభివృద్ధి చెందాయి. దైవం ఒక విశ్వాసం. పరలోకం ఒక విశ్వాసం. అయితే బౌద్ధం విశ్వాసం మీద గాక వాస్తవం మీద ఆధారపడింది. దీన్ని ఒక మతంగా, బుద్ధుడిని దేవుడుగా రూపకల్పన చేసినప్పుడే దాని ప్రాధాన్యం తగ్గిపోయింది. అది హిందూ మత నైతిక తత్వానికి పుట్టిన బిడ్డగా, హిందూ మతంలోనే ఒక సంస్కరణగా సర్వేపల్లి రాధాకృష్ణన్ వర్ణించారు. ఇంతకన్న వక్ర వ్యాఖ్యానం మరొకటి వుండదు. హిందూ మత విశ్వాసాలకి మౌలికంగా భిన్నమైంది, స్థూలంగా వ్యతిరేకమైంది బౌద్ధం.

**కళాకారుల దారి :**

సంస్కృతిని సరిగ్గా అర్థం చేసుకోకపోతే, కళాకారుడి ఆలోచన పక్కదారి పడితే వక్ర వ్యాఖ్యానాలు వెలువడతాయి. ప్రముఖ భారతీయ చిత్రకారుడు ఎం.ఎఫ్. హుస్సేన్ ఇందుకు ఆధునిక ఉదాహరణ. కొంతకాలం కిందట అతను దుర్గాదేవి, ద్రౌపది, సరస్వతుల మూర్తుల్ని తన ప్రత్యేక శైలిలో నగ్నంగా చిత్రించాడు. అది దేశవ్యాప్తంగా పెద్ద గొడవ రేపింది. హిందూమత వాదులు తమ దేవతా మూర్తుల్ని అవమానించినందుకు తమ మనోభావాల్ని గాయపరిచినందుకు కోపగించారు. అతని ఆర్ట్ గాలరీని ధ్వంసం చేశారు. చాలామందికి నైతిక పార్శ్వం నుంచి చూసినప్పుడు హుస్సేన్ చేసిన పని అశ్లీలంగా తోచింది. దీనికి వ్యతిరేకంగా హిందూ దేవతా మూర్తుల్లో, కీర్తనల్లో అశ్లీలం లేదా? అని కొంతమంది ఎదురు ప్రశ్న వేసి ఆ చిత్రకారుణ్ణి సమర్థించే ప్రయత్నం చేశారు. ఈ సంఘటనని మైనారిటీల (హక్కుల) మీద జరుగుతున్న హిందూత్వ దౌర్జన్యంగా కొంతమంది భావించారు.

ప్రజాస్వామ్య దృక్పథం గల మేధావులు చాలమంది ఈ సందర్భంలో కళాకారుల భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ గురించి గొంతు విప్పారు. కళాకారుడు ఏ భావాన్ని అయినా స్వేచ్ఛగా చెప్పవచ్చు గదా? అసలు స్వేచ్ఛ అంటే ఏమిటి? అసలైన జీవితావసరాల్ని గుర్తించి, దాన్ని సాధించే ప్రయత్నంలోనే స్వేచ్ఛ అనే పదం సార్థకత పొందుతుంది. అర్థరహితమైన కోరికల వ్యక్తీకరణ స్వేచ్ఛ కాబోదు. ఈ చూపుతో చూస్తే ఏ పరమార్థం కోసం సరస్వతి, పార్వతి, ద్రౌపది నగ్నం చెయ్యబడ్డారు? అందులో ఇమిడి వున్న కళాకారుడి ఉద్దేశ్యం ఏమిటి? విశృంఖల లైంగికాలోచన తప్ప ఆ అభివ్యక్తిలో ఏముంది? ఎంతో విశాలత, ఉదారత గల హిందూ మతానికి సంబంధించిన వ్యక్తుల్ని నువ్వు మొండి మొలలలో చూపించగలిగావు గాని అదే వేరే మతాలకు చెందిన వ్యక్తుల్ని అటువంటి బొమ్మలుగా గియ్యగలవా? అన్నది ఒక మామూలు ప్రశ్న.

అంతకుమించి ఇంకో వైపునుంచి ఎం.ఎఫ్. హుస్సేన్ సరస్వతిని నగ్నం చెయ్యటం ద్వారా ఈ దేశంలో కోట్లమంది పిల్లలు 'తల్లీ! నిన్ను దలంచి...' 'సరస్వతీ నమస్తుభ్యం...' అంటూ చదువు మొదట్లో ప్రార్థించే భారతీయ జ్ఞాన స్వరూపాన్ని అవమానించినట్లు అర్థమవుతుంది. భారతంలో అష్టకష్టాలు పడుతూ భర్తల్ని వదలకుండా సేవించిన స్త్రీ ద్రౌపది. సహనశీలి, అభిమానవతి, కీచకుడి ఇంటికి కల్లు తేవడానికి వెళ్తున్న సైరంధ్రి మూర్తి – రాజా రవివర్మ చిత్రం – మనలో భావోద్వేగాన్ని, సానుభూతిని కలిగిస్తుంది. ఎం.ఎఫ్. హుస్సేన్ జూదం బల్లమీద

ద్రౌపది పిరుదుల్ని చూపించటం ద్వారా భారతీయ స్త్రీత్వాన్ని అవమానించినట్టు అర్థమవుతుంది, కనుక కళాకారుడి స్వేచ్ఛని ఎట్లా అర్థం చేసుకోవాలి?

'ఏమన్నావ్ నువ్వయినా
స్వేచ్ఛో స్వేచ్ఛ అన్నావు
దానికే విలువలు చివరికి వలువలు కూడా
అడ్డం రాగూడదన్నావు
జీవితమర్మాల్ని గాక కాసేపు చర్మాల్ని చూడాలన్నావు
ఏం జేశావ్ నువ్వయినా
ముఖాల్ని అస్పష్టం చేసి అవయవాల్ని స్పష్టం చేశావు
స్త్రీమూర్తుల్ని ప్రదర్శన కోసం దిగంబరం చేశావు
జూద సభలో ద్రౌపదికి రెండోసారి వలువలూడ్చావు
అందరూ నీ నీలి చిత్రాలవైపు వేలు చూపిస్తే
నువ్వు పురాణ కల్పనలవైపు ఖజోరహెూ శిల్పాలవైపు
వేలు చూపించావు
రంగు ముదిరి కుంచె తలకు చుట్టుకున్నావు
ఎవరు మాత్రం ఏం జేస్తారు
ఏ స్వేచ్ఛ ఏ సాధన కోసమని అడుగుతారు
నీ స్వేచ్ఛ యోని దగ్గర మొదలై
మానవత్వం దగ్గర అంతమైందని గుర్తిస్తారు.
నీ కళ మిలియనీర్ల పడగ్గది గోడలకి
బానిస వినయంతో వేలాడుతున్నందుకు విచారిస్తారు
నువ్వు స్త్రీత్వాన్ని అవమానించటమే
అమ్మకం సరుకు చెయ్యటమే అసలు సంగతి
ఎవరైనా ఏం జేస్తారు
నీలి బొమ్మలు చూసి కొందరు తలలు భగ్నం జేస్తారు
ఉద్రేకులు మరికొందరు వాటిని భగ్నం చేస్తారు'

కళలు మానవ సామరస్యాన్ని, సహజీవన సౌందర్యాన్ని కోరుకుంటాయి. ఈ మాటకి జగమెరిగిన సన్నాయి విద్వాంసుడు బిస్మిల్లాఖాన్ కన్న గొప్ప ఉదాహరణ లేదు.

తరతరాల నుంచి భిస్మిల్లాఖాన్ కుటుంబం కాశీ విశ్వేశ్వరాలయంలో జరిగే ఉత్సవాల్లో తమ సంగీతం విన్పిస్తున్నారు. అంతర్జాతీయ ఖ్యాతిగన్న ఆ విద్వాంసుడిని విదేశాల్లో స్థిరపడవచ్చుగదా అని అక్కడి వాళ్ళు అడిగితే 'మా గంగానదిని కూడా అక్కడికి తీసుకురాగలిగితే అట్లాగే' నన్నాడు బిస్మిల్లాఖాన్. హిందూ – ముస్లిం సమైక్యానికి ఇంతకన్న మేలైన దృష్టాంతం చూపించగలమా?

'భగవద్గీత పఠించలేదు
బహుశ ఖురానూ కంఠస్థం చెయ్యలేదు
కానీ అతను ఒకానొక మహా శివరాత్రి
కాశీ విశ్వేశ్వరాలయంపైన నెలవంకను తగిలించాడు'

**వందేమాతర వివాదం:**

కాలం మారుతున్నప్పుడు సాంస్కృతిక వారసత్వానికి కొత్త కొత్త సవాళ్ళు ఎదురవుతాయి. వాటిని మూల సందర్భం నుంచి అర్థం చేసుకొన్నప్పుడు మాత్రమే అక్కడ చిక్కుముళ్లు విడిపోతాయి. జాతి స్వేచ్ఛతో ముడివడి వున్న 'వందేమాతరమ్' గేయానికి వందేళ్లు నిండిన సందర్భంలో సెప్టెంబరు 7వ తేదీనాడు దేశవ్యాప్తంగా ఆ గేయాలాపన జరపాలని కేంద్ర ప్రభుత్వం ఆదేశాలు ఇచ్చింది. అయితే ముస్లిం మతానుయాయులైన కొంతమంది దీనికి అడ్డు చెప్పారు. ఆ గేయంలో దైవ ప్రార్థన వుందని, దాన్ని ఆలపించటం అంటే అన్యమత ప్రార్థన కిందికి వస్తుందని, అది తమ మత భావనకు వ్యతిరేకమైందని ఆ అభ్యంతర సారాంశం. ఒక విధంగా చూస్తే ఇందులో కొంత హేతుబద్ధత ఉంది. తమ మత విశ్వాసాలకు భిన్నంగా మరొక పద్ధతి పాటించమని ఎవరైనా – చివరికి రాజ్యమైనా ఆదేశించటం సమంజసం కాదు. అయితే 'వందేమాతరమ్' మూలం ఏమిటి?

బంకించంద్ర ఛటర్జీ బెంగాలీలో రచించిన 'ఆనందమఠం' నవలలో ఈ గేయం రచించబడింది. ఆ నవల 'వంగదర్శన్' పత్రికలో ముందుగా ధారావాహికగా వచ్చిన తర్వాత 1882లో పుస్తక రూపం దాల్చింది. ఆ నవలలోని కథలో అసమర్ధ తురుష్క పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన 'సంతానుల' తిరుగుబాటును సమర్థిస్తూ 'సత్యానందుడు' అనే సన్యాసి ఈ గేయం పాడతాడు. అయితే నిజానికి ఈ గేయాన్ని నవలకు ముందే 1975-76 సంవత్సరాల్లోనే బంకించంద్రుడు రాశాడు. తదనంతరం కాంగ్రెస్ సమావేశాల్లో దాన్ని పాడే కాలంలో తర్వాత చరణాల్లో దుర్గామాత స్తుతి ఉండటం వల్ల వాటిని వదిలేసినట్టు తెలుస్తుంది.

1885లో భారతీయుల ఆకాంక్షలకు ప్రతిరూపంగా జాతీయ కాంగ్రెసు స్థాపన జరిగింది. 1896లో జరిగిన కాంగ్రెసు సమావేశంలో రవీంద్రనాథ ఠాకూరు ఈ గేయం ఆలపించాడు. 'దేశమాత' అనే భావనను కల్పించిన ఆ గేయం సహజంగానే ఆనాటి దేశభక్తుల్ని ఉత్తేజపరిచి వుండాలి. 1905లో లార్డు కర్జను బెంగాలు విభజనకు వ్యతిరేకంగా ముందుగా బెంగాల్లో, తర్వాత దేశవ్యాప్తంగా గొప్ప ఉద్యమం చెలరేగింది. అది స్వదేశ, విదేశవస్తు బహిష్కరణోద్యమాలతో చేయి కలిపి అనతి కాలంలోనే గాఢమైంది; విస్తృతమైంది, ఆ క్రమంలోనే ప్రతి దేశభక్తుడికి 'వందేమాతరమ్' ఒక గొప్ప చైతన్య నినాదమైంది. ఈ నినాదం పెదాలపై ఆడుతుండగా అమరవీరులు ధీరోదాత్తంగా ఉరికంబాలను కౌగిలించుకొన్నారు. బహిరంగ సభల్లో ఈ గేయాలాపనను ఆంగ్ల ప్రభుత్వం నిషేధించింది. అయినా అది ఆగని ప్రభంజనమే అయింది. సహాయనిరాకరణోద్యమంలోను ఈ గేయం గొప్ప స్ఫూర్తినిచ్చింది. 1937లో కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో 'వందేమాతరం' జాతీయ గీతంగా ఆమోదించబడింది.. గీతాలాపన రెండు చరణాలకే పరిమితమైంది. తదనంతర చరణాల్లోని హిందూ దేవగణ ప్రసక్తి వల్ల లౌకిక (సెక్యులర్) స్వభావం గల స్వతంత్ర దేశానికి జాతీయ గీతంగా అది పనికిరాదని కొందరు వాదించారు. ఆ విధంగా అది వివాదాస్పదమైంది. గాన సౌలభ్యం వల్లనో, కొంతవరకు వేర్పాటు వాద ధోరణుల్ని బుజ్జగించటానికో రవీంద్రనాథ ఠాకూరు రాసిన 'జనగణమన' జాతీయ గీతమైంది. అయినా 'వందేమాతరాని'కున్న ఉజ్జ్వలత, చారిత్రకత (హిస్టారిక్ నేచర్) 'జనగణమన'కు లేనేలేదు. (అది పంచమ జార్జి చక్రవర్తి భారతదేశం రాక సందర్భంగా రాసిన గీతమనే వివాదమూ ఉంది).

ఇంతకీ ఈ వివాదాస్పద గేయంలో ఉన్నదేమిటి? "తల్లికి వందనం, వందనం. శుభ్రజలాలు కలిగిన, మధుర ఫలాలు కలిగిన, మలయ పర్వతంపై నుంచి వీచే గాలులచే చల్లనైన, ఆకుపచ్చని పంటచేలు గల తల్లికి వందనం. అచ్చమైన వెన్నెలలో పులకించిన రాత్రులు గల, వికసిత పుష్పాలు గల చెట్లతో విలసిల్లుతున్న, చల్లని నవ్వుల, తియ్యని మాటల, సుఖాలనిచ్చే వరాలనిచ్చే తల్లికి వందనం".

ఈ రెండు చరణాల్లో ఏ దేవతామూర్తి లేదు. ఉన్నదల్లా దేశమూర్తి మాత్రమే. దానికి చెందిన అందమైన కాల్పనిక భావన మాత్రమే. ఆమెకు నమస్కరించినంత మాత్రాన ఏ మత భావనకు దెబ్బతగిలే అవకాశం లేదు.

జాతీయోద్యమం భారతీయసంస్కృతికి కొత్త సారం ఇచ్చింది. కొత్త భాష్యం చెప్పింది. మత భావనను విశాలం చేసింది. మహాత్మాగాంధీ 'ఈశ్వర్ అల్లా తేరే నామ్' అని ఈ సందర్భంలోనే కదా అన్నది? ఈ సందర్భంలోనే గదా సత్యాహింసలకు ప్రాధాన్యం వచ్చింది? ఈ సందర్భంలోనే గదా జవహర్‌లాల్ నెహ్రూ తన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో భారతీయాత్మను దర్శించటానికి ప్రయత్నించింది? అదే విధంగా బంకించంద్ర ఛటర్జీ కూడా హిందూమత భావనను విశాలం చేసి దేశభావనతో సమ్మిళితం చేశాడు.

ప్రపంచంలోని ఏ జాతి గీతమైనా దాని స్థానిక సంప్రదాయం నుంచి, స్థలకాల సందర్భం నుంచి ఉద్భవించేదే. ఏ సాంస్కృతిక వారసత్వమైనా అంతో యింతో మత, ఆధ్యాత్మిక స్పర్శ లేకుండా ఉండదు. అందులోని స్ఫూర్తిని గుర్తించటమే ముఖ్యం. ఒక అంశాన్ని అప్పటి సందర్భం నుంచి విడదీసి మరొక సందర్భంలో చొప్పించి చూసినప్పుడు విపరీత వ్యాఖ్యానాలకు అవకాశం ఉంటుంది. మొత్తంమీద వందేమాతరం గీతం ఈ జాతి సంస్కృతిలో చరిత్రాత్మకమైన, అపరిహార్యమైన ఒక భాగమని, దానిని పాడినంత మాత్రాన ఏ మతాల లౌకిక భావన దెబ్బతినదని చెప్పడమే నా ఉద్దేశం.

కళాకారులు సహజంగా ఒక ప్రత్యేక స్వభావాన్ని, ఊహాలోకాన్ని, భావోద్రేకాన్ని, కాలోద్రేకాన్ని (మూడ్) కలిగి వుంటారు. కనుక వాళ్ల పనుల్లో కొన్ని అతిచర్యలు ఉంటాయి. వాటిని సహనంగా అర్థం చేసుకోవటం అవసరం. అవి మంచివైనా, చెడ్డగా తోచినా వాళ్లమీద భౌతికంగా దాడులకు పూనుకోవటం సమంజసం కాదు. కెన్ సారో వివా కావచ్చు. సాల్మన్ రష్దీ కావచ్చు. డెన్మార్క్ చిత్రకారుడు కావచ్చు. ఎం.ఎఫ్. హుస్సేన్ కావచ్చు. తస్లీమా నస్రీన్ కావచ్చు. ఏ కళాకారుడికీ ఏ స్వేచ్ఛ ఉన్నా లేకున్నా జీవించే స్వేచ్ఛ మాత్రం ఉంది. భౌతిక నిర్మూలనతో భావ నిర్మూలన సాధ్యం కాదు. భావజాలాన్ని భావజాలంతోనే ఎదుర్కోవటం మంచిది. సత్యాసత్యాలు కాలక్రమంలో తేలతాయి.

**(నిశాంత గ్రంథం నుండి...)**



# 11. కళ - మార్కెట్ - సంస్కృతి

- దేవి (సాంస్కృతిక కార్యకర్త, హైదరాబాద్)

మార్కెటీకరణ అవుతున్న సమాజంలో ప్రత్యామ్నాయ ఆర్ధిక తత్వాన్ని కూడా సామాజిక సంస్కృతే యివాళ పరోక్షంగా నయినా తన సహేతుక సాంస్కృతిక జోక్యం ద్వారా ప్రతిపాదించగలుగుతుంది. ప్రజల అభిరుచులు, ఆకాంక్షలు, ఆశలు, ఆర్ధిక లక్ష్యాలు మార్కెట్ కోరికలు లేదా మార్కెట్ కృత్రిమంగా సృష్టించిన అవసరాలకంటే భిన్నంగా వున్నాయనీ, మార్కెట్ తయారుచేసి గుమ్మరిస్తున్న కృత్రిమ అవసరాలు, వస్తువులు నిజానికి సామాన్యుల పురోగతికి ఆటంకంగా మారాయని సహేతుకంగా ప్రశ్నిస్తున్నది సామాజిక సంస్కృతే.

మార్కెట్ ప్రయోజనాలకు ఉపయోగపడనందు వలన లేదా ఆటంకంగా మారి నందువలన పక్కకు నెట్టి వేయబడుతున్న విలువలు, అస్తిత్వాలు ప్రత్యేక జీవిత కోణాలు దృక్పథాలు ఏవైతే ఉన్నాయో వాటన్నింటి రక్షణ కోసం నిలబడుతున్నది సామాజిక సంస్కృతే. ఆర్ధిక ప్రయోజనాల పరిధిలోకి లేదా అభివృద్ధిగా పేర్కొంటున్న దానికి చెందనవి ఏవైతే నిజంగా విలువైనవి సుసంపన్నమైనవి వున్నాయో వాటిని కాపాడుతున్నదీ ఈ సామాజిక సంస్కృతే.

ఈ సందర్భంలో సామాజిక సంస్కృతి అంటే అభివ్యక్తీకరణకు సంబంధించినదిగా అర్థం చేసుకోవాలి. ఈ అభివ్యక్తీకరణ రకరకాల రూపాల్లో ఉండవచ్చు. వ్యాసాలు, కథలు, నవలలు కవితలు ఇతర రచనా ప్రక్రియలు, టివి కార్యక్రమాలు, వార్తలు, సినిమాలు, నాటకాలు, పాటలు, జానపదాలు, ఉపన్యాసాలు, నృత్యాలు వగైరాలు అనేక రకాల ప్రత్యామ్నాయాన్ని ప్రస్తావించే వాటన్నింటినీ అని అర్థం చేసుకోవాలి. వీటిలో పండుగలు, ఉత్సవాలు, సమావేశాలు, ఆహారం చివరికి రోజువారీ దుస్తులు కూడా ఈ ప్రత్యామ్నాయ అభివ్యక్తీకరణలో భాగం అవుతాయి. అవి కూడా ఈ సామాజిక సంస్కృతే.

ఇది కేవలం ఒక అభివ్యక్తీకరణే కాదు, అర్థవంతమైన సామాజిక జీవితాన్ని నిర్మించడం కోసం ప్రయత్నం కూడా. కాబట్టి దీనిని సామాజిక సంస్కృతిగా ప్రస్తావిద్దాం. సామాజిక జీవితపు అర్ధవంతమైన అలవాట్ల లక్షణాలు ఈ సామాజిక

సంస్కృతి ద్వారా వ్యక్తం అవ్వడం అంటే అది సమాజం రూపొందించే వస్తువులు రూపాల ద్వారా కూడా కనబడుతుంది. కనుకనే వినిమయ సంస్కృతి ఆధిపత్యంతో సరుకుగా మారిపోతున్న జీవనశైలిని విమర్శించేదిగా, దాని ప్రయోజనాన్ని మలిచేదిగా సామాజిక సంస్కృతి ఉంటున్నది.

మార్కెట్ శక్తులకూ సామాజిక సంస్కృతికి మధ్య నిరంతరాయంగా వైషమ్యం కొనసాగుతూనే వుంటుంది. సంస్కృతిని తారుమారుచేసి మార్చేసి దానిని ఆర్థిక ఆధిపత్యానికీ ఒక వాహకంగా తయారుచేయటం మార్కెట్ శక్తులకు ఒక తప్పనిసరి అవసరం. కాని భౌతిక ప్రయోజనాలకు వ్యతిరేకంగా "సత్యాన్ని" పైచేయిగా వుంచడమే సామాజిక సంస్కృతి. ఒకవైపున ఆధిపత్య ఫ్యూడల్ సంస్కృతిని మేధావులకు పరిమితం అయిన అభివ్యక్తీకరణలనూ దాటి ప్రజలందరికీ చేరే ప్రజాబాహుళ్య సంస్కృతికి పునాది ఏర్పరుస్తున్నట్టుగా ఈ మార్కెట్ సంస్కృతి కనబడుతుంది. "మీడియా" సాంకేతిక విస్ఫోటనం ద్వారా ఇది చాలా తేలికయ్యింది. ఒక అర్థవంతమైన సామాజిక జీవనానికి ప్రతీకలయిన వనరుల్ని ఇది సమకూరుస్తున్నట్టుగా వుంటుంది. ఉదా: అత్తాకోడళ్ళు ప్రోత్సహించుకుంటూ పాల్గొనే టీవీలు లేదా భార్యల సామర్థ్యాన్ని ఏదో ఒక ఆటలోనయినా ప్రోత్సహిస్తున్నట్టు కనబడే భర్తలు. కాని ఈ రకం ఆటలు వాస్తవంలో ఏ ఫలితాన్ని యివ్వని కార్యక్రమాల ద్వారా మార్కెటు తనదైన ఒక హేతుబద్ధతనూ సామాజిక ఆలోచనా శైలిని ప్రవేశపెడుతున్నది. "వ్యక్తి" సామర్థ్యం వ్యక్తి ఆనందం కేంద్రంగా వినిమయదారులుగా మార్కెట్ సరుకులను తమదయిన "స్వంత" పద్ధతిలో ఉపయోగించుకునే తెలివైన వారుగా వారిని యివి తీర్చిదిద్దుతున్నాయి. వారి ఆనందానికి, కన్నీళ్ళకు చాలా పైపైన కారణాల్ని పరిష్కారాల్ని నేర్పిస్తున్నాయి.

మార్కెట్ తన ప్రయోజనాలు ఖచ్చితంగా నెరవేర్చుకోవడానికి పూర్తిగా శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం శాస్త్రీయ ప్రక్రియల్లో విశ్లేషకులపై ఆధారపడుతుంది. ఆ విశ్లేషకుల ద్వారా తన లాభార్జనకు పూర్తి అశాస్త్రీయమైన, అహేతుకాంశాల్ని ఎంచుకోవడానికి ఎంతమాత్రం వెనుకాడదు. దయ్యాల సినిమాలు ప్రార్థనా స్థలాల వ్యాపారీకరణ దీనికి మంచి వుదాహరణ. సంస్కృతిని ప్రక్కకు తొలగించాలని "మార్కెట్"ను సంస్కృతిగా చేసే పనిలో మార్కెట్ వుంది. చివరికి సమాజం అంతా

మార్కెట్ సంబంధాలుగా మారిపోతుండటంతో ఆ సమాజపు "సంస్కృతి"ని బట్టి దాని నైతిక స్థాయిని ఒక కొలమానంగా చూడాల్సి వస్తున్నది.

అసలు సామాజిక సంస్కృతి అనే పదం "మార్కెట్" దురాక్రమణతోనే, పుట్టుకొచ్చిందనాలి. ఆర్థిక విలువల అర్థం... వినిమయ తత్వం, ప్రత్యేక హక్కులు, మానవ విలువల తేడాలను ప్రశ్నించడం దాని లక్ష్యం. మార్కెట్ చక్రాలు ధ్వంసం చేసుకుంటూ పోతున్న మానవ విలువలు, సంబంధాలు, సత్యాలు, వాస్తవికతలు, సృజనాత్మక అభివ్యక్తీకరణలు, అసంఖ్యాకమైన వైవిధ్యాల మనుగడ, కళల స్వేచ్ఛ స్వచ్ఛత, ఆలోచనల భిన్నత్వం స్వతంత్రతల పరిరక్షణ సాంకేతిక ఆధిపత్య రూపాలకూ ప్రతిఘటన.

అయితే సంస్కృతి అనే పదాన్ని ఒక దృక్పథం మార్కెటీకరణ నిరోధానికి వాడుతుంటే మరో దృక్పథం దాన్ని సనాతన సాంప్రదాయాలు, కాలాలుగా కొనసాగుతున్న అంతరాలు పోకుండా రక్షించడం అనే కోణంలో, వాడి ప్రజల్ని రెచ్చగొట్టడంలో జయప్రదం అవుతున్నది. ఈ రెండో తరహా అఖండమైన అద్వితీయ ఏకశిలా సదృశ్యమయిన భారతీయ సంస్కృతి దాని రక్షకులు ప్రతి వెనుకబడిన భావాన్ని, సెంటిమెంటునూ ఉపయోగించుకుంటున్న వ్యాపారీకరణ పట్ల ఎంతమాత్రం వ్యతిరేకత చూపడంలేదు. వ్యాపారీకరణ వలన ఛిద్రం అవుతున్న మానవ సంబంధాలు, పని ప్రదేశాలు పీకలుకోసే పోటీ తత్వంతో ఉండి అనిశ్చితత్వ ఉద్యోగ అభద్రతకు తోడు ఏదీ తన చేతిలో లేదనే నిస్సహాయ భావనను మనిషికి కలిగిస్తున్నాయి. మార్కెటీకరణ ద్వారా లభించిన వ్యక్తిగతవాదం, స్వీయాత్మక ధోరణి, స్వార్థం, సౌకర్యాలు ఎంతమాత్రం వదులుకోవడానికి సిద్ధం కాకుండా అహేతుకంగా భక్తి, క్రతువులు, మూర్ఖత్వం, పెత్తందారీ ధోరణి వంటివి తిరిగి ఆచరిస్తున్నారు. కాని గత సమాజపు అవసరాల్ని పరిమితం చేసుకోవడం, నిరాడంబరత సామాజిక ప్రయోజనానికి లొంగి వుండటం ఇతరులకు సహాయం చేయటం, పట్టించుకోవడం వంటి వాటిని వదిలి అపరిమిత వస్తు వినిమయం, యాంత్రీకరణ, ఎంతమాత్రం స్పందించకుండా మొద్దుబారడం వంటి నేటి వ్యాపారీకరణ విలువల్నే స్వీకరిస్తున్నాం. అంటే గతం నుండి ఏ విలువల్ని కొనసాగించాలో వాటిని వదిలేసి ముందుకు

సాగడానికి అడ్డంపడే వాటిని, వదిలేయవల్సిన వాటిని భుజాన్నేసుకుని సాగుతున్నామన్నమాట. ఈ లక్షణం మనకు వ్యాపార ప్రకటనల్లో మధ్య తరగతిలో చాలా స్పష్టంగా కనబడుతుంది.

సామాజిక సంస్కృతి అంటే గతకాలపు మనుషుల మధ్య గల అనుబంధాలు వంటి వాటిని కొనసాగిస్తూనే స్త్రీలు పిల్లలు ఇతర నిస్సహాయ తరగతుల హక్కుల్ని గౌరవించడం. సాహిత్యం కళలు ఈనాడు పైపైన ఏదో ఒక దాన్ని చిలకపలుకుల్లా వల్లించడమో, భజించడమో చేస్తున్నాయి. దీనికి ఒక కారణం సృజనాత్మకత వ్యాపారీకరించబడటమే కాదు కళాకారుడు, రచయిత జీవితంలో నిరంతర వాగ్వివాదం జరిపే అభినివేశాన్ని కోల్పోవడం. సృజన అమ్ముడుపోవడం ఒక్కటే మార్కెటీకరణ కాదు. అమ్ముడుపోవడానికి యిష్టపడని సృజన వృత్తికారుల్ని గందరగోళంలో పడేసి వారిని స్తబ్దులుగా చేయుటం కూడా. సృజనను వినిమయతత్వానికి అంకితం చేసిన సృజనశీలుర ధనకీర్తి ప్రతిష్టల విజయగాథలు అమ్ముడుకు సిద్ధం కాని కళాకారులను ఆత్మన్యూనతలోకి నిస్సహాయతలోకి నెట్టివేస్తాయి. కాబట్టే సామాజిక సంస్కృతి అంటే సృజనకారులు లాభనష్టాల రూపాయల లెక్కల్లో సంబంధం లేకుండా తనంతట తానుగా సృష్టించదలచుకున్న దాన్ని సృష్టించే స్వతంత్రత కలిగి వుండాలి. అంటే ఒక మార్కెట్ మాస్ విధానం బతకాలంటే తప్పనిసరిగా మంద సాంస్కృతిక పరిశ్రమ ఉండితీరాలి. ఈ విధంగా మార్కెట్ చౌర్యం కలిసిన దుష్టశక్తులు సాంస్కృతిక ఉత్పత్తుల ప్రమాణాలు – ఒక దిగజారిన సంస్కృతిని ఉత్పత్తి చేస్తాయి. డబ్బుంటే ఏదయినా కొనుక్కోవచ్చు కాబట్టి ఏదయినా అమ్ముకోవచ్చనేది సామాజిక సాంస్కృతిక రంగాల్ని ఏలుతున్న మార్కెట్ శక్తుల సూత్రం.

కళారంగం రాజసభల నుండి నగరాలకూ పోషకుల నుండి బజారు / మార్కెట్టుకు పూర్తిగా కాకున్నా మారిందనేది గుర్తించాలి అంటారు జాన్ బ్రెవైర్ (1997) తన అధ్యయనంలో. సభల పరిమితుల నుండి వ్యాపారాధికం అది విశాల ప్రజానీకపు సొత్తుగా మారింది. ఈ ప్రక్రియ అంతటిలో సాంస్కృతిక కళాశ్రామికులు ప్రజలకు కళలతో సంబంధాన్ని బాగా పెంచారు. పుస్తకాలు, నాటకాలు, నృత్యాలు, సంగీతం, ఒకటేమిటి అన్నింటి అమ్మకాలు పెరిగాయి. వాటి ప్రదర్శనా స్థలాలు

పెరిగాయి. కళారంగం నేటి వ్యాపార సమాజాన్ని నిర్వచించే ఒక లక్షణం అయ్యింది. వ్యాపారం, సంస్కృతి రెండూ పెనవేసుకుసాగడం వలన కళలు, అభిరుచి, నాగరికతలలో ప్రమాణాలు పెరిగి వీటి వలన ఒక నాగరికతా క్రమం వేగం పుంజుకుందని కొందరు అభిప్రాయపడుతున్నారు.

వీరేకాక నిక్కచ్చి మార్కెట్ సానుకూలవాదులు కూడా కళాత్మకతకూ – వ్యాపారాత్మకతకూ, రసానుభూతికి – కోర్కెల సంతృప్తికీ మధ్య చాలా తేడా ఉందని అంగీకరించక తప్పదు. కాని హేతుబద్ధత, ఉపయోగికత లేని విషయాలు ప్రజలను ప్రభావితం చేస్తున్నాయి. కనుక అవి ఆనందాన్నిస్తున్నాయనే వాదన ప్రారంభించారు. మార్కెట్‌లో భాగమవుతున్న ఒక కొత్త రకం కళాకారులకు ఇది నచ్చుతుంది. డబ్బు గడించడమే హేతుబద్ధతగా, కళ పేర ఉత్పత్తి అవుతున్న అర్ధరహిత, సారవిహీన వినోదాన్ని చాలామంది చూడటమే దాని వినియోగితగా మార్చారు.

ఈ విధంగా మార్కెట్ ఎవరి డబ్బు చెల్లించే శక్తిని బట్టి వారికి సంస్కృతిని తయారు చేయించి అమ్ముతూ వుంటుంది. “బ్రాడ్వే” నాటకాలు బిలియనీర్లకూ, హాలీవుడ్ ఐమాక్స్ మధ్యతరగతికీ మిగిలివన్నీ “మూక”లకు. అయితే అత్యధిక ఆదాయం చిన్న మొత్తాల్లోనే అయినా ఈ మూక నుండే లభిస్తుంది మార్కెట్‌కు. దానికవసరం అయిన సృజనకారులు కూడా చవకగా లభిస్తారు. వారిని పిప్పిలా పిండేసుకుని బయట పారేసినా మార్కెట్‌కు పుంఖాను పుంఖాలుగా కొత్తవాళ్ళు దొరుకుతూనే ఉంటారు.

కళకు ప్రయోజనం ఉండటం రసానుభూతికి కళాసృజనకూ వ్యతిరేకంగా, నిరర్ధక కళనే అసలు సిసలయిన స్వచ్ఛ కళాత్మకతగా చూపి రెండింటినీ ఏకకాలంలో ఆమోదింపచేయటం, అమ్మకపు మార్కెట్‌లోని నైపుణ్యం. ఇది ఒక వైషమ్యాన్ని ఒక ఏకత్వాన్ని ఏకకాలంలో ప్రదర్శించే సంబంధం. సాంస్కృతిక చలనపు ప్రత్యేక హేతుబద్ధత. ప్రస్తుతం సంస్కృతి యాంత్రీకరణ, వ్యాపారీకరణ ఏకకాలంలో జరుగుతుంటాయి. కళాత్మకమైన ప్రత్యేక వస్తువులు, సృజనకారుల విశిష్టత రెండూ మార్కెట్‌తో వైషమ్యం కలిగి వుంటాయి. వీరి ప్రత్యేకతల్ని మార్కెట్ నుండి కాపాడాలి. కాపాడాలంటే ప్రజలకీ కళకీ మధ్య వాహకంగా వుండే మార్కెట్ శక్తి ఏంకావాలి.

కళాకారుడికి కళ అమ్ముకోకపోతే మనుగడ ఎట్లా? దీనికి జవాబు స్థానిక సంస్కృతుల్లోనే వెతకాలి. యివన్నీ వాస్తవంలో లభ్యమయితే వాటిని తృప్తిపరిచే కళ తన కళను అమ్ముకోగల స్థానిక ప్రేక్షకుల్ని కూడా సృష్టించుకోగలదు.

ఇపుడు కళాకారుడు జనాదరణ పొందుతున్నట్లు కనబడుతున్న కళా సారంతోనూ ఆ అభిరుచిని ప్రదర్శించే మూకలతోనూ కూడా ఘర్షణ పడాలి. వ్యాపారాత్మకం అయిన వాటినే కాదు గతంలో గౌరవప్రదంగా చలామణీ అయిన వాటిని కూడా తిరస్కరించగలగాలి. కళలకు వస్తువుగా వుండే మధ్యతరగతి వినిమయతత్వం, ఆ తరగతికి గల కాపట్యం రెండింటి నుండి విడివడి విమర్శించగలగాలి. అయితే సాంకేతిక విస్ఫోటనం కళలను వాటి పాతసాంప్రదాయిక పోకడ నుండి బయటకు లాగి పడేసింది. అనేక స్థానిక జానపద రూపాల్ని బూతులుగా మార్చి మార్కెట్‌కి అనుసంధించారు కొందరు సృజనకారులు. ఇదోరకం నవీనీకరణ. అంటే కేన్సర్‌లా లోపలేతినేసే మార్కెట్‌కి ఒక తెలివితక్కువ అనుకరణ. ఈ స్థానిక జానపదాల మనుగడ వీటి ప్రాంతీయ ప్రత్యేకతల్లో వుందనే సూత్రాన్ని మరిచిపోయేలా చేసి ఈ కళలను మార్కెట్ ఆత్మహత్య చేసుకొనేలా చేస్తుంది. అంటే తాను మింగలేని, తనకు వెలుపల వుండే, తనకు అర్థం కాని సృజన మార్కెట్‌ను భయపెడుతుంది.

నాటకం సాంకేతికంగా ఎదగాలనే పేరుతో కొన్ని యిటువంటి ప్రయోగాలు జరిగాయి. నాటకం ఒక విశిష్ట కళాప్రక్రియ. సజీవంగా జీవన సంఘర్షణనూ వైరుధ్యాల్ని ప్రదర్శించడం దాని లక్షణం. నాటకం పారిశ్రామిక యుగపు ఉత్పత్తి. వాస్తవ వుత్పత్తి కంటే భావాల, ఊహల, కల్పనల ఉత్పత్తితో లాభాలార్జించే కార్పొరేటు మార్కెట్ దశకి మారాలని అది అనుకుంటే దాని అర్థాన్నే కోల్పోతుంది. తర్వాత మనుగడ కూడా మిగలదు. నేటి మార్కెటీకరణ కళాకారుల కళాస్వేచ్ఛను కొనివేస్తూ కళోత్పత్తిపై వారి అధికారాన్ని ధ్వంసం చేస్తుంది.

రెండు రకాల కళాత్మక వుత్పత్తులు. ఒకటి పరిమితం అయిన, స్వచ్ఛమయిన ఉన్నత కళ, రెండోది భారీ ఎత్తున సాగే సాంస్కృతిక వుత్పత్తులు, అధ్యయన కేంద్రాలు, మ్యూజియంలు మార్కెట్‌కు దూరంగా తమ స్వతంత్రతనూ, అధికారాలనూ కొంతయినా కలిగి వుంటాయి.. అయితే ఇవి కూడా సారాంశంలో మార్కెట్ అనుకూలతనే ప్రదర్శిస్తాయి. ఇక పరిమితం అయిన స్వచ్ఛకళకు పోషకులు ప్రధానంగా ఉన్నత, కులీన, ధనిక వర్గాలే కాబట్టి ఆ వర్గాలు మార్కెట్‌లో పొందే

లాభాల వాటా పైనే ఈ "స్వచ్ఛ"కళ బతుకుతుంది. మరి కళలను వాటి స్వేచ్ఛనూ కాపాడటంలో ప్రభుత్వం పాత్ర ఏమిటి? జాతికి గుర్తింపు తెచ్చే గర్వకారణం అయిన కళారూపాల్ని కళాకారుల్ని నిలబెట్టడంలో కాపాడటంలో ఒక మ్యూజియం పోషించే పాత్రను కూడా ప్రభుత్వాలు పోషించడం లేదు. తాము మార్కెటీకరణకు దాసోహం అయ్యి కళల్ని మార్కెట్‌కు తార్చే పనిని పాలకులు చేస్తున్నారు.

అసలు కళలు సంస్కృతి మార్కెటీకరణ నుండి దూరం జరగాల్సిన అవసరం వుందా? ఏదో ఒకే రూపంతో తాను సృజించిన దానిని కళాకారుడు అమ్ముకోవాలి గదా! పోషకులా, విరాళాలు పోగేయటమా, లేదా టిక్కెట్ రూపంలో వసూలు చేయటమా. ఏదయినా అమ్ముకోవడమే కదా! ఇవన్నీ చాలా చిల్లరగా వున్నాయి. ఒకేసారి గుండుగుత్తగా మార్కెట్‌కు అమ్ముడుపోతే అది ఒక గౌరవం. పేరు అనే భావన యివాళ బలంగా వుంది. ఒక సృజనకారుడు తాననుకున్నది తాను కోరుకున్న రీతిలో సృష్టించి, అట్లా తయారయిన కళ ఒక నాటకం, పాట, కళారూపం ఏదయినా దాన్ని అమ్ముతాడు.. అవును అమ్ముకోవాలి. సృజనకారుడికి యిక్కడ తాననుకున్నది చేసే స్వేచ్ఛ వుంది. తమ తమ అభిరుచుల్ని బట్టి దాన్ని కొనుక్కుంటారు. తద్వారా తన నైపుణ్యానికి తగిన ఒక మార్కెట్‌ను కూడా సృష్టించుకుంటాడు. కాని మార్కెటీకరణకు చెందిన కళాకారుడు తాను కోరుకున్నది తాను కావాలనుకున్న రీతిలో తయారుచేసే స్వేచ్ఛను కోల్పోతాడు. మార్కెట్ అవసరాల మేరకు, మార్కెట్ నిర్దేశించిన అమ్ముడుపోయే కళాసరుకును మాత్రమే సృష్టించాలి. మార్కెట్ అతని సృజనను జలగలా పీల్చేయటంతో ఆశక్తిని చాలా తొందరగా కోల్పోతాడు. కళను సరుకుగానే సృష్టించడంలో అతని స్వంతదనం ఆవిరయిపోతుంది. తన కళని ఒక వుత్పత్తిగా అమ్ముకునే సృజనకారుడికి స్వంత ముద్ర కొనసాగుతుంది. మార్కెటీకరణలో కళా సరుకు తయారీదారుడికీ కొనుగోలు దారుకీ మధ్య మార్కెట్ ఉంటుంది. ఏ రకం అయిన కళ తయారుచేసి అమ్మాలో నిర్ణయించడంలో కొనుగోలుదారుల అభిరుచుల కంటే మార్కెట్ ప్రయోజనాలకు అనుగుణం అయిన అభిరుచుల్ని అవసరాల్ని సృష్టించడం అనే పరమార్థం కీలకంగా పనిచేస్తుంది.

కనుకనే సాంకేతిక విస్ఫోటనం వలన ప్రజలకి చేరువయిన కళ వారిని మరింత నాగరికతవైపుకి నడిపించకుండా సరుకుగా మారి అరాచకం వైపుకి నెడుతున్నది.

అయితే ఏ కాలంలో నయినా కళకు వుండే ప్రజా వినిమయం లేదా ప్రయోజనం అనే దాన్నుండి అలౌకిక సౌందర్య ఆదర్శ భావనగా చూసే ఒక అవగాహన – మారడానికి నిరాకరించి ఆకలితో అల్లాడే "కళా తపస్వుల్ని" సృష్టించింది. ప్రతీకాలంలో ఏ కళాసృజనకయినా ఉపయోగిక విలువ వుంటుంది. ఆ ప్రయోజనం ఎవరికి ఎందుకోసం అనేదే తెల్సుకోవడం అవసరం. సమాజంలో ఏది ఆలోచించాలి ఏది మాట్లాడాలి అనే దాని గురించి అంటే ఏ రకం సంస్కృతిని వుత్పత్తి చేయవచ్చు – దానిని అనుభవించేదిగా చేయవచ్చు అనే మార్కెట్ చక్రమిది.

సాంస్కృతిక సంక్షోభాన్ని, కళలను వికృత పరచడాన్ని ప్రధానంగా "పరాయితనం" నుండి తెల్సుకోవాలి. మార్కెటు తయారుచేసిన మార్కెట్ హేతుబద్ధత, ఆధునికతల ఫలితంగా తను తనలాంటి వారు తయారు చేస్తున్న తన చుట్టూ ఉన్న వస్తువులతో సంబంధం పెట్టుకునే శక్తిని మనిషి కోల్పోతాడు. వస్తువులన్ని ఒక సామాజిక చారిత్రక క్రమంలో వుత్పత్తి అయినవి అనే విచక్షణ కోల్పోయి అవే ఒక సహజ వుత్పత్తిగా భావిస్తాడు. వస్తువులు ఎక్కడి నుండో ప్రత్యక్షం అయినట్లు కనబడతాయి. కనుకనే సెల్‌ఫోను, ఇంటర్నెట్‌లు వాటంతట అవే నేరస్తులు అవుతాయి. వాటిని వాడిన మనుషులు కాదు. అంటే వస్తువులు భావాలుగా అనుభూతులుగా మారతాయి. మార్కెట్ స్వేచ్ఛే మనిషి స్వేచ్ఛగా మారింది.

సాంస్కృతిక వుత్పత్తులు అంటే అవి పూర్తిగా వస్తువుల లాగా తయారవుతాయని కాదు. ప్రక్రియ మాత్రం ఒక్కటే. సంస్కృతి వుత్పత్తి, పంపిణీ, వినిమయం అన్నీ దాని మారకపు విలువలను విశ్లేషించడం ద్వారానే పొందుతాయి. సంస్కృతిని అమ్మడం మార్కెట్‌కు కొత్త కాదు. కాని కార్పొరేటు సంస్కృతి గతం కంటే ఒక మౌలికమైన మార్పు చెందింది.

కళ కూడా వినిమయ వస్తువుగా వున్నపుడు అసలు కళాకారుడు తన వుత్పత్తికి తనదయిన ఒక తార్కికతని, అనుభూతిని, అంతర్గత నిర్మాణాన్ని (తనదయిన ముద్ర వేయటం) యివ్వడం కళలోని సాంకేతికత. అంటే కళా సృజనకు బయట, తర్వాత ఎంతోకొంత ఏదో మిగిలే వుంటుంది. కాని కార్పొరేటు సాంస్కృతిక పరిశ్రమలో అది సరుకుగా సరుకులోని అంతర్గత భాగంగా మారిపోయింది. అంటే సంస్కృతిని ప్రకటనలు, అమ్మకాలు, తీరిక, వినోదం జీర్ణం చేసేసుకున్నాయి. ఈ సంస్కృతి అమ్మకాలు, లాభాలు పెంచడం అందుకోసం ఆధునిక పౌరుల్ని పలాయనం, వినోదం

ద్వారా వినిమయదార్లుగా మార్చి పారేసి సంతృప్తిపరుస్తుంది. ఈ తరహా కార్యక్రమాలను వాటి ప్రేక్షకులను లోతుగా పరిశీలిస్తే చౌకబారు అభిరుచుల్ని మార్కెట్ ఎంత అలవాటు చేయగలిగిందో అర్థం అవుతుంది. పాతికేళ్ళపాటు ప్రత్యక్షంగా అంతకు ముందు పరోక్షంగా ఇదే పని మీడియా ఒక క్రమ పద్ధతిలో చేస్తూ వచ్చింది. అది తెలిసి పథకం రచించి జరగదు. మీడియా మార్కెట్‌లో భాగం కావడం వల్ల విజయవంతమయిన ఫార్ములాను అనుసరించడం వలన జరుగుతుంది.

ఉన్నత కళ గాని స్వతంత్ర కళగాని మౌలికంగానే వాస్తవమైనవి మంచివి అని చెప్పడం సాధ్యం కాదు. మార్కెట్ వుత్పత్తి సరుకుగా మారడానికి నిరాకరించడం ద్వారానే వాటి కళలో వైవిధ్యం ఏర్పడి వాటి అమ్మకపు విలువను పెంచింది. ఎక్కువలో ఎక్కువగా యివి మార్కెట్ సమాజపు వైరుధ్యాలను అసంమజసత్వాన్ని ప్రదర్శించగలవు. కాని సత్యానికి సంబంధించిన చివరి మజిలీలివి కావు. ఉన్నత కళ గాని మార్కెట్ కళా సరుకుగాని రెండూ పెట్టుబడి వ్యాధి లక్షణాలు, శాశ్వత మచ్చలు కలిగి వుంటాయి.

కళ కోల్పోయిన, కోల్పోతున్న స్వేచ్ఛకు సంబంధించి రెండు చిరిగిన విడిముక్కలుగా వీటిని పరిగణించాలి. వ్యాపారం వలన చెడిపోయిన కళ, లేదా అస్వచ్ఛ కళను విమర్శించే వారికి జవాబిస్తూ అడోర్నా (విశ్లేషకులు) **“అన్ని సంస్కృతులూ సమాజపు అపరాధాన్ని పంచుకుంటాయంటాడు.”** సాధారణ భాషలో చెప్పాలంటే సంస్కృతి ఎంత విమర్శనాత్మకంగా వున్నా అది కొద్దిమందికే పరిమితం అయిన రంగం. నిజానికి అది ఎంత స్థాయిలో విమర్శచేస్తే అదే స్థాయిలో అది అణిచి వేయబడుతున్న వారికి చేరకుండా చేయబడుతుంది. ఎందుకంటే దాని విమర్శనాత్మక పదును అది సరుకు సాంకేతిక నుండి విడివడ్డం వలన లభించింది. వినిమయాన్ని ప్రతిఘటించడం ద్వారా అది రోజువారీ జీవితం నుండి దూరం అవుతూ వుంటుంది. కనుకనే మార్కెట్ కళ ప్రజలకు చేరేంత స్థాయిలో విమర్శనాత్మక కళ చేరడం గాని ఆదరణ పొందడం గాని జరగదు.

ఉదారవాదులు, ఆధునికానంతర వాదులు వ్యాపారం కోసం వుత్పత్తి అయిన కళను తృణీకరించారు. పైగా అది నిజమైన ఆనందానికి, స్వతంత్రతకూ, కులీన సంస్కృతి ఆధిపత్య వర్గాలపై దాడికి నిజమయిన పునాదిగా భావిస్తారు. మోటుగా చెప్పాలంటే అశ్లీలతే తిరుగుబాటన్నమాట. గత ఏభై ఏళ్ళుగా సాంస్కృతిక ఉత్పత్తుల పై కేంద్రీకరణ బలంగా వుంది. ఈ మూక వుత్పత్తి సరుకులకు ఉప సంస్కృతులు

అంటే మరింత చౌకబారు అనుకరణలు తయారయ్యాయి. అంటే సినిమాలు, టివి కార్యక్రమాలకు నకళ్ళుగా నాటకాలు రావడం. యివి కొందరి సామాజిక ఎదుగుదలలో బేరసారాలకు అవకాశం కల్గించాయి.

ఇక యువతరాన్ని ప్రేరేపించడానికి ప్రస్తుత సమాజంపై వ్యాఖ్యను విమర్శను జోడించి తాజాపర్చిన సాంస్కృతిక సరుకులు ఉత్పత్తి అవుతుంటాయి. (ఒకప్పుడు శివ ఇపుడు అర్జున్‌రెడ్డి వగైరాలు) ఈ తరహా తిరుగుబాట్లు వీటి వ్యక్తీకరణలు సరుకుగానే ఉండే రూపాన్ని శైలిని కలిగి వుంటాయి. కాని యివి కొత్త మార్కెట్లను సృష్టిస్తాయి. యివి మార్కెట్‌కీ సంస్కృతికీ గల సంబంధంలో ఒక కొత్త కోణాన్ని ఆవిష్కరించాయి. యువతరానికి వుండే సహజమైన తిరుగుబాటు తత్వాన్ని చైతన్యాన్ని మొత్తం మార్కెట్ మింగేయగలదనీ, సరుకు చేయగలదనీ, మలచగలదనీ నిరూపితం అయ్యింది. తిరుగుబాటు చైతన్యం మార్కెటు అవసరాల్లోకి అనువదించబడింది. ('చే' టీ షర్టులు, టోపీలు)

సామూహికంగా ప్రజలంతా ఆనందిస్తున్న సంస్కృతి అనేది సరుకు వినిమయం, విస్తరణా కేంద్రంగా భాసిల్లుతున్నది. సంస్కృతిని రోజువారీ జీవితపు సౌందర్యభావనగా అనుభవించే శక్తిగా మార్చడం - అంటే ప్రతీకాత్మక సృజన జరిగింది. ప్రతి వస్తువుకీ అది ఎంతకాలం నుండి వుత్పత్తిలో వున్నా ప్రతిసారి కొత్త అర్థాలు స్ఫురించాలి కొనుగోలు దారులకు. అంటే దుప్పట్లు సైతం సంగీతంగా తోచాలి.

షాపింగ్ రకరకాల ఆనందాలకీ స్వేచ్ఛలకీ ప్రతీక. నగరం వాటిని కల్పించే వేదిక. వ్యక్తిగత షాపింగ్ కోరికలు, ఊహలు, చూడటం, తాకటం, పొందాలనే ఆశ మొత్తంమ్మీద ఒక ఆనందానుభవం - కుటుంబాలు ఎంచుకునే అనుభవం - కొనసాగగలిగినా లేకున్నా. ఈ భావనల్ని నిలిపి వుంచడమే మాల్స్ చేస్తున్నది. మాల్సే ఒక సామాజిక అనుభవం. ఇది కోర్కెల్ని సృష్టిస్తుంది. స్త్రీలకు ఆమోద యోగ్యమయిన తిరిగే స్వేచ్ఛనిస్తుంది. ఇది ఒక సాంస్కృతిక వనరు. కుటుంబానికి సన్నిహితం అయిన సాంస్కృతిక కార్యక్రమం. ఒక ప్రేమపూర్వక, త్యాగపూరిత చర్య. బిడ్డలకీ, తల్లితండ్రులకీ వారు కోరుకున్న వస్తువులు కొనివ్వగలగడం. మానవ సంబంధాల అభివ్యక్తీకరణ. వ్యాపార ప్రకటనలు మార్కెటింగ్, డిజైన్లు, జీవన శైలి ద్వారా జీవితాన్ని మార్కెట్ సౌందర్యంతో నింపుతుంది. కనుక షాపింగ్, సమాచారం

జీవితంలో కేంద్రస్థానం ఆక్రమించాయి. వస్తువులు భౌతిక పదార్థాలుగా కాక భావనలుగా మారాయి. ఇపుడు సాంస్కృతిక గుర్తింపు, ప్రత్యేకతగా మారిన మార్కెట్ సామర్థ్యం వ్యక్తి విజయానికి సున్నితత్వానికీ ప్రతీక.

ఇటువంటి స్థాయికి చేరిన సమాజంలో సరుకు వ్యతిరేక స్వతంత్ర సంస్కృతి అవసరం గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. అటువంటి సృజనాత్మకత, కళలు వుత్పత్తి మనుగడల గురించి లోతుగా చర్చించాలి. ఈ మార్కెట్ సాంస్కృతిక సరుకే దానికి ప్రత్యామ్నాయ సృజనకు వస్తువు. అది బలం పుంజుకునే కొద్దీ ఈ సాంస్కృతిక సరుకు ఎరువుగా మారుతుంటుంది. మార్కెట్ విశ్వరూపం దాని శక్తి చూసి సృజనకారులు నిస్పృహకి లోనవుతుంటారు. కాని మానవ స్వభావం ఎంతటి నికృష్ట పరిస్థితిల్లోనూ తన మానవత్వాన్ని కాపాడుకుంటుంది. మనిషిలోని ఈ ప్రత్యేకత పట్ల సృజనకారులకి పూర్తి నమ్మకం వుండాలి.

సరుకు సాంస్కృతికతలకు భిన్నంగా తయారుచేసే సృజనలు విస్తారంగా జనానికి చేరడానికి నాణ్యత, సారాంశాలే కాక ఉపయోగిక విలువలను పెంచగలగాలి. అంటే స్వతంత్ర కళ తన ప్రత్యేకత ద్వారా విమర్శనా దృష్టి ద్వారా తనదయిన ఒక ప్రజాబాహుళ్య మార్కెట్‌ను సృష్టించుకోగలగాలి. కళా సంస్కృతులను పురోగమనం వైపు సాగే భౌతిక శక్తిగానే చూడాలి. ఈ సృజన వీధుల్లో, మురికిలో, చెమటతో సాంగత్యం చేయగలగాలి. వాటికి చేరడం తిరిగి వాటి నుండి స్వీకరించడం అనే పాత పరస్పర మార్పిడి కళాత్మకతను పునరుద్ధరించాలి.

*(ఈ వ్యాసంలోని ప్రధాన విశ్లేషణలు అనేకమంది అధ్యయనాల నుండి అరువు తీసుకున్నవి. కూర్పు, వ్యాఖ్యలు, వివరణలు నావి.)*



# 12. సంస్కృతి అనగా...?

– డా॥ మలయశ్రీ (శతాధిక గ్రంథకర్త, కరీంనగర్)

'సంస్కృతి' అనేది నాగరిక జనం / విద్యావంతులు మాత్రమే వాడే పదం. ఇది నాగరికత అనే పదానికి పర్యాయంగా వాడుకలో ఉంది. ఆంగ్ల భాషలో కల్చర్, సివిలిజేషన్ అని వీటికి రెండు వేర్వేరు శబ్దాలున్నవి. మనకు ఆ రెండూ ఒక్కటే – అనేది అవునో కాదో అని కొంత అనుమానమే. సామాన్య జనాలకు ఇంత పెద్ద మాటలు అవసరం కావు – వాటి అర్థాలతో పని ఉండదు. వాళ్ళ జీవితాలు సామాన్యం – భాష సరళం, స్పష్టం!

సంస్కృతి అనే పదం సంస్కృతం వంటిదే. సంస్కృతం – అంటే, సంస్కరించ బడినది అని దాని అర్థం. దేని నుంచి? అంటే, ప్రాకృత భాషల నుంచి – అదీ పండితుల చేత.

సంస్కృతం శబ్దం వ్యుత్పత్తిని (పుట్టుకను) విశ్లేషిస్తే – 'సంసుకృతం' అనవచ్చు. పైవి రెండూ సం, సు, ఉపసర్గలు (ప్రిఫిక్స్‌లు). కృతం, క్రియాజన్య విశేషనం – విశేషమైంది. అదే విధంగా 'సం+సు+కృతి' మేళనంతో 'సంస్కృతి' పదమేర్పడింది. సంసారం సంస్కృతం రెండు తప్ప, సంస్కృతి సంస్కరణ పదాలు ఎందుకో కాని 'శబ్ద రత్నాకరం'లో లేవు.

సంస్కృతి – అంటే, "జన జీవన విధానం, వారి ఆచారాల వ్యవహారాలు" అని స్థూలంగా చెప్పవచ్చు. కాని, కొన్నేండ్ల క్రితం ఒక ప్రముఖ రచయిత వ్యాసంలో "నాగరికత అంటే – వ్యక్తి బాహ్యవర్తన, సంస్కృతి అంటే – మనిషి మానసిక – చిత్త వైఖరి!" అనే వివరణ చదివినట్లు గుర్తు. "సహనమే సంస్కృతి" అని మనదేశ మాజీ రాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారంటే – రామాయణ విషవృక్షం రచయిత్రి రంగనాయకమ్మగారు "సహనం గాడిద లక్షణం" అన్నారు. అవి వారి వారి సొంత నిర్వచనాలు.

ఆటవిక, గ్రామీణ, పట్టణ వాసులవి వేర్వేరు సంస్కృతులు. అందుకే ఆటవిక సంస్కృతి, గ్రామీణ సంస్కృతి, పట్టణ / నగర సంస్కృతి అని అంటున్నాం. నాగరికత మాత్రం నగరవాసులదే – విద్యావంతుల నడత. ఆటవిక నాగరికత, గ్రామీణ

నాగరికత అనలేం కదా, అన్నా ఆ పదాలు ఎబ్బెట్టుగా ఉంటవి. సంస్కృతి అందరిది. అది "జనజీవన వైఖరి, విశ్వాసాలు, ఆచారాల వ్యవహారాల సమాహారం".

ఆటవిక గ్రామీణ నాగరిక సంస్కృతులలో కొన్ని పోలికలున్నా, భేదాలు అధికం. ఆటవిక సంస్కృతి మొదటిది. అదే గ్రామీణ సంస్కృతిగా మారి, నగర సంస్కృతిగా పరిణితి చెందినది. తెలుగు సంస్కృతి. గ్రామీణులది / జానపదులది కుల సంస్కృతి.

జనజీవన 'సంస్కృతి' ఒక జాతి ప్రజలు నివసించే ప్రాంతాన్ని పట్టి ఉంటది. (జాతి అంటే ఒక భాష మాట్లాడే వాళ్ళు) వాతావరణం, పరిసరాలు, కొండలు, వాగులు, వనాలు, పంటలు, పూర్వుల చరిత్ర, అలవాట్లు, ఆచారాలు, నమ్మకాలు, పర్వాలు, వేడుకలు మొ॥ వాటితో పంటలను పట్టి తిండి, వాతావరణాన్ని పట్టి దుస్తులు, అందుబాటును పట్టి వస్తువాహనాలు, నమ్మకాలను పట్టి ఆచారాలు పర్వాలు మొ॥ ఉంటవి.

అయితే ఈ "సంస్కృతి"పై కులం మతం ముద్ర బలంగా ఉంటవి. అయినా అది ఒక ప్రాంత సంస్కృతిలోని ఒక సాధారణ భాగం మాత్రమే. జన జీవన విధానమే సంస్కృతిలోని ప్రధాన భాగం. కాని, అందుకు భిన్నంగా ఇప్పుడు కుల మతాల విశ్వాసాలు ఉత్సవాలు ఆచారాలు ఆచరణలు ప్రచారాలు 'సంస్కృతి'గా చలామణి అవుతున్నవి. ఇది తప్పు. దీనితో సమాజానికి ప్రమాదం.

ఇప్పుడు మనం ఒక్కో ప్రాంతంలో అనేక భాషల / సంస్కృతుల వాళ్ళం కల్సి ఉంటున్నాం. కుల మతాల సంకుచిత దురభిమానాలకు పోక, మానవతావాద విశాల దృష్టితో మెలగవలసి వుంది మనం. కుల మతాలకు అతీతంగా – ఒక ప్రాంత ప్రజల జీవన విధానమే – ఆ ప్రాంత ప్రజల 'సంస్కృతి' అనుకుంటే, అంటేనే సమంజసం – సత్యం!



# 13. ఏది భారతీయ సంస్కృతి?

**– కె. అయ్యన్న** (అధ్యక్షులు : నాస్తిక సమాజం, మహబూబ్‌నగర్)

భారతీయ సంస్కృతి అనే దానికి ముందు మనం సంస్కృతి అంటే ఏమిటి అనే విషయం తెలుసుకోవాలి.

సంస్కృతి అంటే ఏ దేశంలోనైనా ఆ దేశంలోని, ఆ దేశ ప్రజల జీవన విధానాన్ని సంస్కృతి అంటారు.

ఆచారాలు, సంప్రదాయాలు, ఆలోచనలు, భావాలు మొ॥నవి సంస్కృతి యొక్క భాగాలు, సంస్కృతి అనే పదానికి ఇంకా దేశ, విదేశ పండితులు కొన్ని నిర్వచనాలు చెప్పారు.

వాటిని కూడా పరిశీలిద్దాం....

1. **డా॥ ఆర్.సి. మంజునాథ్ :** ఇతడు నాగరికతా సంస్కృతులను వేరువేరుగా భావించలేదు. ఆచార, సంప్రదాయాల ద్వారా ఒక జాతి భావితరాల వారికి అందించే భౌతిక వనరులన్నింటిని సంస్కృతి అని నిర్వచించారు.

2. **టేలర్ :** సమాజ సభ్యుడుగా మానవుడు సాధించే విజ్ఞానం, ప్రగతి, నీతి వ్యవహార సరళి పాటించబడే ఆచారాలు మొదలగు వాని కలయికను సంస్కృతి అంటారని అన్నాడు.

3. **రెడ్‌ఫీల్డు :** ఒక జాతి యొక్క సంప్రదాయకబద్ధమైన కళా నైపుణ్యాన్ని ప్రతిబింబించే విద్యను సంస్కృతి అంటారు.

4. **బైర్‌స్టేట్ :** సమాజంలో భాగస్వాములుగా మనం చెప్పేది. ఆలోచించేది. సంపాదించేది అంతా సంస్కృతి క్రిందనే వస్తుంది..

5. **గ్రాహమ్ వల్లాస్ :** ఒక తరం నుండి మరొక తరానికి సాంఘిక వారసత్వంగా విద్యాభ్యాసం ద్వారా సంక్రమించే దశలు, ఆశయాలు విలువల సముదాయమే సంస్కృతి.

6. **ఆచార్య ఖండపల్లి లక్ష్మీరంజనం :** ఒక జాతి అభివృద్ధి మార్గమున నడిచిన రీతిని సంస్కృతి అంటారు.

మన దేశంలో ఈనాడు మనం చూస్తున్న సంస్కృతి ఆర్యసంస్కృతి. ఇది చాతుర్వర్ణ సంస్కృతి. అగ్రకుల సంస్కృతి. పెత్తందారీ సంస్కృతి. అధిక సంఖ్యాకులైన జనులకు వ్యతిరేకమైన సంస్కృతి. ఒకజాతి కొన్ని మౌలిక విలువలను ఏర్పాటు చేసుకొని జీవించే విధానమే సంస్కృతి. అనుకొన్నప్పుడు అధిక సంఖ్యాకుల జీవన విధానాన్ని అది ప్రతిబింబిస్తుంది కదా. ప్రపంచంలో అతి ప్రాచీనంగా చెప్పబడిన ద్రావిడ సంస్కృతి మన పూర్వుల సంస్కృతిగా చెప్పుకోవాలి కాని, ఇక్కడ ద్రావిడ జాతిని అణగద్రొక్కి ఆర్యజాతి సంస్కృతిని బలవంతంగా ఇక్కడ ప్రజలపై రుద్దబడిన విదేశీ సంస్కృతి ఈనాటి ఆర్య సంస్కృతిగా భావించాలి. ఈనాడున్న సంస్కృతి ఇతర జాతులను, అంటే ఇక్కడి జాతులను అతి క్రూరంగా అణగద్రొక్కి తన ఉనికిని కాపాడుకొన్న దుష్ట సంస్కృతి ఈనాటి ఆర్య సంస్కృతి.

ఈ ఆర్య సంస్కృతి మగువల జీవితాలకు సంకెళ్లు బిగించింది. వారి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను అరికట్టింది. పురుషాధిక్యత పెరిగింది. ఉద్యోగం పురుషలక్షణం అని పురుషులకు మాత్రమే ఎక్కువచేసి స్త్రీలను కించపరచిన సంస్కృతి ఈనాటి ఆర్య సంస్కృతిగా చెప్పవచ్చును. ఆర్యుల కాలంలో స్త్రీల దయనీయ పరిస్థితిని చెప్పటం చాలా కష్టతరం.

ఆనాడు ఆడపిల్ల పుట్టుకను ఎవరూ మెచ్చరు. స్త్రీకి ఆస్తి హక్కు లేదు. తండ్రికి వారసులు లేకపోతే ఆస్తి కూతురికి కాకుండా ఆమె కుమారునకు అనగా మనుమడికి చెందుతుందని చెప్పారు. ఋగ్వేదంలో ఈ విషయం రాయబడింది. తరువాత కాలంలో స్త్రీకి విద్య సాంఘిక గౌరవం కూడా లేదు. పిల్లల వివాహ సమయంలో తండ్రికి పూర్తి హక్కులు వుండేవి అని ఋగ్వేదంలో చెప్పారు.

సతీసహగమనం అమలు చేయబడింది. బహు భార్యత్వం వున్నది. అంతేగాక, స్త్రీని నమ్మరాదని, స్వేచ్ఛనివ్వరాదని చెప్పబడింది. మనువు కాలంలో స్త్రీలపై పూర్తి ఆంక్షలు విధించబడినవి. కుల వ్యవస్త సృష్టించబడ్డది. పుట్టుకచేతనే ఒక వ్యక్తి ఎక్కువ తక్కువలు నిర్ణయించబడ్డాయి. జాతి, రంగు, వృత్తి భేదాల వల్ల కుల వ్యవస్థ ఏర్పడినట్లు పండితులు భావించారు.

వేదకాలంలో కుల వ్యవస్థ అంత కఠినంగా లేదు. ధర్మాన్ని బట్టి కులాన్ని నిర్ణయించారు. బ్రాహ్మనుడైన పరశురాముడు క్షత్రియుడిగా మారినాడు. ఇది పురాణకాలం. విశ్వామిత్రుడు తపస్సుచేత బ్రాహ్మణ ఋషి అయినాడు. ఇతడు క్షత్రియునిగా పుట్టిన విషయం మనందరం ఎరిగినదే.

తర్వాత కాలంలో సంఘంలో కుల పరిధులను దాటిన వారికి రాజదండము చూపించి శిక్షలు అమలుచేసి కుల వ్యవస్థను కాపాడినారు. చాతుర్వర్ణ వ్యవస్థ రక్షించబడినది. పూర్వజన్మ, పునర్జన్మ, స్వర్గం, నరకం పేరిట కష్టజీవులను మోసగించి వారి కష్టార్జితాన్ని దోచుకొని వారిని పనికిమాలిన వారిగా తయారుచేసిన విష సంస్కృతి ఆర్య సంస్కృతి. కులం పేర మనుషులను చీలదీసి, విభజించి పాలించే దుష్టసంస్కృతి ఈనాటి వరకు కొనసాగుచున్నది. అంటరానితనాన్ని సృష్టించి మానవుల మధ్య అంతరాలు సృష్టించి, మనిషిని మనిషి తాకకూడదనే కట్టుబాట్లు సృష్టించి మానవత్వాన్ని మంటగలిపిన దుష్ట సంస్కృతి ఈనాడున్న బ్రాహ్మణీయ సంస్కృతి.

సాటి మనిషిని మనిషిగా చూడలేని దౌర్భాగ్య సంస్కృతి ఈనాడు చెప్పబడుతున్న భారతీయ సంస్కృతి. ఇది ఈనాటికి తారతమ్య బేధాలతో కొనసాగుచున్నది. ఇది మానవుల్ని ఆలోచించనీయకుండా పరాధీనత భావాన్ని సృష్టించిన ఆధ్యాత్మిక సంస్కృతి నేటి భారతీయ సంస్కృతి, ప్రపంచానికే తలమానికంగా చెప్పబడుతున్న భారతీయ సంస్కృతి అని ఏదో గొప్పలు చెప్పుకొంటున్న ఈ విష సంస్కృతి ఇక్కడి అధిక సంఖ్యాకులైన ప్రజలకు వ్యతిరేకమైంది.

అధిక సంఖ్యాకులైన మానవులు చదువుకుంటే నాలుకలు కోసేయమన్నది. విజ్ఞాన విషయాలు వినకుండా చెవులలో సీసం పోసేయమన్నది. తాము తినగా మిగిలిన ఎంగిలి మెతుకులను ఇతరులకు విసిరిన సంస్కృతి భారతీయ సంస్కృతి.

తాను పట్టు వస్త్రాలను ధరించి కింది కులాలవారికి చింపిరి గుడ్డలు ధరించమన్న సంస్కృతి ఆర్యసంస్కృతి. పుట్టుకచేత మానవుడెవ్వడు దుర్మార్గుడు కాదు. ప్రయత్నం చేతనే మానవుడు ఎంత ఉన్నత స్థానాన్ని అయినా పొందవచ్చునని చెప్పిన చార్వాకుల సంస్కృతి మనది. భౌతిక ప్రపంచాన్ని పరిశీలించమని, ఈ ప్రపంచం అణునిర్మితమని చెప్పిన చార్వాకుల సంస్కృతి మనది. పునర్జన్మ లేదు. పూర్వజన్మ అంతకంటే లేదు. ఆత్మలేదు, స్వర్గం లేదు. నరకం లేదు. వున్నదంతా ఈ లోకం ఒక్కటే అని చెప్పిన లోకాయత సంస్కృతి మనది.

కులం లేదు, మతం లేదు, మానవత్వాన్ని మరువవద్దు. భౌతికవాద తత్వశాస్త్రాన్ని అందించింది చార్వాక సంస్కృతి. ఈ సంస్కృతికి దోహం చేయాలని విజ్ఞానవేత్తలను అర్థిస్తున్నాం.

**(చైతన్య వ్యాస మంజరి గ్రంథం నుండి...)**

# 14. పెరిగిపోతున్న ఫాసిస్టు సాంస్కృతిక ఉన్మాదం

– **అరణ్య** (సామాజిక కార్యకర్త)

ఒక జాతికి, సారూప్య మానవ సముదాయాలు కలిగిన భౌగోళిక ప్రాంతానికి సంస్కృతి అనేది జీవన విధానపు ప్రధాన సూచిక. సంస్కృతిని కలిగి ఉండడం, దాన్ని తయారుచేసుకోవడం, దానిలో మార్పులు చేసుకోవడం, దాన్ని రక్షించుకోవడం వంటి సాంస్కృతిక గమనంలోని అంశాలన్నీ తరతరాలుగా అనేక మానవ సముదాయాలలో కొనసాగుతూ వస్తున్నవి. ఏ ప్రాంతానికాప్రాంతం, ఏ జాతికాజాతి, ఏ అస్తిత్వానికా అస్తిత్వం విభిన్న సంస్కృతులను కలిగి ఉండే క్రమంలో సంస్కృతుల మధ్య ఏకరూపత, సారూప్యత ఉండడం సాధ్యం కాదు. సంస్కృతి అఖండం కాదని అంటుంటాం. ఈ వివిధ సంస్కృతులు అవి మనుగడ సాగించే ప్రదేశాలలో నిరంతరం మార్పు చేర్పులకు గురవుతూనే ఉంటాయి. ఈ చలన శీలత వల్ల కొన్నిసార్లు తాత్కాలికంగాను, మరికొన్నిసార్లు శాశ్వతంగాను ప్రజల జీవన విధానాలలోను మార్పు సంస్కృతులను (చేంజ్ కల్చర్) సృష్టిస్తుంటాయి. ఈ మార్పు సంస్కృతులను ప్రభావితం చేసే విషయంలోని ప్రత్యేక సందర్భాలపై ఆధారపడి ఉంటుంది. మార్పు సంస్కృతులు స్థిరపడడం వల్ల ప్రధాన సంస్కృతిలో జరిగే మార్పులు ఒక దీర్ఘకాలాన్ని పరిశీలించి చూస్తే ప్రగతిశీలంగా ఉంటాయని, అవి అభ్యుదయంవైపే సాగుతుంటాయనేది మార్క్సిజం ప్రధాన సూత్రీకరణ. అయితే ఈ ప్రగతిశీల మార్పులు సాఫీగాను, రేఖామాత్రంగాను జరగవు. ఎప్పటికప్పుడు ప్రతి సందర్భంలోనూ తిరోగమన శక్తులు వాటిని అడ్డుకుంటూ వస్తాయి. ప్రగతి నిరోధకంగా మార్చాలని చూస్తుంటాయి. ఈ నిరోధక శక్తులు అనేక రూపాలలో అనేక లక్ష్యాలకోసం పనిచేస్తుంటాయి. అసలు సంస్కృతిలో ఎలాంటి మార్పులూ అవసరం లేదని, జరిగిన మార్పులన్నీ మూల సంస్కృతిని విఘాత పరుస్తాయని, కనుక మూల సంస్కృతిని పునఃస్థాపించాలని కొన్ని శక్తులు పనిచేస్తుంటాయి. మళ్లీ వాటిలో కూడా హెచ్చుతగ్గుల ఆలోచనలుంటాయి. లక్ష్యాలుంటాయి. ఇక మరికొన్ని శక్తులు మార్పులు అవసరమేగానీ అవి మూల సంస్కృతికి అనుబంధంగా ఉండాలని, అట్లా ఉంటూ ఎన్ని మార్పులకు గురైనా సమ్మతమేనని భావించే శక్తులుంటాయి. ఇంకొన్ని శక్తులు మార్పులు సమూలంగా జరిగినా ఫర్వాలేదు గానీ అవి ప్రగతిశీలంగా అంటే సామ్యవాదం, కమ్యూనిజం వంటి లక్ష్యాల దిశగా మాత్రం ఉండకూడదని ఇతర లక్ష్యాలకు లోబడి ఉంటే ఏమీ అభ్యంతరం లేదని భావిస్తుంటాయి. ఈ ధోరణులే

కాకుండా ఇంకా అనేకానేక ధోరణులు సందర్భానుగుణంగా మార్పులను నిరోధించడానికి ప్రయత్నిస్తుంటాయి. ఈ ఒడిదుడుకులన్నింటి మధ్య జరిగే ప్రయాణంలో విభిన్న సంస్కృతుల అస్తిత్వాలు సంక్షోభాలకు గురవుతూ ముందుకు పోతుంటాయి. సాధారణంగా ఈ సమయంలోనే ఒక సంస్కృతి మీద మరో సంస్కృతి పెత్తనం నెరిపే సాంస్కృతిక ఆధిపత్యం కూడా ప్రగతిశీల మార్పులకు ఒకానొక ప్రతిబంధకంగా ఉంటూ వస్తుంది.

సాంస్కృతిక ఆధిపత్యం ప్రధానంగా సాధించే అంతిమలక్ష్యం ఏమిటంటే ఒక సంస్కృతిని అనుసరించే మనుషులపై దోపిడి నెరపడం. ఒక మానవ సముదాయంపై దోపిడి సాగించడం అనేది అనేక రూపాలలో జరుగుతుంది. యుద్ధాలలో చంపడం, భౌతిక దోపిడి, ప్రాంతాలు దేశాలను ఆక్రమించుకోవడం, అవసరానికి మించి ఆస్తులు సంపాదించడం వంటి ఎన్నో రూపాలలో దోపిడి జరుగుతుంది. ఇంకా లోతుగా చెప్పుకోవాలంటే పరిణామక్రమంలో మానవ సమాజంలో భూస్వామ్యం ఏర్పడడం, పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడడం, సామ్రాజ్యవాదానికి దారితీయడంతో పాటు అసలు మొత్తంగా రాజ్యం ఆవిర్భావమే దోపిడి కొరకు దోపిడిని స్థిరపరిచే లక్ష్యం కొరకు జరిగిందనే కోణం కూడా ఉంది. ఇవన్నీ దోపిడి రూపాలుగా కొనసాగుతూ చరిత్ర పొడుగునా దోపిడి నిరాఘాటంగా సాగడానికి ఈ రూపాలన్నీ మానవ సముదాయాలను నియంత్రించి గుప్పిట్లో పెట్టుకునే ఆధిపత్య సాధనాలుగా పనిచేస్తూ వచ్చాయి. అది ఏ రూపంలో ఉన్నా సరే, ఆధిపత్యం అనేది మాత్రమే దోపిడీకి అవకాశమివ్వగలదనే ప్రధాన మార్గం అవుతూ వచ్చింది.

ఈ ఆధిపత్యం అన్ని ఇతర అంశాలలో వలెనే సంస్కృతి విషయంలోనూ బలహీన సముదాయాలను, జాతులను, ప్రాంతాలను, కులాలను, మతాలను వెనక్కి నెడుతుంది. సాంస్కృతిక ఆధిపత్యం ఆయా వర్గాల సంస్కృతులను ప్రత్యక్షంగానో పరోక్షంగానో అణిచివేస్తుంటుంది. ఒక సంస్కృతిలోపల అంతర్గతంగా ఉండే విభిన్న పురోగామి తిరోగామి శక్తుల మధ్య పోరాటం లేదా పోటీ కొనసాగుతూనే వేర్వేరు సంస్కృతుల మధ్య జరిగే పోరాటం లేదా పోటీ రూపంలో ఈ సాంస్కృతిక ఆధిపత్యం బహిర్గతమవుతుంది. సాంస్కృతిక ఆధిపత్యం కొనసాగే సమయంలో కొన్ని ముఖ్యమైన ఫలితాలు చోటుచేసుకుంటాయి. ఒక సంస్కృతిలో తిరోగామి శక్తుల భావజాలం బలోపేతమైనపుడు ఆ సంస్కృతి ప్రగతి నిరోధక సంస్కృతిగాను పురోగామి శక్తుల భావజాలం బలోపేతమైనపుడు ప్రగతిశీల సంస్కృతిగాను అప్పటి సందర్భంలో

లక్షణాన్ని కనబరుస్తుంటుంది. అలాంటి లక్షణాలు సంతరించుకున్న సంస్కృతుల మధ్య పోటీలో ప్రగతిశీల సంస్కృతి ప్రగతి నిరోధక సంస్కృతిపై ఆధిపత్యం నెరిపే సందర్భంలో తాత్కాలికంగా వాటిమధ్య జరిగే ఘర్షణల్లో ప్రగతిశీల అంశాలే ఇరు సంస్కృతులనూ ఆవహిస్తాయి. కనుక ఆ మార్పు ఆధిపత్య ఫలితంగా జరిగిననూ అది ఒక మేలైన ఫలితాన్నే ఇస్తుంది. ఇక ప్రగతి నిరోధ లక్షణాలు పైచేయి సాధిస్తాయి. అది ఒక తిరోగమన ఫలితాన్నిస్తుంది. అయితే ఈ రెండు ఆధిపత్యాల సందర్భాలలోను ప్రగతిశీల సంస్కృతి జరిపే ఆధిపత్యం లేదా అస్తిత్వ పోరాటం ప్రగతిశీల లక్ష్యం కోసం జరిగేది కాబట్టి ఒక ఆవశ్యకరూపంగాను, ప్రగతి నిరోధక సంస్కృతి చేసే ఆధిపత్యం లేదా పోరాటం ప్రగతిశీల స్వభావాన్ని దెబ్బతీసే లక్ష్యం కోసం కనుక ఒక ఉగ్రవాద రూపంగాను మానవ సముదాయం ముందుకు వస్తాయి. ఆ ఉగ్రవాదం సాంస్కృతిక ఉగ్రవాదంగా ప్రజల సంస్కృతుల మీద ప్రభావం చూపిస్తుంది.

**ఇటలీ, జర్మనీలలో సాంస్కృతిక ఉగ్రవాదం:**

పైన చర్చించిన సాంస్కృతిక ఉగ్రవాదం ఒక భౌగోళిక ప్రాంతంలోని జాతుల మధ్య ఏ విధంగా పనిచేస్తుందో, మానవ సంస్కృతుల హననానికి ఏ విధంగా పాల్పడుతుందో ఇటలీ, జర్మనీ ఉదాహరణలుగా చూద్దాం!

సాంస్కృతిక ఉగ్రవాదం మొదట తన సంస్కృతి పట్ల మితిమీరిన అభిమానాన్ని ప్రజలలో ప్రేరేపిస్తుంది. ఇటలీలో ముస్సోలిని కంటే ముందు పరిపాలించిన ఇటాలియన్ పార్లమెంటరీ ప్రభుత్వం వ్యవసాయ రంగానికి, కార్మికులకు ఎలాంటి అభివృద్ధిని అందించలేదు. దాంతో ప్రజలలో ప్రభుత్వం పట్ల నిరాశ ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో వలస రాజ్యాలను పొందేందుకు మొదటి ప్రపంచ యుద్ధంలోకి ఇటలీని దింపింది. కానీ యుద్ధం తర్వాత జరిగిన ఒప్పందాలు ఇటలీకి ఆశావహంగా లేకపోయేసరికి సోషలిస్టు భావాలు ప్రజలలో పెరిగాయి. ఇటలీ సమాజంలో అట్టడుగు వర్గాల్లో సోషలిస్టు చైతన్యం పెరుగుతూ వచ్చింది. ఓవైపు శ్రామికవర్గం సంస్కృతి మరోవైపు ఇటలీలో భూస్వాముల వలస రాజ్యాలను కోరుకునే పెట్టుబడిదారుల సంస్కృతి స్పష్టమైన విభజన రేఖను తీసుకునే వైపు ఆ చైతన్యం కొనసాగుతూ వస్తున్న సమయంలో పెట్టుబడిదారి వర్గమంతా ప్రజాస్వామ్య వ్యతిరేక సోషలిస్టు వ్యతిరేక ఉద్యమ నాయకత్వాన్ని కోరుకున్నారు. ముస్సోలిని నాయకత్వంలో సోషలిస్టు ప్రాతిపదికన అధికారానికి వచ్చిననూ ఆ తర్వాత ఆ సిద్ధాంతాన్ని వదిలిపెట్టి విపరీతమైన హింసతో, గూండాయిజంతో నియంతృత్వ ఏకఛత్రాధిపత్య అధికార

వ్యవస్థతో ముస్సోలిని ఇటలీలో తిరుగులేని నియంత అయ్యాడు. సోషలిస్టు చైతన్యాన్ని, చిగురిస్తున్న శ్రామికవర్గ సంస్కృతిని నాశనం చేశాడు. ఈ హామీని పొందింది కనుకనే అధికారాన్ని ముందు పెట్టుబడిదారి వర్గమంతా ముస్సోలినీని తీవ్రంగా బలపరిచింది.

అలాగే ఫాసిస్టు సంస్కృతిలో దేశాన్ని వృత్తి సంఘ సిండికల్ రాజ్యంగా మార్చడం ఒక దశ అని హామీ ఇచ్చి అధికారానికి ముందు ఫాసిస్టులు మధ్య తరగతి వర్గం, చిన్న స్థాయిలోని వృత్తుల ప్రజలు, దుకాణ యజమానులు మొదలైన పెటిబూర్జువా వర్గ మద్దతును కూడగట్టింది. ఓవైపు తమను పీడించే పెట్టుబడిదారి వర్గం ఫాసిస్టులకు మద్దతిస్తున్ననూ మధ్య తరగతి వర్గం అదే ఫాసిజాన్ని బలపరచే పరిస్థితి ఇక్కడి వైరుధ్యం. తర్వాత సామాజిక మేధావి వర్గంగా గుర్తింపుకోసం తాపత్రయపడే బొహిమీలు అనే మేధావులు ఫాసిజానికి ఆకర్షితులైనారు. జర్నలిస్టులుగా, కవులుగా, నాటక కర్తలుగా, ప్రచురణ కర్తలుగా గుర్తింపు కోరుకునే స్వార్థపూరిత ఈ బొహిమీలను ఫాసిజం చేరదీసింది. మరోవైపు దేశభక్తి, జాతీయవాదం అంటూ పదేపదే మాట్లాడే మాజీ సైనికోద్యోగులు వాలంటీర్లను ఫాసిజం తనవైపుకు తిప్పుకుంది. ఉద్యమాలంటే స్వతహాగానే నచ్చని సైన్యం కూడా మొత్తంగా ఫాసిజం వైపుకు వచ్చింది. ఆ విధంగా వివిధ వర్గాల మద్దతుతో ముస్సోలిని అధికారాన్ని పొందాడు. ఫాసిస్టులు అనుసరించిన సంస్కృతిలో మతానికి విధేయులుగా ఉన్నారు. అధికారంలోకి రాకముందు, వచ్చాక కొంతకాలం చర్చిపట్ల విధేయులుగా ఉన్నారు. కానీ ఆ తర్వాత ముస్సోలిని మతాన్నే తలదన్నే నియంతగా ఎదిగిపోయాడు. కేథలిక్ పార్టీని తొలగించే దశకు చేరుకున్నాడు. అంటే అతని ఫాసిజం ఇటలీకి ఏకవ్యక్తి నియంతృత్వాన్ని అందించింది.

ఈ చర్యలన్నింటిని ఫాసిస్టు సంస్కృతి అన్నాడు ముస్సోలిని. ఫాసిస్టు సాంస్కృతిక మూలాలు ఈ మితిమీరిన జాతిభావనలో ఉన్నాయని అన్నాడు. అందుకే ఈ సంస్కృతిని అమలుపరిచే క్రమంలో ఇటలీలో శ్రామికవర్గ సంస్కృతులు ధ్వంసమైనాయి. ప్రాచీన రోమ్ సామ్రాజ్య వైభవాన్ని పునరుద్ధరించాలని, అందుకు మొదటగా పరాయి భూములను ఆక్రమించుకుని వారి సంస్కృతులను ధ్వంసం చేయాలని ఫాసిస్టులు పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమం అంతటినీ ఉగ్రజాతీయవాద సంస్కృతిగా ఫాసిస్టు సంస్కృతిగా ముందుకు తెచ్చి ఇటలీలోని అన్ని ప్రజా సమూహాలు సాంస్కృతిక సమూహాలు దీన్ని ఖచ్చితంగా అనుసరించాలని లేకుంటే వారంతా ద్రోహులుగా పరిగణించబడి శిక్షించబడతారని హెచ్చరించారు. అట్లా ఫాసిజాన్ని

అనుసరించని సమూహాలపైన ఫాసిస్టులు హింసలకు, దాడులకు తెగబడ్డారు. అధికార బలంతో వారిని తీవ్రంగా అణగదొక్కారు. ఒక ప్రజా సమూహానికి ఫాసిజం తప్ప మరే విధమైన సాంస్కృతిక అస్తిత్వం లేనంతగా ఆ అణచివేత కొనసాగింది. సోషలిజం కమ్యూనిజం అనే మాటలే వినపడకూడనంతగా భయానక వాతావరణాన్ని ఫాసిజం ఇటలీలో సాంస్కృతిక ఉగ్రవాదాన్ని ప్రారంభించి కొనసాగించింది.

సరిగ్గా ఇదే సాంస్కృతిక సారూప్యతను నాజీజం కూడా ప్రదర్శించింది. సున్నిత మనస్కులైన జర్మన్‌లను తీవ్ర జాతీయవాద భావాలతో హిట్లర్ ఆకట్టుకున్నాడు. నేషనలిజానికి మిలటరీకి తేడా తొలగిపోయేంత తీవ్రంగా జాతీయవాద స్వరూపాన్ని హిట్లర్ మార్చివేశాడు. 1928–45 మధ్య జపాన్లో, ముస్సోలిని 'నాటి ఇటలీలో కూడా ఈ తేడాలు తొలగిపోయే పరిస్థితి ఏర్పడింది. 'జర్మన్ ప్రజలు స్వచ్ఛమైన ఆర్యజాతికి చెందినవారు. అలాంటివారు నివాస స్థలం లేక ఇబ్బందులు పడుతున్నారు.' అని మీన్‌కాంఫ్‌లో హిట్లర్ ప్రజలను రెచ్చగొట్టాడు. 'పరాయి వారి పట్ల శాంతి విధానం ప్రమాదకరమైంది. ఎందుకంటే అది జాతిని నిర్వీర్యం చేస్తుంది' అన్నాడు. జర్మన్ సర్వోన్నత జాతికోసం పరాయి జాతులను తుడిచిపెట్టే దుర్మార్గ పథకాలను హిట్లర్ రచించాడు. యూదులను అన్యజాతీయులని, హీనజాతీయులని చెప్తూ వారిని సంపూర్ణంగా నిర్మూలించాలంటాడు.

వేలాదిమంది యూదులపై హత్యలు, అత్యాచారాలకు పాల్పడ్డారు నాజీలు. యూరప్ సంస్కృతిని, యూరోపియన్ నాగరికతను రక్షించే పరిరక్షకులం తామేనంటూ కమ్యూనిజాన్ని దానికి శత్రువుగా చూపుతూ సోవియట్ యూనియన్ పైన దండెత్తారు. ఇటలీలో లాగానే దేశంపట్ల, అలాగే జాతిపట్ల తీవ్రజాతీయ భావాలను రెచ్చగొట్టారు. సంకుచిత భావాలను ప్రజలలో ప్రేరేపించారు. జాతీయవాదమంటే కేవలం మన జాతిపై ప్రేమ ఉండడమే కాదు, ఇతర జాతుల కంటే మన జాతే గొప్పదనే నిరూపణ ఉండాలని, అందుకు గాను ఇతర జాతులను నాశనం చేయమని ప్రచారం చేశారు. దేశం కోసమే వ్యక్తి ఉన్నాడు తప్ప వ్యక్తి కోసం దేశం కాదన్నారు. ఇది వ్యక్తి స్వేచ్ఛావ్యతిరేకవాదం.

ఇటలీలో ఫాసిస్టులు అధికారంలోకి రాకముందు మధ్య తరగతి వర్గంతో, చర్చితో రాజీ చేసుకుని అధికారానికి వచ్చాక వారిని శత్రువులుగా చూసినట్లే జర్మనీలో నాజీలు అధికారానికి ముందు సోషల్ డెమోక్రటిక్‌లు బలపడుతున్న దశలో జర్మన్ కమ్యూనిస్టులతో, సోవియట్ యూనియన్‌తో స్నేహం పెంచుకుని, అధికారం వచ్చాక

కమ్యూనిస్టులను శత్రువులుగా చెప్తూ హింసలకు గురిచేశారు. సెమెటిక్ జాతి సంస్కృతిని, దాన్ని అనుసరించే యూదులను జర్మనీ సమస్యలన్నింటికీ కారణంగా చూపి వారిపై నరమేధం సృష్టించారు. జర్మనీ పాడైపోవడానికి ఈ సంస్కృతే కారణమని నిందిస్తూ పూర్వ జర్మన్ సంస్కృతి పునరుద్ధరణ కోసం యూదు నిర్మూలన గావించాలంటూ జర్మనీలోనే కాక యూరప్ మొత్తంలోనూ లక్షలాది మంది యూదులను నాజీలు హత్యచేశారు. జర్మనీలో నాజీ పార్టీలో జీవితంలో విఫలమైనవారు, పురాతన సంపన్నవర్గాలు, పూజారులు, పట్టణ ప్రజలు, పెటిబూర్జువాలు, వర్తకులు మొదలైనవారు చేరారు. జర్మనీ సామాజిక వ్యవస్థలోని సమస్యలకు పరిష్కారాలుగా ఆత్మగౌరవం, వ్యక్తిపూజ, యూదు వ్యతిరేకత, కమ్యూనిస్టు వ్యతిరేకతలను చూపారు. నోర్డిక్ జాతి ఆర్య సంస్కృతిని జర్మనీ అంతా విస్తరించాలని, యూదు, స్లావ్, జిప్సి వంటి జాతులను రోమన్ కాథలిక్ మతాల వారిని సంహరించాలని నాజీలు పిలుపునిచ్చారు.

ఈ చర్యలన్నింటిని జర్మనీలో నాజీ సంస్కృతి పేరిట ప్రచారం చేసి ఇటలీలో వలెనే నాజి సంస్కృతిని వ్యతిరేకించిన వారిని నాజీలు క్రూరంగా చంపేవారు. జర్మనీలో నాజీ సంస్కృతి అంటే అన్యజాతుల వ్యతిరేకమైన ఆర్యజాతి సంస్కృతి.

ఇక్కడ ఒక ప్రధానమైన విషయాన్ని చెప్పుకోవాలి. వాస్తవానికి ఇటలీలో ఫాసిజానికి, జర్మనీలో నాజీజానికి స్వంతంగా సంస్కృతిగా ఏర్పడే ప్రాతిపదిక లక్షణాలు లేవు. అంటే సంస్కృతి పుట్టుకకు, పెరుగుదలకు, మనుగడకు, గమనానికి ఆధారభూతమైన లక్షణాలు వాటికి లేవు. అయినా వాటిని సంస్కృతులుగా చెప్తూ, ఆ సంస్కృతులను ఇతర సంస్కృతులకు శత్రువుగా చూపుతూ ఆ ఇతర సంస్కృతులను ధ్వంసం చేసే నిర్మూలించే కార్యాచరణగా సాంస్కృతిక ఉగ్రవాదాన్ని ఫాసిస్టులు నాజీలు ప్రయోగించారు. వారి కృత్రిమ సంస్కృతులు ఆయా పార్టీల సిద్ధాంతాలు, వ్యక్తులు నిర్దేశించిన సూత్రాలేనని ఆధునిక చరిత్రకారులు, సోషల్ ఆంత్రోపాలజిస్టులలో కొందరు భావిస్తున్నారు.

## సంఘ్‌పరివార్ సాంస్కృతిక ఉగ్రవాదం

ఫాసిజం, నాజీజంల వలెనే హిందూయిజం లేదా హిందుత్వలకు సహజ సంస్కృతి లక్షణాలు లేవు. ఒక ఉమ్మడి ప్రజా సమూహంగా ప్రజలు హిందూ ప్రజలుగా జీవించినట్లు చారిత్రక ఆధారాలు లేవు. ఈనాడు కూడా హిందూ సంస్కృతి అనే ఉమ్మడి సంస్కృతి లేదు. అందులో వివిధ కులాల, వృత్తుల, శ్రమల సంస్కృతులు

వేర్వేరుగా ఉన్నాయి గానీ అవన్నీ కలగలిసిన ఉమ్మడి హిందూ సంస్కృతి ఊహామాత్రమైనదే గానీ అస్తిత్వంలో మాత్రం ఎక్కడా ఏనాడు లేదు. కానీ సంఘ్ పరివార్ మాత్రం హిందూ సంస్కృతి గురించి మాట్లాడుతుంది. దాన్ని పరిరక్షించాలని గొడవలు చేస్తుంది. లేని సంస్కృతి కోసం దశాబ్దాలుగా మారణకాండలు సృష్టిస్తున్నది. ఇదంతా హిందూ సంస్కృతి ముసుగులో బ్రాహ్మణీయ సంస్కృతిని అమలుపరచడం కోసమేనని మనం గుర్తించాలి.

రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌ను 1925లో హెగ్డేవార్ స్థాపించాడు. కాంగ్రెస్ భావాలు నచ్చక బైటకు వచ్చి సావర్కర్ అతివాద బోధనలతో ప్రభావితమై ఆర్ఎస్ఎస్‌ను స్థాపించాడు. ఈ సావర్కర్ జిన్నాకంటే పదిహేనేళ్ల ముందే 1923లో ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. తర్వాత 1938లో గోల్వాల్కర్ సంఘ్ ప్రధాన కార్యదర్శిగా నియమించబడ్డాక ఈ సిద్ధాంతాన్ని బలపరిచాడు. ఈ సిద్ధాంతంలో ప్రధాన అంశం ఏమిటంటే హిందూ-ముస్లిం సంస్కృతులు పూర్తిగా వేర్వేరు సంస్కృతులు కనుక అవి కలసి ఉండలేవు అనేది ప్రధాన సూత్రీకరణ. అందుకుగాను హిందూ సంస్కృతి గురించి, 'హిందుస్తాన్‌లో జీవిస్తున్న పరాయి జాతులు అనివార్యంగా హిందూ సంస్కృతిని, భాషను అలవర్చుకోవాలి. హిందూజాతిని, సంస్కృతిని అంటే హిందూ జాతి ఘనతను కీర్తించడం తప్ప మరో ఆలోచనే వారు మనసులోకి రానివ్వకూడదు. వారందరూ హిందూ జాతిలో విలీనమయ్యేందుకు వీలుగా తమ ప్రత్యేక అస్తిత్వాలను విడనాడాలి. ఈ దేశంలో వారు జీవించాలంటే పూర్తిగా హిందు జాతికి లోబడి ద్వితీయ శ్రేణి పౌరులుగా ఎలాంటి హక్కులు, అధికారాలు, గుర్తింపులు, చివరకు పౌరహక్కులు కూడా అడగకుండా బతకాలి. వారికి అంతకంటే గత్యంతరం లేదు. మనది అత్యంత ప్రాచీన జాతి.

అందువల్ల మనదేశంలో నివసించే పరాయి జాతుల పట్ల ప్రాచీన జాతులు వ్యవహరించాల్సిన విధంగా వ్యవహరిద్దాం' అన్నాడు. ఈ క్రమంలో ఆయన తమ సంస్థ ముస్లింలను సమూలంగా నిర్మూలించాలని జర్మనీ ఉదాహరణగా చెప్పాడు. 'తన జాతి సంస్కృతుల పవిత్రతలను కాపాడుకునేందుకు గాను జర్మనీ మధ్య ప్రాచ్య జాతీయులైన యూదులను సమూలంగా నిర్మూలించి ప్రపంచానికి దిగ్భ్రాంతి కలిగించింది. అది అత్యున్నత స్థాయిలో జాతీయాభిమానాన్ని ప్రదర్శించిన అంశం ఇదే. అనేక ప్రాథమికాంశాలలో తేడాలున్న జాతులు ఒక దేశంలో కలసిమెలిసి ఐక్యంగా ఉండడం అసాధ్యమని జర్మనీ చక్కగా నిరూపించింది. మనం కూడా ఈ గుణపాఠాన్ని అనుసరించి లబ్ధి పొందవలసి ఉంటుంది.'

అంటే ఆర్‌ఎస్‌ఎస్, సంఘ్ పరివార్ దృష్టిలో సంస్కృతి అంటే హిందూ సంస్కృతే, ముస్లింలను సమూలంగా నిర్మూలించే సంస్కృతే, ఆ సంస్థల ఆచరణీయ సంస్కృతి అని చాలా స్పష్టంగా చెప్పుకున్నారు. అంతేగాక ముస్లింలను ఏ కోశాన సమర్థించిననూ అలాంటి వ్యక్తులను నిర్మూలించే సంస్కృతి సంఘ్ పరివార్‌ది. దేశ విభజన సమయంలో గాంధి ముస్లింలకు మద్దతిచ్చాడనే ఆరోపణతో గాంధీని కాల్చి చంపారు. వల్లభ్‌భాయ్ పటేల్ శ్యాంప్రసాద్ ముఖర్జీకి రాసిన లేఖలో 'గాంధిని ఆర్‌ఎస్‌ఎస్ చంపిందనడానికి నా దగ్గర ఆధారాలున్నాయి' అని రాశాడు. గాంధీ హత్య సందర్భంగా ఆర్‌ఎస్‌ఎస్ స్వీట్లు పంచుకున్నది. డెబ్బై ఏళ్ల తర్వాత ఇవ్వాళ గౌరీలంకేశ్‌ను చంపి కూడా స్వీట్లు పంచుకున్నది. అధికారికంగా, చట్టబద్ధంగా మనుషులను నిర్మూలించే స్థాయికి చేరడం ఈ హత్యా సంస్కృతిలో ఆర్‌ఎస్‌ఎస్ సాధించిన దుర్మార్గమైన పరిణతి.

మొదటి నుంచీ ఆర్‌ఎస్‌ఎస్, సంఘ్ పరివార్‌లు అనేక చారిత్రక వక్రీకరణలతో వాదిస్తున్నదేమిటంటే ఈ దేశం హిందువులదేనని. తవ్వకాల్లో సింధు నాగరికత ఆనవాళ్లు బయటపడే నాటిదాకా భారతదేశ చరిత్ర ఆర్య నాగరికతతోనే ప్రారంభమయ్యేది. కానీ ఆర్య నాగరికత కంటే ముందే అభివృద్ధి చెందిన నాగరికతగా సింధు నాగరికత నిదర్శనాలు బయటపడ్డాక కూడా ఆర్‌ఎస్‌ఎస్ సంఘ్ పరివార్‌లు తమ ఆలోచనా సరళిని మార్చుకోలేదు. పైగా సింధు ప్రజలు కూడా ఆర్యులేనన్నారు. ఆర్యుల వలస సిద్ధాంతాన్ని అంగీకరించకుండా ఈ దేశస్తులే అయిన ఆర్యులు బయటి ప్రాంతాలకు వెళ్లి మళ్లీ తిరిగివచ్చారని బుకాయించారు.

ఈ దేశం ఆర్యుల, హిందువుల మూల నివాసం కనుక ఇప్పుడు కూడా ఈ దేశం హిందువులదేనని, ఇతరులకు ఇక్కడ చోటు లేదని వాదిస్తున్నారు. కాలమధ్యంలో దండెత్తిన ముస్లిం రాజుల వల్ల ఈ దేశ సంస్కృతి, వారసత్వాలు దెబ్బతిన్నాయని వాటిని తిరిగి స్థాపించేందుకు దేశంలో ఉన్న ముస్లిం సంస్కృతిని, వారసత్వాలను నిర్మూలించే పని ప్రారంభించాలని చూస్తున్నారు. ఈ దేశంలోనే పుట్టి ఆర్య బ్రాహ్మణతత్వాన్ని హిందూ మతాన్ని ప్రశ్నించిన బౌద్ధాన్ని జైనాన్ని హిందు అవతారాలలో ఒక అవతారంగా మార్చేశారు. ఇదీ సంఘ్ పరివార్ సంస్కృతి. వాస్తవాలతో సంబంధం లేకుండా చరిత్ర హిందువులదేనని దబాయించడం, వీలున్న ప్రతిచోట ఆ వాస్తవాలను తమకనుకూలంగా మార్చివేయడం. ప్రతిచోటా ఇదే ఫార్ములా.

అసలు ఇస్లాం, క్రైస్తవ బౌద్ధ మతాల లాగా హిందూ సంస్కృతి స్వతంత్రమైన సంస్కృతి కాదు. ఇందులో ఒకే ఒక హిందూ సంస్కృతి అనే సింగిల్ ఐడెంటిటి రూపం లేదు. ఎందుకంటే హిందూ మతంలో కులాలున్నాయి. ఆ కులాలకు స్వంత అస్తిత్వాలున్నాయి. స్వంత సంస్కృతులున్నాయి. కానీ ఈ కులాలన్నీ కలిసి ఆ కులాలన్నింటికీ ఉమ్మడిగా ఒక సారూప్య సంస్కృతిని సృష్టించుకోవడం అనేది ఎక్కడా జరగలేదు. అందుకే హిందూ మతానికి ప్రామాణిక సంస్కృతి ఏది? అని ప్రశ్నించుకున్న ప్రతిసారి వాళ్ల సాహిత్యం, చరిత్ర స్పష్టంగా చెప్తున్న సమాధానం – బ్రాహ్మణీయ సంస్కృతి అని. అంటే ఉన్న కులాల్లోనే ఒక కులం సంస్కృతి, మొత్తం హిందు మతం సంస్కృతిగా స్థిరీకరించబడింది. అసలైతే దీన్ని విపులంగా చెప్పుకోవాలి.

బ్రాహ్మణీయ సంస్కృతి సమాజంలో స్థిరపడిన తర్వాత వాళ్లు దూరంగా ఉంచిన ఇతర ప్రజా సమూహాలు వాళ్ల జీవన విధానాల ఆధారంగా కాలక్రమంలో స్వతంత్ర సంస్కృతులను ఏర్పరచుకున్నాయి. అవి శ్రమ సంస్కృతులు, ఉత్పత్తి సంస్కృతులు అయ్యాయి. సహజంగానే తమను బానిస సంస్కృతులుగా మార్చిన సంస్కృతిని అవి ప్రశ్నిస్తున్నాయి. తిరుగుబాటు చేస్తున్నాయి. ఇక్కడ చెప్పుకోవాల్సిందేమిటంటే బ్రాహ్మణీయ సంస్కృతి హిందూ మతానికి మూల సంస్కృతిగా మారినప్పటి నుండి ఇతర సంస్కృతులను దెబ్బకొట్టడానికి సాంస్కృతిక ఉగ్రవాదాన్ని ప్రయోగిస్తూ వచ్చింది. వాటిని అనాగరిక సంస్కృతులుగా ప్రచారం చేస్తూ ఆ సంస్కృతిలో భాగాలైన కట్టుబాట్లు భాష, సాంప్రదాయాలు, ఆహార అలవాట్లు వంటి ప్రతిభాగంపైనా అంటరాని ముద్రవేసి ఆ సంస్కృతులను వెలివేసి వాటిని ఎదగనీయకుండా వాటన్నింటిపైనా బ్రాహ్మణీయ సంస్కృతి ఆధిపత్యం నిరంతరం ఉండేలా చూడడానికి సాంస్కృతిక ఉగ్రవాదాన్ని హిందూ సంస్కృతి సాధనంగా చేసుకుని వాడుతూ వచ్చింది. ఇప్పటికీ ఆ సాంస్కృతిక ఉగ్రవాదం అనేక రూపాలలో కనిపిస్తూనే ఉన్నది.

ఏనాడూ ఉత్పత్తిలో పాల్గొనని వర్గం ఉత్పత్తి సాధనాలను గుప్పెట్లో ఉంచుకుని సామాజిక ఆధిపత్యం నెరపుతున్న క్రమంలో ప్రజా సమూహాలు మిగతావి మనుగడకోసమే పోరాటాలు చేస్తుండడం వల్ల వాళ్ల సంస్కృతులు విస్తరించడానికి, అద్భుతమైన వృత్తి, కుల సంస్కృతులు మరింత ఉజ్వలంగా మారడానికి అవకాశం లేకుండా పోయింది. ఈనాటికీ వాళ్లవి దాదాపు అస్తిత్వ పోరాటాలే కావడంతో ఇంకనూ ఆ సంస్కృతులపై ఆధిపత్యం కొనసాగుతూనే ఉంది.

అందుకే ఈరోజు ఆవు సాంస్కృతిక ఉగ్రవాదాన్ని అమలుపరిచే సాధనం అయింది. పవిత్రత పేరుతో సాంస్కృతిక ఉగ్రవాదం స్వామీజీలు, బాబాలు, విశ్వహిందూ పరిషత్, ఆర్ఎస్ఎస్‌ల రూపంలో బట్టబయలవుతున్నది. నిజ జీవితంలో ఆవు, ఎద్దులతో మమేకమైన ప్రజల వ్యవసాయ పశు సంబంధిత సంస్కృతులను పవిత్రత అనేది సాంస్కృతిక ఉగ్రవాద సాధనంగా దెబ్బకొడుతూ వస్తున్నది. తాము చెప్పినట్లే చరిత్రను రికార్డు చేసుకోవాలనే నియంతృత్వ ధోరణి ఓవైపు ప్రదర్శిస్తూనే సాంస్కృతిక ఉగ్రవాదంలో భాగంగా చరిత్రను తప్పుగా వక్రీకరించి రాస్తూ వస్తున్నారు.

అల్లాఉద్దీన్ ఖిల్జి ముస్లిం కనుక అతన్ని చరిత్రలో తక్కువ చేసి చూపడానికి చరిత్రలో లేని పద్మావతి అనే రాణిని సృష్టించి పుస్తకాలు రాసి ఆ పాత్రను సినిమాలో ఎలా చూపించాలో మేమే నిర్ణయిస్తామంటూ, మాట వినకుంటే ముక్కులు కోస్తామని, తలలకు కోట్ల రూపాయల వెలలు నిర్ణయించి తెగకోస్తామని బెదిరిస్తున్నారు. తమకు వ్యతిరేకంగా తీసే ఏ సినిమాను ఆడనివ్వబోమని బెదిరిస్తున్నారు. సెన్సార్ పూర్తయిన మెర్సల్ సినిమాకు రీసెన్సార్ చేయాలని దాడులకు దిగారు. ఇదేమిటని ప్రశ్నించిన కమల్‌హాసన్, ప్రకాశ్‌రాజ్ లాంటి వాళ్లను చంపుతామని బెదిరిస్తున్నారు.

ఇక ముస్లింలు కట్టిన కట్టడాలైతే ఆ ప్రతికట్టడం వెనుకా ఒక గుడి చరిత్రను సృష్టించి ఈ కట్టడాలను కూలగొడతామంటున్నారు. తాజ్‌మహల్‌ను తేజోమహాలయంగా పదే పదే చెప్తూ గోబెల్స్‌లాగా అబద్ధాన్ని నిజం చేద్దామనుకున్న ఉదంతాన్ని ఇటీవల మనం చూసి ఉన్నాం. ముస్లిం ప్రార్థనా స్థలాలు వేటినీ వదలబోమని అయోధ్యలో బాబ్రీ మసీదు తరహాలోనే మధుర, వారణాసిల్లోని మసీదులను కూలగొడతామని బాహాటంగా చెప్తున్నారు. ఆక్రమించుకున్న దేశం ముస్లింలది, ఆక్రమిత ప్రాంతంలో ప్రజలు ముస్లింలే కనుక వాళ్ల దృష్టిలో దేశానికి అతిపెద్ద సమస్య కశ్మీర్ సమస్య అయింది. చదివే పిల్లలు ముస్లిం పిల్లలు కనక మదరసాలను నిషేధించాలంటున్నారు.

ఈ సాంస్కృతిక ఉగ్రవాదం విస్తృతమవడానికి అధికారం తోడ్పడుతూ రావడాన్ని కూడా మనం గమనించాల్సి ఉంది. హిందూ సంస్కృతిలో ప్లాస్టిక్ సర్జరీలు ఉన్నాయంటూ గణపతిని చూపిస్తాడు సాక్షాత్తు ప్రధానమంత్రి. స్టెమ్‌సెల్స్ విజ్ఞానం ఉందంటూ వందమంది కౌరవులను చూపిస్తాడు. ఇవి మూఢ విశ్వాసాలని వాళ్లకు ఏ కోశానా అనిపించవు.

యోగి ఆదిత్యనాథ్ ముఖ్యమంత్రి కాకముందే ఎంపిగా ఉన్నపుడే గోరఖ్‌పూర్‌లోని మియాబజార్‌ను మయాబజార్‌గా, ఉర్దుబజార్‌ను హిందీ బజార్‌గా, అలీనగర్‌ను ఆర్యనగర్‌గా పేర్లు మార్చివేశాడు. 'బానిసత్వాన్ని గుర్తు చేసుకునే చిహ్నాలు నా నియోజకవర్గంలో ఉండడానికి వీల్లేదు' అన్నాడు. ముఖ్యమంత్రి అయ్యాక తాజ్‌మహల్‌ను ఏకంగా పర్యాటక స్థలాల జాబితాలోంచే తొలగించి పారేశాడు. ఈయనను రేపటి ప్రధానమంత్రి అభ్యర్థి అంటున్నారు. టిప్పుసుల్తాన్‌ను, అక్బర్, షాజహాన్‌లను ఇంకా చెప్పాలంటే దేశంలోని ఏ ముస్లిం పాలకుడినైనా రేపిస్టు అనో, హంతకుడనో నిందిస్తూ తప్పుడు ప్రచారాలు చేస్తూ వస్తున్నారు. దేశంలో ఇన్ని మతాలుండగా హిందు మత గ్రంథమైన భగవద్గీతను జాతీయ గ్రంథంగా చేస్తామంటున్నారు.

సమస్యలను పరిష్కరించాల్సిన కోర్టులను అప్రధానం చేస్తూ రవిశంకర్ లాంటి వాళ్లకు అయోధ్యలాంటి సమస్యలను అప్పగిస్తున్నారు. మరోవైపు సాంస్కృతిక రంగంలో ప్రత్యామ్నాయ సంస్కృతుల కోసం కృషి చేస్తున్న దభోల్కర్, గోవింద్ పన్సారే, కల్బుర్గీ, గౌరీలంకేష్ లాంటి వాళ్లను చంపేస్తున్నారు. పెరుమాళ్ మురుగన్, కంచ ఐలయ్య లాంటి వారిపై భౌతికదాడులకు దిగుతున్నారు.

ప్రజలు పేదరికంలో మగ్గినా, సమాజంలో అంతరాలు పెరుగుతున్నా నిరుద్యోగం, ఆకలి చావులు, హక్కుల హననాలు, హింసలు, అణిచివేతలు ఎన్ని ఉన్నా దేశమంటే ప్రేమ, భక్తి ఉండాల్సిందేనని, దేశభక్తి వదులుకోవడానికి వీలుకాని, ప్రశ్నించడానికి వీలులేనిదిగా ఉండాలని, ఉంటుందని మితిమీరిన దేశభక్తిని నిరంకుశంగా ప్రజల మీద రుద్దుతున్నారు. తాము చెప్పినట్లు చెప్పినచోట్ల ప్రదర్శించేదే దేశభక్తి అంటున్నారు. సినిమా హాళ్లలో తప్పనిసరిగా జనగణమన పాడాలని, లేచి నిల్చోవాల్సిందేనని అంటున్నారు. అట్లా చేయకపోతే మీదపడి కొడుతున్నారు. తాము నిర్దేశించిన సంస్కృతినే స్త్రీలైనా, దళితులైనా అనుసరించి తీరాలని తమ హిందూ మతంలోని వివిధ సెక్షన్‌ల ప్రజలపై ఒత్తిడి తెస్తూ, అంగీకరించకపోతే దాడులకు దిగుతున్నారు.

స్త్రీల పట్ల వీళ్లకు ఎంత చులకన భావమంటే, స్త్రీలకు అసలు వ్యక్తిత్వమే లేదని, వాళ్లు బానిసలని చెప్తుంటారు. మోహన్ భగవత్ అంటాడు – 'అత్యాచారాలు పల్లెటూర్లలో జరగవు. పట్నాల్లో జరుగుతాయి. ఎందుకంటే పట్నాలలో ఆడవాళ్లు రెచ్చగొట్టే దుస్తులు ధరిస్తారు కాబట్టి. ఈ మాటలను పట్టుకొని రెచ్చగొట్టే దుస్తులే

రేప్‌లకు కారణమని అరుస్తూ ఆధునిక దుస్తులు ధరించే అమ్మాయిలపై దాడులకు దిగుతారు హిందూ ఉన్మాదులు. ఎంత దారుణం ఇది? వస్త్రధారణపైనా ఇంత మోరల్ పోలిసింగా? ఇదే మోహన్ భగవత్ మరోసారి అంటాడు – 'భార్య భర్తల మధ్య ఉండే సోషల్ కాంట్రాక్ట్‌లో భాగంగా ఆడవాళ్ల పని మగవాళ్లకు సేవలు చేస్తూ గృహిణిగా ఉండడం' అని. హిందూ ధర్మాన్ని బోధించే వాళ్లూ ఇలాగే మాట్లాడతారు. 'ఆడవాళ్ల పని మగవాళ్ల తుండు గుడ్డలు పిండడం' అంటాడు చాగంటి కోటేశ్వర్రావు. ఎంత దిగజారుడు మాటలు ఇవి? పద్మావతి సినిమా గురించి మాట్లాడమంటే, 'ఫిల్మ్‌మేకర్‌ల భార్యలు రోజుకో భర్తను మారుస్తారు' అంటాడు రాజస్థాన్ ఎంపి చింతామణి మాలవ్య. ఇట్లా అనడం తప్పుకదా అంటే, 'నిజమే! తెలుగు సినిమాల వాళ్ల భార్యలూ అంతే' అంటాడు రాజాసింగ్. ఇవి మీడియా చర్చలో పాల్గొని చెప్పిన మాటలు.

ఆర్ఎస్ఎస్. విహెచ్‌పి వాళ్ల ప్రకారం స్త్రీ పురుషులు ఒకరినొకరు ఇష్టపడకూడదు, ప్రేమించుకోకూడదు. అది మన సంస్కృతి కాదంటారు. వాలంటైన్స్ డే రోజు పార్కుల వెంటపడి, సినిమా హాళ్ల వెంటపడి దాడులు చేస్తుంటారు. ఒకవేళ తప్పనిసరిగా ప్రేమించాల్సి వస్తే ముస్లింలను మాత్రం ప్రేమించకూడదంటారు. దానికి లవ్ జిహాద్ అని పేరుపెట్టి దాడులు చేస్తారు, కేసులు పెడతారు.

ఆవుకు పవిత్రతను జోడించి ఆవును ముట్టుకోవడానికి వీల్లేదంటారు. తరతరాల వృత్తిలో భాగంగా దళితులు తోలు పనులు చేస్తుంటే గో హత్య చేశారనే కారణం చూపి వాళ్లను హత్య చేస్తారు. ఉనాలో చూసి ఉన్నాం. కేరళలో పినరయి విజయన్ దళితులను ఆలయ పూజారుల పోస్టులలో నియమిస్తే రాద్ధాంతాలు చేశారు. దళితుల పట్ల వీళ్ల కన్‌సర్న్ ఇది. వీళ్లు అధికారంలో ఉన్న ఛత్తీస్‌గడ్‌లో తొలకరి పండుగ జరుపుకుంటున్న ఆదివాసుల మీద మావోయిస్టులకు సహకరించారనే కోపంతో కాల్పులు జరిపించారు. బాసగూడ లాంటి మారణహోమాలు తరచూ జరుపుతుంటారు. స్త్రీని కేవలం లింగపరంగానే చూస్తూ ఆ రాష్ట్రంలో ఆదివాసులపై అత్యాచారాన్ని అణచివేత సాధనంగా వాడుతుంటారు. వీళ్లు నమ్మే, ఆచరించే సంస్కృతే అంటరానితనాన్ని సృష్టించింది. సామాజిక అసమానతలను, వివక్షలను సృష్టించింది. కాలానుగుణంగా మారకుండా వీళ్లు ఇంకా అదే సంస్కృతిని ఆచరిస్తున్నారు. అదే సంస్కృతిని నిలబెట్టాలని ప్రయత్నిస్తున్నారు. అందుకోసం దొంగదారులను ఆశ్రయిస్తున్నారు. ఆదివాసి సంస్కృతులకు ప్రతిరూపమైన సమ్మక్క – సారలమ్మలను

అమ్మవారి అంశలుగా ఈ మధ్య ప్రచారం ప్రారంభించారు. జాతర గద్దెల దగ్గర కొబ్బరికాయలు, కుంకుమలు, అగరుబత్తుల సంస్కృతిని తీసుకువచ్చారు. దళిత ప్రత్యామ్నాయ సంస్కృతిని దెబ్బతీయడానికి హిందూ సంస్కృతిని వ్యతిరేకించిన అంబేడ్కర్ లాంటివాళ్లను హిందుత్వ శక్తులు తమలో కలుపుకోవడానికి చూస్తున్నాయి.

ఇదంతా చెప్పే ఉద్దేశం ఏమంటే పరాయి సంస్కృతులను, బ్రాహ్మణేతరుల సంస్కృతులను సంఘ్‌పరివార్ ఏ విధంగా ద్వేషిస్తున్నది, వాటిని నియంత్రించి, గుప్పెట్లో పెట్టుకుని సమాజంపై బ్రాహ్మణీయ సంస్కృతిని రుద్దడానికి ఏ విధంగా ప్రయత్నిస్తున్నది, ఈ పనులను భయోత్పాతంతో ఏ విధంగా సాధిస్తున్నది అనే విషయాన్ని మనం గమనించాలి. సాంస్కృతిక ఉగ్రవాదానికి భౌతిక దాడులను జోడించి వాళ్ల కుట్రలను అర్థం చేసుకోవాలి.

ఒక్క మాటలో చెప్పాలంటే సంఘ్ పరివార్ ఈ దేశాన్ని హిందూ దేశంగా మార్చాలనుకుంటున్నది. ఈ దేశాన్ని హైందవీకరించాలనుకుంటున్నది. బ్రాహ్మణీకరించాలనుకుంటున్నది. అందుకుగాను సాంస్కృతిక ఉగ్రవాదాన్ని ప్రోత్సహించి బ్రాహ్మణేతర సంస్కృతులను నిర్మూలించాలని చూస్తున్నది. ఈ లక్ష్య సాధనకు ఇప్పుడు అధికారాన్ని వాడుకుంటున్నది. ఈ నిర్మూలించే లక్ష్యంలోనే రోహిత్ వేముల లాంటి వాళ్లు బలైపోయారు. కన్నయ్య కుమార్, ఉమర్ ఖలీద్ లాంటి వాళ్లు అక్రమ కేసుల బారిన పడ్డారు. మహ్మద్ అఖ్లాక్, జునైద్ లాంటివాళ్లు చంపబడ్డారు. గుర్‌మెహర్‌కౌర్ లాంటివాళ్లు బెదిరింపులకు గురయ్యారు. అయితే ఇటలీ జర్మనీల లాగా మితిమీరిన మత అహంకారాన్ని, కుల అహంకారాన్ని ప్రదర్శిస్తూ పోతున్న సంఘ్‌పరివార్, దాన్ని పట్టుకు వేలాడుతున్న వాళ్లు చివరకు హిట్లర్, ముస్సోలినిలాగా పతనం కాక తప్పదనేది చరిత్రలో రేపు నిరూపించబడే సత్యం.

**(డిసెంబర్ 2017, వీక్షణం పత్రిక నుండి...)**



# 15. మన సంస్కృతి

**– కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్** (అభ్యుదయ కవి)

మన సంస్కృతి నశించిపోతూందన్న
మన పెద్దల విచారానికి
మనవాడు పిలకమాని క్రాఫింగ్ పెట్టుకున్నాడనేది ఆధారం
మనగలిగినదీ
కాలానికి నిలబడ గలిగినదీ వద్దన్నా పోదు
మరణించిన అవ్వ నగలు
మన కాలేజీ అమ్మాయి ఎంత పోరినా పెట్టుకోదు
యుగయుగానికీ స్వభావం మారుతుంది
అగుపించని ప్రభావానికి లొంగుతుంది
అంతమాత్రాన మనని మనం చిన్నబుచ్చుకొన్నట్లు ఊహించకు
సంతత సమన్వయావిష్కృత వినూత్న వేషం ధరించడానికి జంకకు
మాధుర్యం, సౌందర్యం, కవితా
మాధ్వీక చషకంలో రంగరించి పంచిపెట్టిన
ప్రాచేతస కాళిదాస కవిసమ్రాటులనీ,
ఊహా వ్యూహోత్కర భేదనచణ
ఉపనిషదర్థ మహోదధినిహిత మహిత రత్నరాసుల్నీ
పోగొట్టుకునే బుద్ధిహీనుడెవరు?
ఎటొచ్చీ
విధవలకీ వ్యాకరణానికీ మనుశిక్షాస్మృతికీ గౌరవంలేదని
వీరికి లోపల దిగులు
వర్తమానావర్త ఝంఝూవీచికలికి కాళ్ళు తేలిపోయే వీళ్ళేం చెప్పగలరు?
అందరూ లోకంలో శప్తులూ పాపులూ
మనం మాత్రం భగవదంశ సంభూతులమని వీరి నమ్మిక
సూర్యుడూ చంద్రుడూ దేవతలూ దేవుళ్ళూ
కేవలం వీరికే తమ వోటిచ్చినట్లు వీరి అహమిక

ఇది కూపస్థమండూకోపనిషత్తు
ఇది జాతికీ ప్రగతికీ కనబడని విపత్తు
మన వేషం, మన భాషా, మన సంస్కృతీ,
ఆదినుండీ, ద్రవిడ బర్బర యవన తురుష్క హూణుల నుండీ,
ఇచ్చినదీ పుచ్చుకున్నదీ ఎంతైనా ఉన్నదనీ,
అయిదు ఖండాల మానవ సంస్కృతి
అఖండ వసుధైక రూపాన్ని ధరిస్తోందనీ,
భవిష్యత్ సింహద్వారం
తెరుస్తోందనీ,

గ్రహించలేరు పాపం వీరు
ఆలోచించలేని మంచివాళ్ళు
ఏ దేశ సంస్కృతి అయినా ఏనాడు కాదొక స్థిరబిందువు
నైక నదీనదాలు అదృశ్యంగా కలిసిన అంతస్సింధువు.

**(అమృతం కురిసిన రాత్రి కవితా సంపుటి నుండి...)**



*"ఈ దేశం నుంచి కొందరు విచిత్రమైన అవకాశాల్ని, అంతులేని వనరుల్ని లాగేసుకున్నారు.. విజ్ఞానమంతా తమ సొత్తైనట్లు కులం దుప్పటి కప్పుకొని, కులం కత్తి పట్టుకుని పాలించారు. ప్రాణాలు తీశారు... సమస్త కళలకి వేదఘోష బాల్చీ తన్నేసి యూరోపియన్ గీతాల్లో భాష్యాలు మొదలయ్యాయి... సాహిత్యం ఇట్టా ఉంటుంది. చిత్ర లేఖనం అట్టా ఉంటుంది. నాటకం అంటే ఇది. అది మరోలా ఉండదు. తీర్మాణాలు మొదలయ్యాయి. తీర్పులు వెలువడ్డాయి. కొందరు ఆకాశానికి ఎత్తబడ్డారు. కొందరు పాతాళంలోకి తొక్కబడ్డారు."*

# 16. సంస్కృతం - సంస్కృతి

**- కీ.శే. నార్ల వెంకటేశ్వరరావు** (మానవవాద పాత్రికేయులు)

ఇవి కేవలం పర్యాయపదాలైనట్టు, ఇటీవల కొందరు వీటిని వాడుతున్నారు. ఒకే ధాతువు నుంచి పుట్టిన కారణాన, వీటికి కొంత ధ్వని సామ్యం కలదనుకోండి. అంతమాత్రం చేత ఇవి సమానార్ధకాలు కాగలవా? ఆహారం, విహారం, ప్రహారం, సంహారం, పరిహారం వీటికి ధాతువొక్కటే. వీటి మధ్య ధ్వని సామ్యం సైతం కొంతవరకు లేకపోలేదు. అందుచేత వీటిని పర్యాయాలుగా ప్రయోగిస్తాననే వ్యక్తిని మూర్ఖుని కింద జమకట్టి, లోకం నవ్వదా? కాని, చిత్రమేమంటే, సంస్కృతమే సంస్కృతి అయినట్టు కొందరు వాదిస్తున్నారు. సంస్కృత భాషా ప్రచారమే సంస్కృతి పునరుద్ధరణ కాగలదని ఉద్ఘాటిస్తున్నారు. మరింత ముందుకు వెళ్ళి, సంస్కృతాన్ని యావద్భారతానికి అధికార భాషగా, అనుసంధాన భాషగా నిర్ణయించాలని ప్రచారం చేస్తున్నారు. గత శతాబ్ది ప్రారంభంలోనే రాజా రామమోహన రాయ్ ఖండించిన ఈ ప్రచారం ఈనాటికైనా నిలిచిపోకపోవడం మన సంస్కృతి దౌర్భాగ్యం : అంతకు మించి, మన దేశ దౌర్భాగ్యం.

ఏదో ఒక భాషపై ప్రత్యేకాభిమానం వుండడంలో తప్పులేదు. అది మృతప్రాయమైవుంటే, దాని పునరుద్ధరణకు దీక్ష వహించడంలోనూ తప్పులేదు. కాని, ఆ భాషపై మనకున్న ప్రేమ గౌరవాల కొద్దీ, సంస్కృతికి అదే విధానమని చెప్పడం తగదు. భాషా ప్రభావం సంస్కృతిపై విశేషంగానే పడుతుంది. కాని, అంతమాత్రంచేత భాషే సంస్కృతి కాదు. భాషకే కాక, భౌగోళిక, వాతావరణ పరిస్థితులకు సైతం సంస్కృతి స్వరూప స్వభావాల నిర్ణయంలో ఎన్నదగు ప్రాధాన్యం వుంటుంది. ప్రాచీన గ్రీక్ చరిత్ర కొరకు హేరొడోటస్ వ్రాసినట్టు ఈజిప్టు దేశమే "నైల్‌నది వరప్రసాదం". మన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఒకానొక సందర్భంలో వివరించినట్టు, అరేబియా సంస్కృతిపై అక్కడి ఎడారుల, అక్కడి ఎండమావుల ప్రభావం వలె, ఇండియా సంస్కృతిపై ఇక్కడి హిమాలయాల, ఇక్కడి మహానదుల ప్రభావం స్పష్టంగా కనపడుతుంది. హిమాలయాలలో (మన పౌరాణికులు ఊహాకల్పన చేసిన) మన కైలాసం వున్నది. కైలాసనాథుడు హిమవంతునికి సాక్షాత్తు జామాత. దేవ, గంధర్వ, యక్ష, సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, విద్యాధరాంగనలకు హిమాలయ ప్రాంతమే క్రీడాస్థలం. అక్కడనే అలకాపురి వున్నది. ఆ కుబేరపురిలో

వియోగ ఖిన్నయైవున్న తన జీవితేశ్వరికే ప్రవాసభారతంతో క్రుంగి కుమిలిపోతున్న యక్షుడు రామగిరి నుంచి "మేఘ సందేశం" పంపించాడు. సింధు, గంగా, యమునలకు జన్మస్థానం హిమాలయాలే. హరప్పా, మొహెంజదారోలు, ఇంద్రప్రస్థ, పాటలీపుత్రలు, వారణాసి ప్రయాగలు, ఢిల్లీ, ఆగ్రాలు – ఆ నదీ తీరాలలోనో, వాటి లోయలలోనో విలసిల్లిన మన జాతీయ సంస్కృతీ కేంద్రాలు. తక్కిన మన నదులకైనా మన జాతీయ సంస్కృతి చరిత్రలో ఇంతకంటె తక్కువ స్థానం లేదు. బౌద్ధ శిల్ప కళ మహోన్నత శిఖరాల నందుకొన్నది కృష్ణానదీ పరిసరాలలో. ఆంధ్ర మహాభారత రచనకు "శ్రీకారం" చుట్టబడింది గోదావరి గట్టున; "ఓం తత్సత్" వ్రాయబడింది పెన్నానది ఒడ్డున. విజయనగర సామ్రాజ్య సంస్థాపన జరిగింది తుంగభద్రతీరాన. తమిళనాడు గుండానే కాక, తమిళ జీవితాల గుండా కూడా కావేరీ తామ్రపర్ణిలు ప్రవహిస్తున్నాయి. హిమాలయాలు మన దేశాన్ని తక్కిన ఆసియా ఖండం నుంచి వేరు చేస్తున్నట్టే, వింధ్యాచలాలు తక్కిన దేశం నుంచి దక్షిణాపథాన్ని విడగొడుతున్నాయి. ఈ నైసర్గిక ప్రతిబంధకాలకు అతీతమైన జాతీయ సంస్కృతిని ఏ విధంగా రూపొందించుకొనడ మనేదే ప్రాచీన కాలం నుంచీ మనల నెదుర్కొంటున్న పెద్ద సవాలు.

మన మనఃప్రవృత్తిపై మన సంస్కృతిపై మన దేశం శీతోష్ణస్థితుల ప్రభావమైనా సామాన్యమైంది కాదు. మనది ఉష్ణోగ్రత గల దేశం కాబట్టే, చంద్రుడు మనకు ముద్దుల మామ; చందనం, పన్నీరు మన ప్రీతిపాత్రమైన వస్తువులు. ఛత్ర చామరాలు మనకు రాజలాంఛనాలు. ఈ కారణానే మనకు "చల్లని చూపు", "చల్లని చెయ్యి", "చల్లని ప్రభువు" "నీ కడుపు చల్లగా వుండ" మొదలైన పలుకుబడులేర్పడినాయి. "పరుగెత్తి పాలు త్రాగడం కంటే నిలుచుండి నీళ్ళు త్రాగడం మేలు'' అనే సామెత మనకున్నదే ఈ కారణానే. ఇట్టి లోకోక్తి మనకున్న తర్వాత "మందయాన", "గజగమన" మన భాషలో ఉత్తమజాతి స్త్రీకి పర్యాయ పదాలు కావడం అబ్బురమా? అధికోష్ణమే మనలను కొంతవరకు ఆలసులను ఉపేక్షాపరులను చేస్తున్నది; అదే మనలను శాంత స్వభావులను, సహనశీలురను చేస్తున్నది.

ఇన్ని విధాల – ఇంతగా – భౌగోళిక, వాతావరణ పరిస్థితుల ప్రభావం మన సంస్కృతిపై పడుతున్నందున, ఆ పరిస్థితులే సంస్కృతిగా మనం పరిగణించగలమా? అయినప్పుడు భాషా ప్రభావానికి సంస్కృతి కొంతవరకు లోనౌతుంది కాబట్టి భాషకు, సంస్కృతికి భేదమే లేదనడం తగునా?

భాషనే సంస్కృతిగా పేర్కొనడం భాషను గురించి, సంస్కృతిని గురించి మనకేమీ తెలియదని చాటుకొనడమే! ఒకరి భాష మరొకరికి పట్టుపడినట్టు, ఒకరి సంస్కృతి మరొకరికి సంక్రమించదు. బ్రిటిష్‌వారు దాదాపు రెండు శతాబ్దాలపాటు మన దేశాన్ని పరిపాలించినందున, ఇంగ్లీషు భాషతో మనలో పెక్కుమందికి పరిచయమేర్పడింది. కొందరికి దానిలో పాండిత్యం సయితం లభించింది. ఇంతమాత్రంచేత బ్రిటిష్ సంస్కృతి మన వారసత్వమైందా? మన భాషలలో ముఖ్యంగా మన ప్రాచీన భాషలైన సంస్కృతంలోను, పాళీలోను మహాపండితులైన సర్ విలియం జోన్స్, హెచ్.టి. కోల్‌బ్రూక్, సర్ చార్లెస్ విల్కిన్స్ జేమ్స్ ప్రిన్సెస్, అలెగ్జాండర్ కన్నింగ్ హామ్, ఫ్రెడ్రిక్ ష్లెగెల్, మోనియర్ విలియమ్స్, ఎఫ్, మాక్స్ ముల్లర్, ఎ.ఎ. మాక్డొనెల్, ఎ.బి. కీత్, రీస్ డేవిడ్స్, హెర్మన్ ఓల్డెన్ బర్గ్, మారిన్ వింటర్ విట్జ్, నార్మన్ బ్రౌన్, ఎ.ఎల్. బషామ్ ప్రభృతులలో మన సంస్కృతి జీర్ణించిపోయిందా? మరొక విషయం : ఒకే ఇంగ్లీషును మాతృభాషగా కలిగివున్నా, ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, యునైటెడ్ స్టేట్సు సంస్కృతులలో ఎన్నదగు విభేదాలు లేవా? విభిన్న దేశాలలో ఇంగ్లీషు ప్రచారంలో వుండగా, మన దేశంలో విభిన్న భాషలున్నాయి. చిల్లర, మల్లర భాషలను త్రోసివేసినా, ప్రధానమైన దేశభాషలుగా మన రాజ్యాంగం గుర్తించినట్టివే (సంస్కృతం, ఉర్దూల సమేతంగా) పదునాల్గు వరకున్నాయి. వీటిలో నుంచి హిందీ జాతీయ భాషగా (అనుసంధాన భాషగా) ఎన్నుకోబడింది. కాని, బహుళ వ్యాప్తిలోకి వచ్చి, ఆ స్థానాన్ని అది ఆక్రమించుకొనడం కనీసం మరి రెండు, మూడు తరాల వరకు సాధ్యం కాకపోవచ్చు. ఏమైనా, సర్వవ్యాప్తమైన జాతీయ భాష ఈనాడు మనకు లేకపోయినా, ఒకే జాతీయ సంస్కృతి ప్రస్తుతం మనకు లేదా?

సంస్కృతి అంటే భాష కాదు సరిగదా, కొందరు సూచిస్తున్నట్టు అదేదో ఆధ్యాత్మిక సంబంధమైందీ కాదు. ఇంతే అయితే, ఆధ్యాత్మిక దృష్టిలేనివారిని సంస్కృతీ విహీనులనవలసి వస్తుంది. కమ్యూనిస్టులు నిరీశ్వరవాదులైనంత మాత్రాన మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ ప్రభృతులు సంస్కృతి లేనివారని చెప్పగలమా? కమ్యూనిస్టు దేశాలు సంస్కృతికి అర్హత కోల్పోయినవనగలమా? సంస్కృతిని ఆధ్యాత్మిక ప్రపంచానికి పరిమితం చేయడం భాషకు మారుగా మతానికీ, లేదా, దార్శనికానికి దాన్ని ఒక పర్యాయపదం చేయటమే కాగలదు.

భాషకు భిన్నమైనట్టే మతానికి, దార్శనికానికి సయితం సంస్కృతి భిన్నం. జీవితానికున్న విస్తృతి, దానికున్న వైవిధ్యం, దానిలో ప్రస్ఫుటమౌతూ వుండే విలక్షణత్వం సంస్కృతికీ వుంటుంది. అందువల్లనే సంస్కృతిని నిర్వచించడం కష్టం. "కల్చర్" అనే ఇంగ్లీషు మాటకు సమానార్థకమైన దాన్నిగా "సంస్కృతి"ని మనం ప్రయోగిస్తున్నాము. అమరకోశంలో ఈ శబ్దం లేదు. బ్రౌణ్యంలో ఇది కనబడదు. "శబ్దరత్నాకరం", "శబ్దార్థ చంద్రిక"లను దీనికోసం వెదకడం వృధా శ్రమ. "సూర్యరాయాంధ్ర నిఘంటువు", "వావిళ్ళ నిఘంటువు" "సంస్కృతి" వరకు ఇంకా దేకనే లేదు. తక్కిన మన చిన్న, పెద్ద నిఘంటువులలోకి సయితం "సంస్కృతి" ఎక్కలేదు, అయితే అన్నింటిలోను "సంస్కృతము" కనబడుతుంది. ఈ మాటకు "శబ్ద రత్నాకర" మిచ్చే అర్థం విశేష్యంగా "దేశభాష" అన్య విశేషణంగా చక్కగా జేయబడినది : చక్కజేయబడినది : అలంకరించబడినది : వ్యాకరణ శిక్షితమైనది : పక్వము చేయబడినది : శ్రేష్ఠమైనది" అని. ఈ విశేషణాలలో కొన్ని "కల్చర్"కు వర్తిస్తాయి కాబట్టే, "సంస్కృతము" నుంచి సాధించబడిన ఈ కొత్తపదం, "సంస్కృతి" త్వరలోనే సర్వజనామోదం పొంది, బహుళ వ్యాప్తిలోకి వచ్చింది. మన తెలుగులోనే కాక హిందీ, బెంగాలీ మొదలైన ఇతర దేశభాషలలో కూడా ఇది ప్రస్తుతం విశేష ప్రచారంలో వున్నది.

"సంస్కృతి" అనే మాట మనకు కొత్తది కాగా, ఆ అర్థంలో "కల్చర్" అనే మాటను ఇంగ్లీషు భాషలో ప్రయోగించడం కూడా ఇటీవలనే ప్రారంభమైంది. ఏ అర్థంలోనూ "కల్చర్"ను ఛాసర్ వాడలేదు; షేక్స్పియర్ వాడలేదు; మిల్టన్ వాడలేదు; బైరన్, షెల్లీ కూడా వాడలేదు. ఎన్. బెయిలీ 1736లో ప్రచురించిన తన "ఇంగ్లీషు డిక్షనరీ"లో 'కల్చర్‌కు' సేద్యాన్ని ప్రధానార్థంగా పేర్కొని, ఉత్తమ వాద్యంతో మానసిక వికాసానికి దానిని పర్యాయపదంగా ప్రయోగించవచ్చునని సూచించాడు. 1755లో నిఘంటువును వెలువరించిన శామ్యూల్ జాన్సన్ కూడా దాదాపు ఇంతే చేశాడు. "కల్చర్" అనే పదాన్ని వాడకపోయినా సంస్కరణాపరుని విలక్షణత్వాల విశదీకరణ, విఖ్యాత వ్యాసకర్తలైన ఎడిసన్, స్టీలే రచనలలో కానవస్తుంది. పద్దెనిమిదవ శతాబ్ది ఉత్తరార్థంలో "వ్యవసాయం మానసిక వికాసం" ఉభయార్థాలలో అక్కడక్కడ చెదురుగా ప్రయోగించాడు. విశేష్యంగా కాక, విశేషణంగా వర్డ్స్‌వర్త్ దాన్ని ప్రయోగించాడు.

సంస్కృతి అనే ప్రస్తుతార్థాన్ని ''కల్చర్''ను కల్పించిన వారిలో అగ్రగణ్యులైనవారు, అమెరికన్ రచయితలలో ఆర్. డబ్ల్యు. ఎమర్సన్, బ్రిటీషు రచయిత మాత్యూ ఆర్నాల్డ్ ముఖ్యులు. వీరుభయులు గత శతాబ్దానికి చెందినవారే.

ప్రస్తుతం విశేష ప్రచారంలో గల "ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ" వివరణ ప్రకారం "కల్చర్"కు ఆదిలో గల అర్థం "టిల్లేజ్" (సేద్యం) అని మాత్రమే. తర్వాత తర్వాత భూమి సేద్యానికే కాక, చేపలు, తేనెటీగలు మొదలైన వాటిని పెంచడానికి కూడా అది ప్రయుక్తమౌతూ వచ్చింది. అటుపిమ్మట పరిశోధనాగారాలలో సూక్ష్మక్రిముల పరిపోషణకు సయితం దాన్నే వాడుతూ వచ్చారు. పోతే, "మానసిక వికాసం" అంటూ ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ"లో "కల్చర్"కు పేర్కొంటున్న చిట్టచివరి అర్థం ఇంతకు ముందు నేను వివరించినట్టు మొట్టమొదటసారిగా 1736లో బెయిలీ పేర్కొన్నట్టిది. ఫ్రెంచి ఎకాడమీ వారు తమ నిఘంటువులో "కల్చర్" అనే పదాన్ని లలిత కళల పట్ల, మానసిక వికాసం పట్ల, ఆసక్తి అనే వివరణతో 1762లో ప్రథమంగా ప్రవేశపెట్టారు. ఇంచుమించు మూడు దశాబ్దాల తర్వాత (1793)లో జర్మన్ భాషా పండితుడు అడెలూంగ్ తన సుప్రసిద్ధ నిఘంటువు రెండవ ముద్రణలో "కల్చర్" అనే దాని జర్మన్ రూపంలో "కల్చర్"ను నమోదు చేశారు. ఆయన నిర్ణయం ప్రకారం మనసుతో పాటు శరీరానికి స్వచ్ఛతను, శోభను సమకూర్చేదే సంస్కృతి. దుష్టప్రభావం నుంచి, దురాచారం నుంచి మనసును సంస్కరించి వ్యక్తిత్వంతో పాటు అతడికి విజ్ఞాన దీప్తిని కూర్చేదే సంస్కృతి. ఈ కార్యక్రమంలో మనసుతోబాటు శరీరాన్ని కూడా పేర్కొనడం ప్రత్యేకించి చూడదగు విశేషం. సంస్కరించినట్లు విశదం. ప్రాచీన కాలపు గ్రీస్‌లో శరీర, స్వాస్థ్య, రక్షణను దాని, సౌందర్య పోషణను నిర్లక్ష్యం చేసేవారు కాదు. దేహదౌర్బల్యం విధిగా మానసిక దౌర్బల్యానికి దారి తీస్తుందని వారి విశ్వాసం. వంపులు తిరిగి, వయ్యారాలను కలిగిన మానవకాయం వారి దృష్టిలో ఒక విశిష్ట కళాఖండమే. ప్రాచీన కాలపు యవనుల వలె జర్మన్‌లు కూడా శరీర పోషణకు ప్రాధాన్యమిచ్చేవారు!

తక్కిన యూరోపియన్ భాషలలో కూడా ఆదిలో సేద్యానికి పర్యాయపదమైన "కల్చర్"కు కొంచెం వెనక ముందులుగా "సంస్కృతి" అనే నూతనార్థాన్ని కల్పించుకొనడం జరిగింది. ఈ అర్థ విస్తృతి ఎంతో సముచితం. మానవ నాగరికత చరిత్రను "ది స్టోరీ ఆఫ్ సివిలిజేషన్" అనే పేరుతో ప్రతిభావంతంగా వ్రాస్తున్న అమెరికన్ రచయిత, విల్ డూరాన్ట్ వివరణ ప్రకారం ఆదిలో "కల్చర్" వ్యక్తమైంది "అగ్రికల్చర్" రూపంలోనే.

ఇంగ్లీషు నిఘంటువులో నిర్వచనం ప్రకారం “కల్చర్” అంటే కేవలం మానసిక వికాసమని మనం అంగీకరించకపోవచ్చు. కాని, “సంస్కృతి” అనే కొత్త పదాన్ని మనం సృష్టించుకోగా, “కల్చర్” అనే తమ పాత మాటకు ఇంగ్లీషువారు ఒక కొత్త అర్థాన్ని అనతికాలం క్రితమే కల్పించుకొన్నారన్న విషయాన్ని అంగీకరించడానికి మాత్రం ఎట్టి అభ్యంతరం వుండనక్కరలేదు.

మాట కొత్తదైనా, సంస్కృతికి మనం కొత్త కాదు; మనకు సంస్కృతీ కొత్త కాదు, సభ్యత, సంస్కారం, నాగరికత : ఈ మూడు మాటలలో దేనినో ఒక దాన్ని సంస్కృతి స్థానంలో సందర్భోచితంగా ప్రయోగించడం ఇదివరలో మనకు పరిపాటి. కాని సూక్ష్మంగా, పరిశీలిస్తే మాత్రం ఈ మూడింటిలో ఏదీ సంస్కృతి స్వరూప స్వభావాలను సరిగా వ్యక్తీకరించలేదని తెలుస్తుంది. సభ్యతవలె సంస్కృతి కేవలం సభా మర్యాద కాదు; నలుగురు మధ్య నడవడిలో నాజూకుతనం, హుందాతనం మాత్రమే కాదు కూడా, సంస్కృతీపరునిలో విధిగా సభ్యత వుంటుంది. కాని సభ్యత తెలిసి కూడా సంస్కృతీపరుడు కాకపోవచ్చు. సభ్యత పైపై మెరుగు కావచ్చు; అణువణువున తొణికిసలాడ వలసినట్టిది సంస్కృతి.

పోతే, సంస్కారం అనుభూతార్థ స్మృతిని (కొందరి విశ్వాసం ప్రకారం అది పూర్వజన్మ స్మృతి సయితం కావచ్చు) సూచిస్తుంది, లేదా విద్యాబుద్ధుల వల్ల కలిగి వున్న మనఃపరిపాకాన్ని సూచిస్తుంది. అదైనా వ్యక్తిపరంగానే; జాతిపరంగా కాదు. సంస్కృతిలో యిమిడివుండేవి వ్యక్తిగతమైన అనుభూతులే కావు; తరతరాల, యుగయుగాల జాతీయ జీవిత ఫలితార్థ మది.

ఇక, మన నిఘంటుకారులు వివరిస్తున్నట్టు నాణ్యమైనదే నాగరికత కాదు; నగర జీవిత విధానంతోపాటు దాని వైభవ విలాసాలు కూడా నాగరికత కిందికి వస్తాయి. అయితే నాగరికతవలె సంస్కృతి కేవలం నగరాలలోనే ప్రభవించదు; వాటి సరిహద్దులకే అది ప్రధానంగా పరిమితమూ కాదు. నాగరికులలోనే కాక, ఆటవికులలో సయితం సంస్కృతి వుండవచ్చు. వాస్తవానికి వారిలోనే నిసర్గమైన, ఉత్తమమైన సంస్కృతి కానవస్తుందని నమ్మేవారు కొందరున్నారు.

సంస్కృతికి, నాగరికతకు ఇట్టి విభేదాలను మరికొన్నింటిని కూడా చూపించవచ్చు. విద్య లోపిస్తే, సంపత్తి కొరవడితే నాగరికత వృద్ధి చెందలేదు. సంస్కృతికి వాటితో ఈ విధమైన అవినాభావ సంబంధం లేదు. విద్య సంస్కృతికి

దోహదం కూర్చగలదనడం నిశ్చయం. ఐతే, అక్షర జ్ఞానాన్ని విద్యగా భావించరాదు; విద్యావంతుడైన ప్రతి వ్యక్తి విధిగా సంస్కృతీపరుడని భ్రమపడరాదు. ఇటీవల వరకు మొత్తం ప్రపంచంలోనే విద్యావ్యాప్తి, విజ్ఞాన ప్రచారం వాగ్రూపంలోనే విశేషంగా జరిగాయి. గౌతమ బుద్ధుడు, సోక్రటీస్, ఏసుక్రీస్తులు పుస్తకాలను రాయలేదు. వాగ్రూపంలోనే తమ ప్రబోధాన్ని వారు కొనసాగించారు. వారి తదనంతరమే వారి శిష్యప్రశిష్యులు వారు చెప్పిన విషయాలను గ్రంథస్థం చేశారు. వేదవేదాంగాలు, రామాయణ, మహాభారతాలు, గ్రంథస్తమైంది కూడా వాటి కర్తలు వాటిని చెప్పిన వెంటనే కాదు. పెక్కు శతాబ్దాల తరువాత ఈనాడైనా ప్రపంచ ప్రజలలో దాదాపు సగం మంది నిరక్షరాస్యులే! ఈ కారణాన మానవకోటిలో అర్ధభాగాన్ని సంస్కృతి లేనిదాన్నిగా కొట్టివేయవచ్చునా? మిగిలిన అర్ధభాగంలో సంస్కృతి తొణికిసలాడుతున్నట్టు తీర్మానించవచ్చునా? అక్షరజ్ఞానం కానివారైనా సంస్కృతీపరులు కావచ్చును; వివిధ భాషలలో, శాస్త్రాలలో పండితులై కూడా సంస్కృతీ విహీనులు కావచ్చు. ఈ విషయాన్ని గురించి వివరించనవసరం లేదు. అక్బర్ విద్యాభ్యాసం అక్షరజ్ఞానాన్ని దాటి వెళ్ళలేదు; శివాజీకి సంతకం పెట్టడమైనా తెలియదు; హైదరాలీ నిశానీ పద్దు; రంజిత్‌సింగ్ ఓనమాలనైనా దిద్దలేదు. అయినా, వీరిని సంస్కృతీ విహీనులనగలమా? కాగా, సంపత్తికీ సంస్కృతికీ ఎంత తక్కువ సంబంధం వుంటుందో తెలుసుకోవాలంటే, నల్లబజారులో కొల్లలుగా గడించిన ఏ కొత్త భాగ్యవంతుని చూచినా సరిపోతుంది. సభ్యత, సంస్కారం, నాగరికత ఈ మూడింటి కిందికి సంస్కృతి రాదనడం తేలికే. కాని, అదేమిటో చెప్పడం మాత్రం కష్టం.

**(నార్ల రచనలు 5వ సంపుటి నుండి...)**



*"ఈ దేశంలో పీల్చే గాలికి కులముండు. తాగే నీటికి కులముంది, పారే పంట కాల్వకి, పండే భూమికి కులముంది. బడికి, గుడికి, రచ్చబండకి కులముంది. తినే తిండికి, వుండే ఇంటికి, కట్టేబట్టకి కులముంది. మాటాడే మాటకి కులముంది. సాహిత్యానికి, సంస్కృతికి కులముంది. రాజ్యానికి కులముంది, దాని చట్టానికి కులముంది. న్యాయానికి, న్యాయస్థానానికి కులముంది. శవానికి, శ్మశాన వాటికకు కులముంది. దేవుడికి కులముంది. దెయ్యానికి కులముంది."*

# 17. సంస్కృతీ సమస్య

**– కీ.శే. కొడవటిగంటి కుటుంబరావు** (అభ్యుదయ రచయిత)

ఏ సమాజంలో అధిక సంఖ్యాకుల భౌతిక జీవితం హేయంగా ఉంటుందో, ఆ సంఘంలోని వ్యక్తులకు సంస్కారపు విలువలు చాలా నీరసించి ఉన్నవని కూడా మనం అనుకోవచ్చు. ఐతిహాసికులు చరిత్ర యొక్క మంచి చెడ్డలను వ్యక్తులకు అంటగట్టడం ఆచారం. ఇది కేవలమూ పొరపాటు. హిట్లరును రాక్షసుడని తిట్టడం చాలా సులభం. హిట్లరు రాక్షసత్వాన్ని బలపర్చిన అసంఖ్యాక ప్రజల సంస్కారం మాటేమిటి?

మనుషులను పరిపాలించవలసింది సంస్కారం. కానీ సంస్కారం మానవ సమాజాన్ని పరిపాలించిన నిదర్శనం చరిత్రలో ఎక్కడా లేదు. ఎందరో ప్రవక్తలూ, ద్రష్టలూ, నీతివేత్తలూ, తాత్వికులూ, కవులు పుట్టి మన మానవ సంస్కారాన్ని పెంచారు. కాని మానవ జాతిని పరిపాలించినది కత్తి, పశుబలము, వ్యక్తి, వర్గస్వార్థాలు, మౌఢ్యమూను. సంస్కృతిని జీవితంలో వినియోగ పరచుకోవటానికి రాజకీయ ప్రతిబంధకాలు ఎప్పుడూ ఉంటూనే వచ్చాయి. ఏనాటికయినా జీవితాని కనుగుణ్యంగా సంస్కారమూ, సంస్కారానికనుగుణ్యంగా జీవితమూ మారుతూ వస్తే తప్ప, మానవ జీవితంలో మానవత్వం ప్రవేశించినట్లు భావించటానికి వీల్లేదు. ఇది సాధించడానికి ప్రయత్నం చెయ్యనివాళ్లు యదార్థమైన సంస్కారులు కారు. దేశాన్ని రక్షించుకోవాలనే ప్రేరణ కలిగించని దేశభక్తి, కళాపతనం గురించి ఉదాసీనంగా ఉండగల రసికత్వమూ, కుసంస్కారాన్ని అన్ని రంగాల్లోనూ ప్రతిఘటించని సంస్కారమూ యదార్థమైనవి కావు. దౌర్జన్యమూ, అన్యాయమూ, జాతి మత వైషమ్యాలూ అంతర్జాతీయ ప్రమాణాన పెరిగిపోతుంటే మనకు సంస్కారం, సంఘంలో నిర్వహించవలసిన యదార్థమైన పాత్ర తెలుస్తుంది.

మన స్వాతంత్ర్యం ప్రజలకి దక్కి, జీవితం పెరగాలంటే మన శాస్త్రజ్ఞులూ, న్యాయవేత్తలూ, పండితులూ, కళాకారులు, సంస్కృతీ సమాజాలుగా ఏర్పడి, జీవితాన్ని సమగ్రంగా ఎప్పటికప్పుడు విమర్శించి ప్రజల్ని జాగృతం చేయాలి.

వీరేశలింగం గారు తన కాలంలో జాతి యొక్క సంస్కృతిని సంరక్షించి, పెంపొందించడానికి ఒంటిచేతి మీద శ్రమించారు. కానీ అన్నప్పుడల్లా

వీరేశలింగంగారు పుట్టరు. ఈ పని సమాజం వల్ల కావలసింది. ఆంధ్రలో ఇటువంటి సమాజం నెలకొల్పడానికి పెద్దలు ముందుకు వచ్చి కృషి చేస్తారని నమ్ముతున్నాను.

## మన సంస్కృతి

సంస్కృతి కృత్రిమమైంది. ఏ మనిషీ ఒకానొక సంస్కృతిలో పుట్టడు. దాన్ని తన చుట్టూ ఉన్న సమాజం నుంచి, తనకు సాధ్యమైన మట్టుకూ, ఇష్టమైన మట్టుకూ అందిపుచ్చుకుంటాడు. సంస్కృతి సామూహికమైనది, పరిణామ క్రమంలో ఏర్పడినదీ, బాహ్య పరిస్థితులలో మార్పులకు ప్రతిస్పందించేదీనూ, అందులో జాతి లక్షణాలూ, ప్రాంతీయ లక్షణాలూ ఉంటాయి. కాని ఒక జాతికీ, ఒక ప్రాంతానికీ చెందిన వ్యక్తులందరూ ఒకే రకం సంస్కృతి ప్రదర్శించరు. కొందరు వ్యక్తులలో సంస్కృతి చాలా దుర్బలంగా కనిపిస్తుంది. మరికొందరు తమ సంస్కృతితో సాటివారినీ, ఇతర జాతుల వారిని సైతం ప్రభావితులను చేయగలిగినట్టు కనబడతారు. రష్యను టాల్‌స్టాయ్, ఇంగ్లీషు షేక్స్పియర్, భారతీయ టాగోర్, క్రిస్తూ, బుద్ధుడూ, మహమ్మద్ – ఇలాంటివాళ్ళు తమ సంస్కృతితో దాదాపు ప్రపంచంలోని అన్ని ప్రాంతాల వాళ్లనూ ప్రభావితులను చేసినట్టు కనబడ్డారు. అయితే అందరి ప్రభావమూ ఒకే యుగానికి, లేక ఒకే మానవ సమాజ పరిణామ దశకు సంబంధించినది కాదు. ఈనాడు మత ప్రభావం చాలా తక్కువ; మత సంస్కృతి కూడానూ, ఈనాడు కార్ల్‌మార్క్స్, లెనిన్, మావోల ప్రభావం హెచ్చుగా వున్నది. వాళ్ళ ప్రభావం పూర్తిగా ఆధునిక యుగానికి చెందినది. ఈనాడు కూడా అన్ని దేశాలలోనూ తమ మత భావాలతో ఇతరులను ప్రభావితులను చేయగలవారున్నారు. మన భారతదేశంలోని బాబాలకు దేశాంతరాలలో కూడా భక్తులున్నారు. అయితే వీరి ప్రభావం విస్తృతమైన మానవ జీవిత పరిణామానికి తోడ్పడదు. ప్రపంచానికి మతయుగం అయిపోయింది. అలాగే, ఇవాళ టాగోర్‌కన్నా గొప్ప కవులు మనదేశంలో ఉండవచ్చు. కాని వారికి ఖండాంతర ఖ్యాతి రాదు. సాహిత్య సంస్కృతి ఈనాటి విశాల మానవ జీవితాన్ని ప్రభావితం చెయ్యలేదు. ఈనాటి విశాల మానవ జీవితాన్ని ముందుకు నడపగలది ఆర్థిక రాజకీయ సంస్కృతి. దాన్ని అధునాతనంగా చేసుకొన్న జాతులు పురోగమిస్తాయి; ప్రాచీన ఆర్థిక – రాజకీయ సంస్కృతులను పట్టుకు వేళ్ళాడే జాతులు వెనకబడిపోతాయి.

సంస్కృతి అనేది మానవుడి అవసరాలలో, ముఖ్యావసరాలలో ఒకటి. జీవిత సమస్యలను ఒక వ్యక్తిగాని, ఒక సమాజంగాని, ఎలా ఎదుర్కొనేది ఎలా పరిష్కరించుకొనేది ఆ జాతి యొక్క లేక వ్యక్తి యొక్క సంస్కారం నిర్ణయిస్తుంది. సంస్కృతిలో యుగధర్మం ఉంటుందన్నది మనం స్పష్టంగా గుర్తించాలి. ఉదాహరణకు, ఇంకా మత యుగంలోనే నివసిస్తున్నామనుకునే వాళ్ళు ప్రపంచంలో ఉన్నారు. మనిషి దోషి అవునా, కాదా అనేది నిర్ణయించటానికి మన పూర్వులు అగ్ని పరీక్షల లాటివి పెట్టేవారు – ఎర్రగా కాల్చిన కర్రులు నాకటమూ, నిప్పులు చేత్తో పట్టుకోవటమూ వగైరాలు. ఇలాంటి న్యాయ నిర్ణయాలను ఈనాడు ఉత్తమ సంస్కారంగా భావించం కానీ మత ప్రాతిపదిక మీద రాజ్యాంగాన్ని నడపటానికి పూనుకున్న దేశాలలో, దొంగతనం చేసిన వాళ్ళ చేతులు నరకటమూ, స్త్రీలను రాళ్ళతో కొట్టి చంపటమూలాటి శిక్షలను పునరుద్ధరించటం జరుగుతున్నది.

విజ్ఞానం సోకని వ్యక్తులలోనూ, జాతులలోనూ మూఢ విశ్వాసాలు కనిపిస్తాయి. వాళ్లు వైజ్ఞానికంగా ఏ యుగంలో ఉన్నదీ సులువుగా అంచనా కట్టవచ్చు. అలాగే ఆర్థిక, రాజకీయ భావాలలో వ్యక్తులు గానీ, దేశాలు గాని ఎంత వెనకబడి వున్నదీ ఆ రంగాలలో వ్యక్తుల ప్రవర్తనను బట్టి తేలికగా తెలుసుకోవచ్చు. 'ప్రజాస్వామ్యం' మంత్రం ఎవరైనా జపించవచ్చు. కాని ఈనాడు మన రాజకీయ నాయకులు రాజకీయ రంగంలోనూ, ఆర్థిక విషయాలలోనూ అవలంభించే వైఖరులు చూస్తే వారికి ప్రజాస్వామ్యం గురించి ఓనమాలు కూడా రావని స్పష్టంగా తెలుస్తున్నది. ఖరీదైన కార్లూ, టీవీ సెట్లూ, అణు ఇంధనాలలాగే ఆధునికయుగపు రాజకీయ ఆర్థిక భావాలు – ఆర్థిక అసమానతలు తగ్గించటమూ, అందరికీ పనులు చూపించటమూ వగైరా – మనకన్న ముందుకుపోయిన దేశాల నుంచి అరువు తెచ్చుకున్నాం.

'ప్రజాస్వామ్యం', 'సోషలిజం' అన్న మాటలు చిలుకలకు కూడా నేర్పవచ్చు. వాటి అర్థం తెలియటం మాట వేరు!

ఈనాడు మనం కొత్తగా సంస్కృతిని కష్టపడి సృష్టించుకోనవసరం లేదు. ఆర్థిక అసమానతలను తగ్గించుకుని, ప్రజలందరిలోనూ రాజకీయ చైతన్యం, సాంఘిక చైతన్యం ప్రమాణానికి పెంచుకున్న దేశాలున్నాయి. వాటిలో ద్రవ్యోల్బణం లేదు. ద్రవ్యోల్బణానికీ, అందరికీ పనులుండటానికి మధ్య వైరుధ్యం లేదు. ఈ యుగానికి అవి ముందున్న దేశాలు. అంటే ఒక వంక ధాన్యం నిలవచేసే సదుపాయాలు లేక ఆరుబయట కుళ్లుతూంటే, ఇంకొక వంక ఆకలితో చస్తున్నవాళ్ళు అదే జాతిలో

ఉండటం లాంటి చచ్చు వైరుధ్యాలతో సతమతమయ్యే దేశాలు వాటి నుంచి ఆధునిక యుగానికి సంస్కృతి అందిపుచ్చుకోవాలి.

అంతేగాని భయంకరమైన సామాజిక దురన్యాయాల మధ్య, హరిజనుల హత్యాకాండ మధ్య మనం అభివృద్ధి చేసిన ఆటవికపు సినిమాకళను గురించీ, ఊసుపోక సాహిత్యాలను గురించి రొమ్ము బాదుకుని, మన సంస్కృతి అనుకోవడం హాస్యాస్పదం అని తోస్తుంది. ఇవాళ కూడా ప్రపంచంలో శిలాయుగ నాగరికతతో జీవిస్తున్న జాతులున్నాయి గనక, ఎక్కడికక్కడ ప్రతి వ్యక్తీ, ప్రతి జాతీ తాను సంస్కృతి విషయంలో పురోగమించినట్లు ఆత్మవంచన చేసుకోవచ్చు. కాని శిలాయుగపు సంస్కృతి మన నాగరిక జీవితపు అన్ని రంగాలలోనూ ఇంకా సజీవంగా ఉన్నదన్న సంగతి గ్రహించడం మన సంస్కృతి ముందుకు పోవటానికి మొదటి మెట్టేమో? హత్యారాజకీయాలూ, కట్నాల కోసం హత్యలూ, నేరస్థులకూ ఉన్నత వర్గాల నుంచి రక్షణా, రాజకీయ పార్టీలకు కుమ్మక్కిగా గూండాలూ, నిరుపయోగమైన పోలీసు రక్షణ శాఖా, ప్రజల నెత్తురు పీల్చే అధికార భక్షణ శాఖ – వీటి మధ్య వ్యక్తి సంస్కృతిగాని, జాతి సంస్కృతిగాని ఎలా సజీవంగా ఉంటుందో ఊహించటం సాధ్యం కాకుండా ఉన్నది.

**(కొ.కు. రచనా ప్రపంచం 13వ సంపుటి నుండి...)**



*"వేమననీ కవి చౌడప్పని, సుమతీ శతకాన్ని, పోతన భాగవతాన్ని అట్టా కొన్నిటిని పక్కనపెడితే మిగిలిందంతా తెలుగుకాని తెలుగుని తెలుగుగా చెలామణి చేశారు... అంతా చేరి అసలైన తెలుగుపదాన్ని వెలికితీసి పదిలపర్చే అవకాశమే లేకుండా చేశారు.. ప్రజల సంస్కృతి ప్రాణం తీశారు. ఏ ఎండకాగొడుగు పట్టి ప్రజలది కాని సంస్కృతికి పెత్తనమిచ్చి పట్టం కట్టారు. తమ పీఠాధిపత్యం నిలబెట్టుకోడానికి ఏ అడ్డమైన గడ్డైనా కరవడానికి వెనుకాడలేదు ఈ పండితులు. కేవలం ఐదుగురో, ఆరుగురో మెచ్చుకునే కళని, సాహిత్యాన్ని 90 శాతం ప్రజలపైన రుద్దారు.. ఆలయం బయట కళంతా, సాహిత్యమంతా, సంస్కృతంతా అలగాజనానిదైపోయింది. ఆలయం లోపలి జీవంలేని పెనుగులాటంతా కళై ముందుకొచ్చింది."*

# 18. ఏది సంస్కృతి

**– కీ.శే. చలసాని ప్రసాద్** (విప్లవ రచయిత)

సంస్కృతి అంటే ఏమిటి? నాగరికత అంటే ఏమిటి? కులానికి, సంస్కృతికి సంబంధం ఏమిటి? అనే ప్రశ్నలు వసంతకాలపు సరస్సులో పద్మాలలాగా నా మనస్సులో ఉన్నాయి. ఎంత సందేహపూరితమైన అభిప్రాయాలున్నాయో అంత సమాచారమూ ఉన్నది, అన్ని ఆలోచనలూ ఉన్నాయి. ఇవన్ని ఈ సందర్భంలో మీతో పంచుకొనే ఒక చిన్న ప్రయత్నమే ఇది. సంస్కృతి అనగానే సంఘ పరివార్ గుర్తుకు వచ్చింది. బిజెపి నాయకుడు వెంకయ్య నాయుడు జాతీయ సంస్కృతని, సాంస్కృతిక జాతీయవాదమని చెపుతుంటాడు. అందులో జాతీయ వాదమనేది ఒక ప్రత్యేకమైన అంశం. సంస్కృతి గురించి ఎవరేమి చెప్పినా ప్రతి ఒక్కరికి, ప్రతి రాజకీయ సామాజిక నిర్మాణానికి సంస్కృతి గురించి ఒక ఎజెండా ఉంటుంది. దాన్ని ప్రకటించుకుంటూ ఉంటాయి.

ఒక లెక్క ప్రకారం సంస్కృతికి రెండు వందల నిర్వచనాలు ఉన్నాయి. మనిషి అంటే ఏమిటి? భూమి అంటే ఏమిటి? అని ఒక నిర్వచనంగా ఎట్లా చెప్పుకుంటామో అట్లా సంస్కృతికి నిర్వచనం చెప్పే ప్రయత్నాలు జరిగాయి. అసలు నిర్వచనం అంటే – డెఫినిషన్ అనేది జర్మన్ పదం. సంస్కృతిని ఒక నిర్వచనంలో ప్రకటించడానికి చేసిన ప్రయత్నాల్లో ఏది సమగ్రంగా సంస్కృతిని ప్రతిబింబించింది? అని తేల్చడం కష్టం. అలాగే సంస్కృతితో కలగలసినవి కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు భూమి, నాగరికత, మతం, కులం వగైరా. ఈ విషయాల్లో కూడా మనకు ఒక స్పష్టత ఉంటేనే మొత్తంగా సంస్కృతి గురించి లోతైన అవగాహన కలుగుతుంది. ఇప్పటికే మనకున్న అవగాహనతో ఏదో ఒక నిర్వచనం ఇచ్చుకొని చేతులు దులుపుకోవడం వల్ల ప్రయోజనం ఉండదు.

'భూమిలోన పుట్టు భూసారమంతయు / తనువులోన పుట్టు తత్త్వమెల్ల / శ్రమములోనే పుట్టి సర్వంబు తానౌను' అని వేమన చెప్పాడు. ఇది మామూలు కవిత్వమనుకుంటే పొరపాటు. ఆయన భూమి గురించి చెప్పాడు. ఎందుకంటే ఆయన తనువులోన పుట్టు తత్త్వమెల్ల అన్నాడు. మానవ జీవితం అతని తాత్వికతకు కేంద్రం. మానవ శ్రమని ఆయన చాలా స్పష్టంగా గుర్తించాడు. పాశ్చాత్య తత్వవేత్తలకంటే చాలా ముందే శ్రమలోనే సర్వం పుడుతుంది అని చెప్పిన విశ్వకవి ఆయన. శ్రమ నుంచి సంస్కృతి పుడుతుంది అని కూడా ఆయన చెప్పాడు.

ఇక్కడ మనం జాషువా వేదిక మీది నుంచి మాట్లాడుకుంటున్నాం. 'ఆ అభాగ్యుని రక్తంబు నాహరించి ఇనుప గజ్జెల తల్లి జీవనము చేయు / కసరి బుసకొట్టు నాతని గాలిసోకంగ / నాల్గు పడగల హైందవ నాగరాజు అన్నాడు జాషువా. జాషువాగారు ఈ పద్యం రాసినపుడు నాలుగు పడగలే ఉన్నాయి. విశ్వనాథ దాన్ని వేయి పడగలు చేశాడు. ఇప్పుడు మోడీ కోటి పడగలు చేశాడు. బుష్ శతకోటి పడగలు చేస్తున్నాడు. జాషువా ఆహరించి అనే పదం ఎందుకు వాడాడా అని నాకు అనుమానం వచ్చింది. దానికి మూడు అర్థాలు ఉన్నాయి. ఆరగించి, అపహరించి, ఆకర్షించి అని. ఈ మూడూ సంస్కృతికి సంబంధించిన పదాలు.

దేశమంటే మట్టికాదోయ్ / దేశమంటే మనుషులోయ్ / నరుల చెమటను తడిసి మూల ధనం పంటలు పండవలెనోయ్ అన్నాడు గురజాడ. జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును అని కూడా అన్నాడు.

కమ్మరి కొలిమి, కుమ్మరి చక్రం, జాలరి పగ్గం, సాలెల మగ్గం, శరీర తత్త్వం, స్ఫురింప చేసే గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి అని శ్రీశ్రీ చెప్పారు. ఈ నలుగురూ మూడు కాలాలకు చెందినవారు. అయితే సంస్కృతికి మానవ శ్రమతో సంబంధముంది అనే విషయాన్ని ఎవరి పంథాలో వాళ్ళు చెప్పారు. నలుగురూ కూడబలుక్కుని రాసినవాళ్ళు కాదు. కాని సంస్కృతికి, శ్రమకు మధ్య ఉన్న సంబంధం ఈ నలుగురి అవగాహనలో అంతస్సూత్రంగా కొనసాగింది. అది శ్రీశ్రీ కాలానికి మరింత స్పష్టంగా వ్యక్తమయింది. ఈ విషయం ఎందుకు చెపుతున్నానంటే మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును అనే మాట మార్క్సిజం ఈ దేశానికి రాకముందు, పాశ్చాత్య భావజాలంతో మనకు సంబంధం పెద్దగా కలగకముందు, రష్యన్ విప్లవం రాకముందు మన గురజాడ చెప్పాడు. విశ్వకవికి ఉండే లక్షణం అది. ఎందుకంటే ఆయన తరువాత టి.ఎస్.ఇలియట్ అనే అతను – అతనికి కవిత్వంలో 1922లో నోబెల్ ప్రైజ్ వచ్చింది – అప్పటికి చాలా నిరాశా జనకంగా కవిత్వం రాశాడు. 20వ శతాబ్దంలో నాగరికత, సంస్కృతి నిరాశా పూరితంగా వ్యాఖ్యానించబడుతున్నాయి. మళ్లీ మనం వేదకాలానికి వెళ్ళిపోదాం అనే దారి ముందుకు వచ్చింది. టి.ఎస్. ఇలియట్ Towards the definition of Culture అనే పుస్తకం ఒకటి రాశాడు. పేజీకి ఒకసారైనా మతంతో అనుసంధానం చేశాడు. అది చదివి నేను మిమ్మల్ని విసిగించను. కాని సారాంశం ఏమంటే సంస్కృతి అంటే మతమే అని ఆయన అభిప్రాయం. ఇది ఎంత తప్పో ఇవాళ ప్రత్యేకంగా చెప్పనవసరం

లేదు. అయితే దీని ప్రభావం కూడా తక్కువ కాదు. ముఖ్యంగా బిజెపి మతాన్ని భుజాన వేసుకొని ప్రచారం చేస్తోంది. ఈ పనిలో మోడీ హిట్లర్‌కి తమ్ముడు కూడా కాదు. అన్నగా తయారయ్యాడు. సరే మళ్లీ ఇలియట్ దగ్గరకు వస్తే ఆయన సంస్కృతి అంటే మతమే అని చెప్పిన కాలంలో మన దగ్గర ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి నవల రాశాడు. అందులో ఆయన ఎన్నెన్ని కొత్త విషయాలని ఆ కాలానికే ప్రతిపాదించారో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఇలియట్ కంటే మన గురజాడ, ఉన్నవ ఎంత ఉన్నతంగా ఆలోచించారో గమనించండి. ప్రజలకు, ముఖ్యంగా పేద జనాలకి, వాళ్ళ జీవితానికి, శ్రమకు సంస్కృతికి ఉన్న సంబంధాన్ని ఎంత బాగా పసిగట్టారో ఈ ఉదాహరణలు తెలియజేస్తాయి. నేను ఇలియట్ గురించి ఈ మాట అంటున్నందుకు ఆంగ్లభాషాభిమానులకు, ముఖ్యంగా కేవలం కవితాలోలురకు కష్టం కలగవచ్చు. అయినా నేనీ మాట చెప్పి తీరాలని అనుకున్నాను.

మన దేశంలో వేమన, జాషువా అట్టడుగు జీవితం నుండి శ్రమతో సంస్కృతికి ఉండే సంబంధాన్ని చెబుతూనే దానితోపాటు ఇంకో విషయం గూడా చెప్పారు. ఉదాహరణకు వేమన కులముగల్గువాడు – గోత్రంబు కలవాడు – విద్యచేత విర్రవీగువారు – పసిడి కలుగువాని బానిస కొడుకులు అన్నాడు. ఆయన సంస్కృతిని కులాన్ని మతాన్ని ఆస్తిలో చూడడం సాధ్యం కాదు. ఇవాళ కులాన్ని, మతాన్ని పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్న వాళ్ళు ప్రజల మనసులకు చెదలు పట్టించాలని చూస్తున్నారు. పాలకవర్గాలు, సంపన్నులు, రావిశాస్త్రిగారి భాషలో చెప్పాలంటే పెద్దింటివాళ్ళు, పెద్ద కులాల వాళ్ళు కుట్రపూరితమైన ప్రయత్నాలు చేస్తున్నారు. ఇది చాలా కాలం కిందటే మొదలైంది. ఒకప్పుడు చాపకింది నీరు మాత్రమే. ఆ తరువాత జేబులో తేలయింది. ఇప్పుడు నట్టింట్లో నాగుపామయింది. ఈ ప్రమాదాన్ని పసిగట్టాలి. మతమే సంస్కృతి అనే ప్రచారం చేసిన ఇలియట్ లాంటి వాళ్లంతా పొందినవాళ్లు. కాని వాళ్ల భావజాలం చాలా ప్రమాదకరమైనది.

చాలా విచిత్రంగా మనదేశంలో సంస్కృతి అంటే కులమే లేదా వర్ణాశ్రమ ధర్మాలే అనే ప్రచారం కూడా బాగా జరుగుతోంది. కోట్ల సంవత్సరాల నుండి ఈ విశ్వం ఉన్నది. లక్షల సంవత్సరాల నుండి మానవులు ఉన్నారు. వేల సంవత్సరాల నుండి నాగరికత ఉన్నది. సంస్కృతి అనగానే గ్రీకు దేశాన్ని రెఫర్ చేయడం పరిపాటి. వాళ్లకి కవిత్వం, నాటకం, తత్త్వశాస్త్రం వగైరా అన్నీ ఉన్నాయి. కాని సంస్కృతి అనే

మాట ఆ కాలంలో లేదు. రోమ్ సమాజం గ్రీకు నుంచి దిగుమతి చేసుకుని కమర్షియల్ సంస్కృతిని, కమాడిటి సంస్కృతిని ప్రపంచానికి ఎగుమతి చేసింది. హెర్బర్ట్‌రీడ్ ఈ మాట చాలా అర్థవంతంగా రాశాడు.

1955లో ఆంధ్రరాష్ట్రంలో జరిగిన మధ్యంతర ఎన్నికల సందర్భంలో సంస్కృతి గురించి చాలా విలువైన అభిప్రాయాలు చర్చకు వచ్చాయి. అది కలిమి లేముల మధ్య పోరాటంగా సాగింది. కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీల మధ్య ఎన్నికల రూపంలో వర్గ సంఘర్షణ చాలా నిర్దిష్టంగా వర్గ ప్రయోజనాల ప్రాతిపదికమీద కొనసాగింది. 1955లో కమ్యూనిస్టు పార్టీ తాను అత్యధిక మెజార్టీతో గెలుస్తామని కర్నూలు కొండారెడ్డి బురుజును కైవసం చేసుకుంటామని గొప్ప ఆత్మవిశ్వాసంతో ఉంది. కానీ అంతా తారుమారైంది. సరిగ్గా కేరళలో కూడా ఇలాంటి అనుభవమే ఎదురయింది. కమ్యూనిస్టు పార్టీ అనే శిశువుని నెహ్రూ, ఇందిరాగాంధీ ఊయలలోనే గొంతు పిసికి చంపేరు. ఆంధ్ర ఎన్నికల సందర్భంలో కమ్యూనిస్టు పార్టీ మీద తీవ్రమైన నీలాపనిందలతో ప్రచారం జరిగింది. కమ్యూనిజం, మార్క్సిజం భారతీయమైనది కావు. ఈ దేశానికి సంబంధించినవి కాదు, మన సంస్కృతికి విరుద్ధం అని నార్ల వెంకటేశ్వరరావు వంటి గొప్ప మేధావి పనిగట్టుకుని ప్రచారం చేశాడు. ఆయన ఎంత గొప్ప మేధావో, పాత్రికేయుడో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. కాని ఆయన పనిగట్టుకొని కమ్యూనిస్టు పార్టీకి ఓటు వేయవద్దనీ కాంగ్రెస్‌ని గెలిపించమని ప్రచారం చేశాడు. జమీందార్లను, రాజులను పెద్దింటి వాళ్లను, పెద్ద కులాల వాళ్లను గెలిపించడానికి, సంపన్నులకు ఊడిగం చేయడానికి ఆంధ్రప్రభ పత్రికను వాడుకున్నాడు. వీళ్ళ దృష్టిలో కమ్యూనిజం భారతీయ సంస్కృతికి విరుద్ధం. మార్క్స్, ఎంగెల్స్, స్టాలిన్, మావోలు గిట్టరు. పతంజలి, వశిష్టుడు, వ్యాసుడు ఆరాధ్యం. నార్ల వెంకటేశ్వరరావు చాలా హాయిగా ప్రభుసేవ చేశాడు. అప్పుడు రచయితల కర్తవ్యమేమిటి అని పండితారాధ్యుల నాగేశ్వరరావు ప్రచారం ప్రారంభించాడు. ఇదంతా సాహిత్య సాంస్కృతిక రంగాలలో కొత్త ఆలోచనలకు దారితీసింది. ముఖ్యంగా సంస్కృతి గురించి అంతకు ముందున్న ఆలోచనలకంటే కొత్త ఆలోచనలు మొగ్గ తొడిగాయి. దీనికి సాహిత్య రంగం కేంద్రమయింది. సాహిత్యం పాత్ర ఇదే. మానవ జీవితంలోని అతి ముఖ్యమైన సంస్కృతి తదితర అంశాల మౌలిక చర్చను ఒక సందర్భంగా ముందుకు వచ్చినపుడు రచయితలే చేస్తారు. కుటుంబరావుగారు అన్నట్లు సంఘర్షణ వచ్చినపుడు రచయితలు తటస్థంగా ఉండలేరు. సాహిత్య సాంస్కృతిక రంగాలలో వర్గ పోరాటం అనదగిన సంఘర్షణకు

కారణం అవుతారు. గోర్కీని సాహిత్య అకాడమీ నుంచి తీసివేసినపుడు రష్యాలో చెకోవ్ రాజీనామా చేశాడు. లిట్మస్ టెస్ట్ అని అంటాం గదా సరిగ్గా అలాంటి సందర్భం ఒకటి ముందుకు వచ్చి అందరినీ నిలదీస్తుంది. అప్పుడు నిలబడినవారే కొత్త ఆలోచనలకు ప్రాణం పోస్తారు. అట్లా 55 ఎన్నికల్లో కమ్యూనిస్టుల పక్షాన నిలబడ్డ రచయితలు సామాజిక రాజకీయ సంస్కృతి గురించిన చర్చకు కారణమయ్యారు.

ఇంత జరిగీ ఆ ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ ఓటమి పాలయ్యింది. అది వేరే విషయం. అయినా అప్పుడు జరిగిన ప్రచారం మధ్య తరగతిని, విద్యావంతుల్ని కొంతైనా ఆకట్టుకుంది. అయితే ఆ తర్వాత కొన్నాళ్ళకి తిరుపతిలో ప్రపంచ సంస్కృత మహాసభ జరిగింది. అక్కడ సంస్కృతం, సంస్కృతి ఒకటే అని ప్రతిపాదించారు. నార్ల తెలుగులో రష్యాను పొగుడుతూ రాసిన తొలి వ్యక్తి. ఆయన హేతువాది, నాస్తికుడు. ఆయనకు మతం పట్టింపు లేదు. ఆయన తిరుపతిలో జరిగిన ప్రతిపాదన మీద స్పందిస్తూ సంస్కృతం సంస్కృతీ ఒకటి కాదు అని రాశాడు. ఆయనే అంతకుముందు ఎన్నికల్లో కమ్యూనిస్టులను ఓడించమని, కమ్యూనిజం భారతీయ సంస్కృతికి వ్యతిరేకమని 15 సంపాదకీయాలు ('ప్రగతి') రాశాడు. కాంగ్రెస్‌ను గెలిపించడానికి, భారతీయ సంస్కృతికి మార్క్సిజం వ్యతిరేకమని చెప్పడానికి అంత పెద్ద ఎత్తున శ్రమచేసినవాడే తిరుపతి ప్రపంచ సంస్కృత మహాసభ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకిస్తూ రాశాడు. సంస్కృతి గురించి అధ్యయనం చేసేవాళ్లకి ఆయన రాసిన వ్యాసం బాగా ఉపయోగపడుతుంది. సంస్కృతం, సంస్కృతి ఒకటి కాదు. ధర్మం, న్యాయం, నాగరికత ఒకటి కాదు అని చాలా వివరంగా రాశాడు. సంస్కృతం అంటే అహంకారం కాదు, అతిశయం కాదు, గర్వం కాదు అని రాశాడు. ఇది అందరూ చదవవలసినది.

అయితే సంస్కృతి చర్చలో ఏది సంస్కృతి కాదో తేలికగా చెప్పవచ్చు. నార్ల కూడా ఆ వ్యాసంలో అట్లాడే చెప్పాడు. ఇవాళ మోడీ అసహనం కానీ, వెంకయ్య నాయుడి వగరుబోతుతనం కానీ, అద్వానీ ప్రవచనాలు కానీ, సంస్కృతి కాదని వాళ్ళు చెప్పేది సంస్కృతికి దోహదపడేది కాదని స్పష్టంగా చెప్పవచ్చు. కానీ, సంస్కృతి అంటే ఏమిటి అని చెప్పడం చాలా చిక్కుతో కూడిన పని. భారతీయ సంస్కృతి అంటే ఏమిటి? అది ఒక అవిచ్ఛిన్నమైన స్రవంతా అనే ప్రశ్న వస్తుంది. అట్లాగే హింసాహింసల చర్చ కూడా వస్తుంది. ఇదే నార్ల, కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా

రాసిన సందర్భంలో పార్టీ తరఫున ప్రత్యగాత్మ చాలా మంచి రిప్లై రాశాడు. హింస కమ్యూనిస్టుల సంస్కృతి అనీ అది భారతీయం కాదని నార్ల అంటే ప్రత్యగాత్మ – మహాభారతంలో పాండవులు చేసింది, కాకతీయులు చేసింది, పల్నాటి వీరులు చేసింది హింస కాక మరేమిటి అని ప్రశ్నించాడు. ఇవాళ బిజెపి ప్రచారం చేస్తున్నట్టు భారతీయ సంస్కృతి ఏకశిలా సదృశం కాదు. ప్రత్యగాత్మ ప్రశ్నించినట్టు "ఏది భారతీయ సంస్కృతి? పదహారువేల తొమ్మిది మంది (రాధతో సహా) స్త్రీలతో జీవించిన కృష్ణుడిదా? ఏకపత్నీ వ్రతుడైన శ్రీరాముడిదా? అలాగే యజ్ఞయాగాదుల సంరక్షణ కోసం విల్లు ఎక్కుపెట్టిన శ్రీరాముడిదా? యజ్ఞయాగాదుల్ని నిరసించిన బుద్ధుడిదా? మాయావాదాన్ని మోసుకు తిరిగిన శంకరుడిదా? ఏనాటి నుంచో ఈ దేశం భౌతికవాదాన్ని భుజాల మీద ఎక్కించుకున్న చార్వాకులదా?' అందుకని భారతీయ సంస్కృతి ఒక సజీవ ప్రవంతి. అందులో అనేక పాయలున్నాయి.

ఇంతకీ చాలా ఎక్కువ ఆమోదం పొందే ఒక నిర్వచనాన్ని ఉటంకిస్తాను. "culture, then, is not some thing that stays in lead, it is some thing that lives in life; it is not an accumulation of learning, but an application of experience and education...." అన్నాడు విల్‌డ్యురాంట్. "సంస్కృతి అంటే మన బుర్రలో నిల్వవుండేది కాదు. అది జీవితంలో జ్వలించేది. పాండిత్యం పోగుచేయడం కాదు, విద్యనీ అనుభవాన్నీ అన్వయించేది సంస్కృతి..."

కల్చర్‌గా మనం చెప్పుకుంటున్నది నిజ జీవితంలో చాలా వైవిధ్యమైనది. సంస్కృతి అంటే జీవన విధానం అనే నిర్వచనం ఇక్కడి నుండే వచ్చింది. సంస్కృతిని, ఆంత్రోపాలజీని, చరిత్రని, మతాన్ని, సైన్స్‌నీ, వ్యవసాయాన్నీ పరిశీలించినవాళ్లు చేసిన సూత్రీకరణల్లో భారతీయ సంస్కృతి అనే దాంట్లో చాలా వైవిధ్యం ఉన్నది. దానికి మనం గర్వించాలి. అయితే సంస్కృతి అంటే ఫలానా అని మాత్రమే చెప్పి మిగతా సంస్కృతికి, సాంస్కృతిక వైవిధ్యానికి అపచారం చేయడం నేరమౌతుంది.

సంస్కృతికి బాహ్యరూపం నాగరికత. అయితే దీనికి మూలం భూమి, శ్రమ. శ్రమను మనం యెలా చూస్తాం అనే దాన్ని బట్టి మన సంస్కృతి అవగాహన తేలుతుంది. శ్రమ పట్ల మనిషికి ఉండే గౌరవం మానవ సంబంధాలను ప్రభావితం చేస్తుంది. శ్రమ లేనిదే కోతి నుండి మనిషి రూపొందేవాడు కాదు. దీని గురించి ఎంగెల్స్ వానరుడి నుండి నరుడు శ్రమ శక్తి వల్లనే వచ్చాడని శ్రమను కేంద్రం చేసుకొని రాశాడు. మార్క్సిస్టులు కాని వాళ్ళు కూడా దీన్ని అంగీకరించారు.

చరిత్ర గురించి టోయన్‌బి అనే రచయిత పన్నెండు సంపుటాలు రాశాడు. అతను భౌతికవాద దృక్పథం నుండి రాయలేదు. బాగా చదువుకున్నవాడు. అతని లెక్క ప్రకారం 26 నాగరికతలు ప్రపంచంలో వెల్లివిరిసాయి. అందులో 12 చచ్చిపోయాయి. మిగిలినవి బతికి ఉన్నాయి. అతనితో పోటీ అనలేము గాని విల్‌డ్యూరాంట్ అనే అమెరికా రచయిత ఒక ఆకు ఎక్కువే చదివాడు. ఇతను స్పష్టంగా రెండు మాటలు రాశాడు. అతను మనిషిని శ్రమ కేంద్రంగా వివరిస్తూ నాగరికత నుంచి సంస్కృతిని వేరుచేశాడు. ఇక్కడే ఒక విషయం తెలుసుకోవాలి. మూఢనమ్మకాలు, మతం, పురాణాలు ఒక్క భారతదేశంలోనే లేవు. ప్రపంచంలోని అన్ని దేశాల్లో ఉన్నాయి. వీటికి సంస్కృతితో సంబంధం ఉన్నది కాని అదే సంస్కృతి అనుకోవడం తప్పు. నాగరికత గురించి పరిశీలనలో వాటి స్థానాన్ని స్పష్టం చేసుకోవచ్చు.

సంస్కృతికి తత్త్వశాస్త్రంలో, ఆర్థిక శాస్త్రంతో సంబంధం ఉంటుంది. వీటి ప్రమేయం లేకుండా సంస్కృతి గురించి ఆలోచించే వాళ్లు మూఢనమ్మకాలు మొదలైన వాటికి సంస్కృతిలో ఎక్కువ చోటు ఇస్తారు. లేదా అవే సంస్కృతి అని కూడా చెప్తారు.

1945లో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత యునెస్కో ఏర్పడింది. బూర్జువా నియమం ప్రకారం ఒక కంపెనీ పెట్టేటప్పుడు దాని పేరుతో వున్న ప్రతి పదానికి నిర్వచనం ఇవ్వడం ఆనవాయితి. అట్లా యునెస్కోను నిర్వచించేటప్పుడు అందులో ఉండే అన్ని పదాలు వివరించారు. కాని సంస్కృతి దగ్గరికి వచ్చేసరికి పచ్చి వెలక్కాయ గొంతులో పడింది. కల్చర్ అంటే ఏమిటి? అనే ప్రశ్న ఎదురయ్యింది. అపుడు కల్చర్ ఈజ్ నాట్ పాలిటిక్స్ అని నిర్వచనం యిచ్చుకొని సంతృప్తి పడ్డారు. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొని మావో 'నూతన ప్రజాస్వామ్యం'లో ఇచ్చిన నిర్వచనం గుర్తుచేసుకోవడం మంచిది. ఒక నిర్దిష్ట రాజకీయ ఆర్థిక పునాది మీద నిర్మితమైన కట్టడియే సంస్కృతి అన్నాడాయన. మానవ సంబంధాలను ఉన్నతీకరించడమే విప్లవ లక్ష్యంగా ఉన్న వాళ్లందరికీ నూతన సమాజ నిర్మాణానికి సంస్కృతి గురించిన చర్చ అవసరం.

**(కొ.కు. రచనా ప్రపంచం, సంస్కృతి వ్యాస సంపుటికి రాసిన ముందుమాట)**



# 19. గిరిజనులు - గిరిజన సంస్కృతి

**-కీ॥శే॥ కె. బాలగోపాల్** (మానవ హక్కుల కార్యకర్త)

ప్రతి దేశానికి తన నైసర్గిక, చారిత్రక, సామాజిక ప్రత్యేకతలు కొన్ని ఉంటాయి. భారతదేశానికి గల ప్రత్యేకతలలో 'గిరిజనులు' అనేది ఒకటి. ఇతర దేశాలలో గిరిజనులు లేరని కాదు గాని, మన దేశంలో గిరిజనులకు ఒక ప్రత్యేకమయిన స్థానం ఉంది. సంఖ్య రీత్యా జనాభాలో 7 శాతమే అయినా గిరిజనులు దేశంలోని అన్ని రాష్ట్రాలలోను నివసిస్తున్నారు. బ్రిటిష్ వాళ్ళ కాలం నుండి ఇప్పటిదాకా మన దేశం సాధించిన 'అభివృద్ధి' వల్ల అత్యధికంగా నష్టపోయింది గిరిజనులే. అత్యధికంగా ఈ 150 సంవత్సరాలలో తిరుగుబాట్లు చేసింది కూడా గిరిజనులే.

గిరిజనులు అనగానే తలలో ఈకలు, మొలలో గజ్జెలు ఉండే విచిత్ర జీవులని సామాన్య నాగరికులు భావిస్తారు. ఎక్కడో అడవులలో నివసిస్తూ తెల్లబట్టలు కనబడగానే పారిపోయే భయస్తులు అని కొంత చదువుకున్నవాళ్ళు భావిస్తారు. గిరిజనుల భావనలో చెప్పాలంటే వాళ్ళు తమను తాము 'కొండ మనుషులు'గాను, 'అడవి మనుషులు'గాను భావించుకుంటారు. ఈ రకంగా చూస్తే వాళ్ళకు మనం పెట్టుకున్న గిరిజనులు, ఆటవికులు అనే పేర్లు వాళ్ల చైతన్యం యొక్క సంస్కృతీకరణే.

హిందీ తదితర ఉత్తర భారతదేశపు భాషలలో ఈ రెండు పేర్ల బదులు 'ఆదివాసులు' అన్న పేరు ప్రయోగిస్తారు. గిరిజనులే ఈ దేశంలో నిజమయిన ఆదివాసులని, 'మనం' అంతా ఎప్పుడో ఒకప్పుడు బయట నుండి వచ్చి ఆదివాసులను అడవులలోకి తరిమివేశామని ఈ ప్రయోగం వెనుక ఒక సిద్ధాంతం ఉంది. ఇంకొంచెం విడమర్చి చెప్పాలంటే, మొదట ద్రావిడులు వచ్చి ఆదివాసులను అడవులలోకి తరిమివేయగా, తరువాత ఆర్యులు వచ్చి ద్రావిడులను దక్షిణానికి తరిమేసారని చెపుతుంది ఈ సిద్ధాంతం. ఏ పుస్తకంలోనూ ఈ సిద్ధాంతం రాయకున్నా దీన్ని నమ్మేవాళ్ళు చాలామంది ఉన్నారు.

మన దేశానికి బయటి నుండి మొదట ద్రావిడులు (అంటే ద్రవిడ భాష మాట్లాడేవాళ్లు), తరువాత ఆర్యులు వచ్చిన మాట వాస్తవమే. ఇవ్వాళ వీళ్ళ భాషలు ప్రబలంగా ఉండడాన్ని బట్టి చూస్తే ఇక్కడి ఆదివాసుల మీద వాళ్ళు ఆధిపత్యం నెలకొల్పినట్లు కూడా తోస్తుంది. అయితే వీళ్ళు ఆదివాసులను అడవులలోకి తరిమేసి తాము మైదానాలను ఆక్రమించుకున్నారన్న సిద్ధాంతానికి ఋజువు దొరకదు. వీళ్ళు 'శుద్ధంగా' ఎన్నడు ఉండలేదు. ఇక్కడి ఆదివాసులతో కేవలం సామాజికంగానే

కాక భౌతికంగా కూడా కలిసిపోయారు. ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే ఇవ్వాళ మైదానాలుగా ఉన్న ప్రాంతాలు ఎల్లప్పుడూ మైదానాలుగా లేవు. ఒకప్పుడవి దట్టమయిన అడవులుగా ఉండేవి. విదేశాల నుంచి వచ్చిన ద్రావిడుల 'అంశ' ఇవాళ్టి గిరిజనేతరులలోనే కాదు, గిరిజనులలోనూ ఉంది. అలాగే ఆదివాసుల 'అంశ' కూడా ఇద్దరిలోనూ ఉంది. ఇవాళ్టి తెగలలో కొన్నింటిని శాస్త్రజ్ఞులు ద్రవిడపూర్వ (ప్రి-ద్రవిడియన్) తెగలుగా గుర్తిస్తే మరికొన్నింటిని ద్రవిడ తెగలుగా గుర్తిస్తారు. నీలగిరి కొండలలోని తోడ అనే పశుపోషక తెగ ద్రవిడపూర్వ తెగ గాని, ద్రవిడ తెగ గాని కాదని, బహుశా పశ్చిమ ఆసియా నుండి వచ్చి ఇక్కడ స్థిరపడ్డ తెగ అని భావిస్తారు. బంజారా (లంబాడా)లు కూడా పశ్చిమ ఆసియా నుండి వచ్చిన తెగ అనే అభిప్రాయం ఉంది. మరయితే ఇవ్వాళ కనిపించే గిరిజన గిరిజనేతర విభేదానికి మూలం ఎక్కడ చూడాలంటే దానికి సమాధానం వేరే ఉంది.

మన దేశమంతా ఒకప్పుడు అడవే అయినట్టు మనం అంతా కూడా ఒకప్పుడు ఆటవికులమే. వేట, పశుపోషణ, ఆహార సేకరణ, పోడువ్యవసాయం (మనందరికీ కూడా) జీవనాధారాలుగా ఉండేవి. ద్రావిడులయినా ఆర్యులయినా మన దేశానికి వచ్చినపుడు ఈ స్థాయిలో ఉన్నవారే. సామూహిక శ్రమ, సమిష్టి జీవనం, సమానత్వం, ఆ స్థాయికి తగ్గ సామాజిక సంబంధాలు... అందరిలోనూ అవే లక్షణాలు ఉండేవి. ఇవి క్రమంగా విచ్ఛిన్నమవుతూ వచ్చి, నదీ డెల్టా ప్రాంతాలలోనూ, లోయలలోనూ, ఇతరత్రా వ్యవసాయ యోగ్యమయిన ప్రాంతాలలోనూ స్థిర వ్యవసాయం ప్రారంభమయి, ఆదిమ ఆటవిక సమాజం నశించి అడవులు క్రమంగా మైదానాలయ్యాయి. ఆటవిక సమాజం కూడా ఒకరినొకరు దోచుకునే వ్యవసాయకవర్గ సమాజంగా మారింది. ఆనాటి వ్యవసాయ పద్ధతుల పరిధిలో అంతగా వ్యవసాయ యోగ్యం కాని కొండలూ, పీఠభూములూ అడవులుగానే ఉండిపోయాయి. మైదాన ప్రాంతాల ప్రజలు ఆటవిక సామూహిక సంబంధాలు వదులుకొని మన దేశపు వర్గ సమాజానికి ప్రత్యేక లక్షణమయిన కుల సంబంధాల నిర్మాణంలోకి వచ్చారు. ఇట్లా నాగరికులయిన వాళ్ళు ఎప్పటికప్పుడు విస్తరిస్తూ, చుట్టూ ఉన్న అడవులను ఆక్రమించుకొని మైదానాలను చేస్తూ, అక్కడి ఆటవికులను వర్గ సమాజపు అధోభాగంలో బలవంతంగా కలుపుకుంటూ, వాళ్లను కూడా ఆ విధంగా నాగరికులను చేస్తూ వచ్చారు.

మన దేశ సామాజిక - నైసర్గిక లక్షణాలను దృష్టిలో ఉంచుకుంటే ఈ చారిత్రక క్రమాన్ని పునర్నిర్మించుకోవచ్చు. మూడు నుండి నాలుగు వేల సంవత్సరాల

క్రితం సముద్ర తీరంలోని నదీ డెల్టాలలోనూ, నదీ లోయలలోనూ, ఇతరత్రా అనుకూలమయిన ప్రాంతాలోనూ ఆటవిక సమాజం నశించి వ్యావసాయిక వర్గ సమాజం ఏర్పడడం ప్రారంభమయింది. సముద్రతీరంలోని పల్లపు భూములు, కృష్ణ, గోదావరి, కావేరి, మహానది, నర్మద, తపతి, ఇతర ఉత్తర భారతదేశపు నదులు – ఒక్కొక్కటీ ఒక్కొక్క కేంద్రమయింది. ఈ ఒక్కొక్క కేంద్రంలో ఏర్పడ్డ వర్గ సమాజం ఒక్కొక్క 'జాతి'కి (తెలుగు, తమిళ, మలయాళ, మరాఠా, ఒరియా వగైరా) బీజమయింది. ఈ జాతులు ఆ కేంద్రం నుండి వీలైనంత దూరం విస్తరిస్తూ అడవులను మైదానాలుగా మారుస్తూ అక్కడి ఆటవికులను తమలో బలవంతంగా కలుపుకుంటూ పోయాయి. ఈ విధంగా ఒక్కొక్క ఆధునిక జాతి ఏర్పడింది. ఒక జాతికీ మరొక జాతికీ మధ్య ప్రాంతంలో వాటి విస్తరణకు ఇంతవరకు లొంగని కొన్ని అడవులు, పీఠభూములు మిగిలిపోయాయి. అక్కడ నివసించే ఆటవికులు ఆర్థికంగా ఇప్పటికీ ఆటవికులుగానూ, సాంస్కృతికంగా ఏ జాతికీ చెందనివారుగానూ మిగిలిపోయారు. అందుకే మన దేశంలో ఏ రెండు పరిసర రాష్ట్రాలను తీసుకున్నా వాటి సరిహద్దులో అడవులు, కొండలు, పీఠభూములు, అక్కడ నివసించే గిరిజనులు కనబడతారు. ఏ రాష్ట్రంలోనూ రాష్ట్ర గర్భంలో గిరిజనులు కనబడరు. మన రాష్ట్రాన్నే తీసుకుంటే ఉత్తర సరిహద్దుకు ఒక చివరనున్న శ్రీకాకుళం నుండి పడమట ఉన్న ఆదిలాబాద్, నిజామాబాద్ దాకా దట్టమయిన అడవులు, కొండలు ఉంటాయి. ఆ అడవులలో నివసించే సవర, జాతాపు, కోయ, కొండరెడ్డి, నాయకపు, గోండు, కొలాం తదితర గిరిజనులు కనబడతారు. ఈ సరిహద్దు దాటితే ఒరియా, హిందీ, మరాఠీ భాషలు మాట్లాడే నాగరికులు తగులుతారు. అలాగే దక్షిణాన ఉన్న రాయలసీమ జిల్లాలలో తూర్పు కనుమలు, నల్లమల కొండలు, ఆ అడవులలో నివసించే చెంచు, యానాది, ఎరుకల గిరిజనులు కనబడతారు. ఆ సరిహద్దు దాటితే తమిళ, కన్నడ జాతులు తగులుతాయి.

ఇది ఏ రాష్ట్రానికయినా వర్తిస్తుంది. ఒరిస్సాకు దక్షిణ సరిహద్దు జిల్లా అయిన కోరాపుట్‌లో సవర, బొండా, గదబ తెగలు నివసిస్తాయి. అటు చివర ఒరిస్సాను బీహార్ నుండి వేరుచేసే ఛోటానాగ్‌పూర్ పీఠభూమి అడవులలో కోల్, ఒరవాన్, సంథాల్, ముండా తెగలు నివసిస్తాయి. తూర్పు పశ్చిమ బెంగాల్ సరిహద్దులోని చిటగాంగ్ కొండలలో చక్మా గిరిజనులు నివసిస్తారు. గుజరాత్ – రాజస్థాన్ సరిహద్దు పీఠభూమిలో భిల్లులు నివసిస్తారు. మహారాష్ట్ర దక్షిణ సరిహద్దులో వర్లీలు, తమిళనాడు–కేరళ సరిహద్దుల్లోని పడమటి కనుమలలో పాలియన్‌లు, తమిళనాడు – కర్నాటక సరిహద్దు దగ్గరున్న నీలగిరి కొండలలో తోడ తెగ గిరిజనులు, మహారాష్ట్ర – మధ్యప్రదేశ్ సరిహద్దు అడవులయిన సిరోంచ, బస్తర్‌లలో గోండులు, కోయలు నివసిస్తారు.

ఈ గిరిజనులందరూ కూడా ఇప్పటివరకు ఆయా ప్రాంతాల వర్గ సమాజ విస్తరణకు లొంగనివాళ్ళు. ఈ విస్తరణే మన దేశ చరిత్రలోని ముఖ్యమైన భౌతిక క్రమాలలో ఒకటి. నాలుగు వేల సంవత్సరాలుగా మైదానాలు, అడవులను అక్రమించుకుంటూ సాగిన విస్తరణ అది. ఇది ఇప్పటికీ అంతరించని క్రమం. ఇది శాంతియుతంగాను, మర్యాదగాను సాగిందని అనుకుంటే భ్రమే అవుతుంది. కాంట్రాక్టర్ల ద్వారా, ప్లాంటేషన్‌ల ద్వారా, వడ్డీ వ్యాపారస్తుల ద్వారా, గిరిజనేతర భూస్వాముల భూ ఆక్రమణ ద్వారా ఇవ్వాళ ఎంత దౌర్జన్యంగా సాగుతున్నదో గతంలో కూడా అంతే దౌర్జన్యంగా సాగింది. మౌర్య చక్రవర్తి అశోకుడి ఘనతను కీర్తించే చరిత్రకారులు ఆయన అడవులను వ్యవసాయం కిందికి తీసుకురావడానికి చేసిన ప్రయత్నాన్ని ప్రముఖంగా ప్రస్తుతిస్తారు. ఆయన చేసిందేమిటంటే కొత్తగా భూములు వ్యవసాయం కిందికి వస్తే రాజుగారికి రెవెన్యూ పెరుగుతుంది. కాబట్టి, అడవులను నరికి వ్యవసాయ యోగ్యం చేసి కొత్త గ్రామాలను ఏర్పరచే వాళ్ళకు ప్రోత్సాహం ఇచ్చేవాడు. అట్లా కొత్తగా ఏర్పడ్డ గ్రామాలకు కొంతకాలం శిస్తు మాఫీ చేసేవాడు. కౌటిల్యుడి అర్థశాస్త్రంలో కూడా ఇటువంటి ఎత్తుగడల ప్రస్తావన ఉంది. ఈ విధంగా రాజుగారి ప్రోత్సాహంతో చాలామంది నాగరికులు అప్పటికింకా దట్టమయిన అడవులలో నిండివున్న గంగా, యమునా లోయలను వ్యవసాయ యోగ్యం చేశారు. అప్పటి ఆటవికులు ఈ క్రమానికి లొంగిపోయి తమ స్వతంత్ర జీవితాన్ని వదిలిపెట్టి కూలీలుగా మారిపోయారు. హిందూ సమాజపు నిమ్న కులాలలో (ఎక్కువగా మాల మాదిగ కులాలలో) కలిసిపోయారు. ఈ మార్పును ప్రతిఘటించదలుచుకున్న వాళ్ళకు సారవంతమయిన మైదానాలను వదిలి ఛోటానాగపూర్ వంటి పీఠభూమి ప్రాంతాలకు వెళ్ళడం తప్ప గత్యంతరం లేదు. కాబట్టి కొంత ప్రతిఘటించినా, అంతిమంగా చాలామందే లొంగిపోయే ఉంటారు. అశోకుడి కాలంలో చక్రవర్తి ప్రోత్సాహంతో జరిగిన ఈ దౌర్జన్యం ఇతర కాలాలలో చాలా మామూలుగా జరుగుతూనే వచ్చింది.

ఆటవికులను నాగరికులను చేస్తూ, నాగరిక వర్గ సమాజపు అధోభాగంలో (కూలివర్గంగా, తక్కువ కులాలుగా) కలుపుకుంటూ వచ్చిన అత్యంత ప్రధానమయిన ఈ క్రమానికి మనకు ప్రత్యక్షమయిన సాక్ష్యాలుగానీ ఆధారాలుకానీ దొరకవు. ముస్లిం రాజవంశాల పరిపాలనకు పూర్వం మన దేశంలో ప్రజల చరిత్ర అటుంచి రాజుల చరిత్ర సహితం ఎవ్వరూ రాయలేదు. అయితే ఈ క్రమం యొక్క ప్రతిబింబం మన పౌరాణిక సాహిత్యంలోనూ, గిరిజనుల పురాణ గాథలలోనూ కనబడుతుంది.

గిరిజనుల దేవతలు, వాళ్ళ 'ఆదిపురుషులు' హిందూ పురాణాలలో ప్రవేశించి హిందూ దేవతలతో సమానంగా కాకపోయినప్పటికీ వాళ్ళ సేవకులుగా, భక్తులుగా, వాళ్ళ కరుణా కటాక్షాల చేత పునీతులయిన పాపులుగా లేదా హిందూ పౌరాణిక హీరోలకు రెండవ భార్యలుగా కనబడతారు. హిందువుల వర్గ సమాజంలోకి అల్ప స్థాయిలో ప్రవేశించినవారు వాళ్ళ సాహిత్యంలోకి కూడా అల్పస్థాయిలో ప్రవేశించక తప్పలేదు.

రాముడి దర్శనం కోసం పడిగాపులు పడి అతడు తాను ఎంగిలి చేసిన ఫలాన్ని తినగానే జన్మ తరించిందనుకున్న శబరి సవర తెగకు చెందిన స్త్రీ. రాముడు అరణ్యాలకు పోతున్నప్పుడు దారిలో అతని సేవ చేసిన గుహుడు ఛోటానాగపూర్ ప్రాంతానికి చెందిన సంథాల్, కోల్ లేక ఒరవాన్ తెగ గిరిజనుడు అయి ఉండాలి. ద్రోణుడు విలువిద్య నేర్పడానికి నిరాకరిస్తే అతని విగ్రహాన్ని ప్రతిష్ఠించి తానే విలువిద్య అభ్యసించి, చివరికి ఆ గురువుగారికి గురుదక్షిణగా తన బొటనవేలు ఇచ్చిన ఏకలవ్యుడు భిల్లు తెగకు చెందినవాడు. అడవిలో పడుకున్న కృష్ణుడిని దూరం నుంచి చూసి మృగం అనుకుని బాణం వేసి చంపిన జంధుడు (జరా) కూడా భిల్లు తెగకు చెందిన వాడే. ఈ విధంగా హిందూ పురాణాలలోకి హేయమయిన స్థానంలో ప్రవేశించడమే కాక, తమ పౌరాణిక గాథలలో సైతం గిరిజనులు వాటిని ఆమోదించిన దాఖలాలున్నాయి. కృష్ణుడిని చంపిన పాపం వల్ల భిల్లులకు విల్లంబులు వాడరాదనే శాపం తగిలిందని, అందుకే భిల్లులు విల్లంబులు వాడలేరని నమ్ముతారు. పాండవులు లక్క ఇంటి నుండి తప్పించుకొని అడవులలో తలదాచుకుంటున్నప్పుడు భీముడు హిడింబ అనే ఆటవిక స్త్రీని పెళ్ళి చేసుకొని ఆమె వల్ల ఒక కొడుకు పుట్టగానే ఆమెను తరిమేస్తాడు. మన దేశంలోని అన్ని గిరిజన తెగలలోకి అత్యధిక సంఖ్యాకులయిన గోండులు తమను తాము ఆ హిడింబ సంతానంగా భావించుకుంటారు. గోండులకు 'భీము' ముఖ్యమయిన దేవుళ్ళలో ఒకడు. 'భీము' అనేది వారిలో చాలా సామన్యమయిన పేరు. ప్రతి సంవత్సరం భీమ హిడింబల వివాహాన్ని గోండులు విప్ప సారాతో వేడుకగా జరుపుకుంటారు. నల్లమల కొండలలో నివసించే చెంచులలో కూడా ఇటువంటి పురాణమే ఉంది. అడవులలో తిరుగుతున్న నరసింహుడు ఒక చెంచు యువతిని పెండ్లి చేసుకొని ఆమెకు చెంచులక్ష్మి అని నామకరణం చేసి వైకుంఠానికి తీసుకుపోతాడు. అక్కడి ఆదిలక్ష్మి (మార్వాడీల లక్ష్మి) ఈ సవతిని ఒల్లకపోయేసరికి నరసింహుడు విధి లేక ఆమెను వదిలిపెడతాడు. అందువల్ల చెంచు స్త్రీలకు అందవికారంగా ఉండాలనే శాపం కూడా ఉందని చెంచులు

నమ్ముతారు. అంటే నాగరిక సమాజానికి లొంగిపోయే క్రమంలో ఆటవిక స్త్రీలు 'అందగత్తెలు' కారన్న నాగరిక ప్రమాణాన్ని తాము కూడా ఆమోదించడమే కాక దానికి ఇటువంటి కథ ద్వారా పౌరాణిక 'వివరణ' కూడా ఇచ్చుకుంటున్నారు. సాంస్కృతిక దౌర్జన్యం ఎంత బలంగా ఉండగలదో దీనివల్ల అర్థమవుతుంది.

రామాయణం రాసిన వాల్మీకి కూడా భిల్లు తెగకు చెందినవాడే. అతడు 'బందిపోటు' అనీ, రామాయణం రాసి పునీతుడయ్యాడనీ మనం చదువుకున్నాం. వాస్తవానికి భిల్లులు చాలావరకు ఆహార సేకరణ (food-gathering) మీద ఆధారపడి జీవించే తెగ. అంటే కనబడ్డ ఆహారాన్ని ఏరుకొని (జంతువయితే పట్టుకొని) జీవిస్తారు. స్వంత ఆస్తి మీద ఆధారపడే వర్గ సమాజం ఆహార సేకరణను దొంగతనంగా భావిస్తుంది. భావించడమే కాదు, ప్రతీ వస్తువునూ ఎవరో ఒకరి ఆస్తిగా ప్రకటించడం వల్ల వాళ్ళను బలవంతంగా దొంగలుగా మారుస్తుంది. శాసనాలంటే చాలా ప్రేమ ఉన్న బ్రిటీష్‌వాళ్ళు వీళ్ళకు Criminal Tribes అని పేరు కూడా పెట్టారు. భిల్లుడయిన వాల్మీకి ఈ విధంగా నాగరికత చేత బందిపోటుగా గుర్తించబడ్డాడు. గుర్తించబడి, ఆ నాగరికులకు పవిత్ర గ్రంథమయిన రామాయణాన్ని రాసి పవిత్రుడయ్యాడు!

వర్గ సమాజం గిరిజనులను లోబరుచుకునే క్రమంలో వాళ్ళ దేవుళ్ళనూ గుళ్ళనూ కూడా స్వంతం చేసుకుంది. కర్నూలు జిల్లాలోని శ్రీశైలం, అహోబిలం దేవాలయాలు ఒకప్పుడు చెంచులవేనని చరిత్రకారులు నమ్ముతారు. అలాగే కొండలలోనూ, అడవులలోనూ ఉన్న తిరుపతి, భద్రాచలం మొదలైన దేవాలయాలు చాలావరకు ఒకప్పుడు గిరిజనులవేనని చెప్పవచ్చు. అడవులను ఆక్రమించుకొని, అక్కడి ఆటవికులను కూలివాళ్ళుగానూ, శిస్తు చెల్లించే రైతులుగానూ లోబరుచుకునే క్రమంలో భాగంగా వాళ్ళ దేవుళ్ళకు ప్రమోషన్ ఇచ్చి విష్ణు అవతారంగానో ఈశ్వరుడి ప్రతిరూపంగానో గుర్తించాల్సిన అవసరమే లేకపోతే, అంతటి మారుమూల ప్రాంతాలలో దేవాలయాలు నిర్మించాల్సిన అవసరం ఏ రాజుగారికయినా ఎందుకు కలుగుతుంది? అయితే ఇదంతా ప్రయత్న పూర్వకంగా చేసిన కుట్ర అనుకుంటే పొరపాటవుతుంది. చరిత్రలో 90 శాతం కుట్రలు ఎవ్వరి ప్రయత్నం లేకుండా చరిత్ర గమనంలో భాగంగా జరిగేవే. జరిగిన తరువాత వాటిని వివరించే పౌరాణిక గాథలు కూడా 90 శాతం ఎవరి ఉద్దేశ్యం లేకుండ కల్పించబడతాయి. పూరీ జగన్నాథుడి దేవాలయం ఇవ్వాళ హిందువులకు ముఖ్యమైన పుణ్యక్షేత్రాలలో ఒకటి. కాని ఆ గుడిలో జగన్నాథుడి బొమ్మను చూసిన వారెవరికైనా అతడు ఆటవికుల

దేవుడని నిస్సందేహంగా తెలుస్తుంది. మామూలుగా హైందవ దేవుళ్ళ విగ్రహాలకుండే అంగసౌష్టవంకాని, కూర్పుగాని ఆ దేవుడికి ఉండదు. చాలా 'ఆటవికంగా' ఉంటుంది. ఆ గుడి ఒకప్పుడు బీహార్ – బెంగాల్ – ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దులలో నివసించే లోథా తెగ గిరిజనులది. ఆ లోథా తెగను లోబరుచుకొని కోస్తా ఒరిస్సాకు పాకిన హైందవ వర్గ సమాజం ఆ గుడిని స్వంతం చేసుకుంది. ఈ దురాక్రమణను లోథాలు ఒక కథ ద్వారా పురాణీకరించుకున్నారని కమలాదేవి ఛటోపాధ్యాయ అంటుంది. అదేమిటంటే పూరా మహారాజు జగన్నాథుని విగ్రహాన్ని లోథాల దగ్గరి నుండి దొంగిలించేందుకు తన మంత్రిని పంపాడట. ఆ మంత్రి లోథారాజు కుమార్తెను ప్రేమిస్తున్నట్లు నటించి ఆమెను పెళ్ళి చేసుకొని కొంతకాలం అక్కడే నివసించాడట. నెమ్మదిగా వాళ్ళ విశ్వాసం సంపాదించి విగ్రహాన్ని చేజిక్కించుకొని భార్యను వదిలిపెట్టి  వెళ్ళిపోయాడట.

ఇవ్వాళ మనం మన కళ్ళముందు ఇటువంటివెన్నో చూడగలుగుతాం. ఒకప్పుడు కేవలం గిరిజనుల పుణ్య తీర్థాలయినవి (ఉదాహరణకు తెలంగాణలోని కేస్లాపురం, మేడారం వగైరా) ఇప్పుడు క్రమంగా గిరిజనేతరుల జాతరలవుతున్నాయి. కొంత కాలానికి అక్కడి గిరిజన దేవుళ్ళు హిందూ దేవుళ్ళ అవతారాలుగా పరిణామం చెంది గిరిజన దేవుళ్ళ గుళ్ళ స్థానంలో హిందూ దేవాలయాలు వెలిసినా ఆశ్చర్యం లేదు. (ఆదిలాబాద్‌లోని గోండ్ల పుణ్యస్థలమయిన కేస్లాపురంలో శివుడి ఆలయం నిర్మించాలని కిందటి సంవత్సరం అక్కడి కాంగ్రెసు (ఐ) యువ గూండాలు సూచించారు). గిరిజనుల అడవులను ఆక్రమించుకొని వాళ్లను భూమిలేని రైతులుగాను, వేతన కూలీలుగాను మారుస్తున్న క్రమానికి ఇది సాంస్కృతిక ప్రతిబింబమే తప్ప వేరే కాదు. ఈ క్రమం ప్రాచీనమయినదే అయినా ఇప్పుడు మరింత వేగంగా సాగుతోంది. ఫ్యూడల్ రాచరిక ప్రభువులకు అడవుల వల్ల ఉండే ఉపయోగాలు చాలా పరిమితమయినవి. సామ్రాజ్యవాదం అలా కాదు. అడవులలో కలప నుండి ఖనిజాల వరకు ఎన్ని రకాల వనరులుంటే అన్నీ సామ్రాజ్యవాదానికి కావాలి. అందుకే గత 150 సంవత్సరాలలో మారినంత వేగంగా గిరిజనుల జీవితం ఎన్నడూ మారలేదు. గతంలో కొన్నివేల సంవత్సరాల పరిణామ ఫలితంగా గిరిజనులు కూలీలగాను, రైతులగాను మారి వర్గ సమాజపు వర్ణచట్రంలో ఇరుక్కున్నారు. ఇవ్వాళ ఒక్క గని తవ్వకమయినా, ఒక్క ప్రాజెక్టు నిర్మాణమయినా, ప్లాంటేషన్ల కోసం అడవుల సంరక్షణ అయినా కొద్ది సంవత్సరాల వ్యవధిలోనే కొన్ని వేలమంది గిరిజనుల జీవితాలను అది ఛిన్నాభిన్నం చేస్తుంది. గోదావరి మీద ఇచ్ఛంపల్లి ప్రాజెక్టు నిర్మిస్తే

ఒక్క దెబ్బతో అక్కడి గోండు, కోయ తెగల జీవితాలలో అది రెండు శతాబ్దాల పరిణామాన్ని తీసుకొస్తుంది.

ఈ పరిణామం పట్ల ఇవ్వాళ చాలా విస్తృతంగా వ్యతిరేకత కనబడుతోంది. భౌతికవాద దృక్పథంతో చూసేవాళ్ళకు దీన్ని విమర్శించే విషయంలో ఎటువంటి సందేహం ఉండదు. కలప పరిశ్రమ, ఖనిజ పరిశ్రమ అభివృద్ధి చెందడం వల్ల దేశానికి లాభం కాబట్టి ఈ పరిణామాలను వ్యతిరేకించకూడదని పాలక వర్గాలు బోధిస్తాయి. అయితే ఈ ప్రాజెక్టుల వల్ల, ఈ కలప పరిశ్రమ వల్ల, ఈ గనుల తవ్వకం వల్ల 'దేశానికి' లాభం కలుగుతోందని అంగీకరించడం కష్టం. లాభపడుతున్నది 'దేశమే' అయితే మరి గిరిజనులు కూడా దేశంలో భాగమే కదా, వాళ్ళెందుకు నష్టపోతున్నారు? గిరిజనులకే కాదు, అడవుల సమీపంలో నివసించే సామాన్య గిరిజనేతరులకు కూడా లాభం కలగడం లేదు. లాభమంతా పెద్ద వ్యాపారస్తులకు, సామ్రాజ్యవాద దేశాలకూ కలుగుతోంది. అడవుల నుండి బయటకు వెళ్లే కలప అయినా, తునికయినా, బొగ్గు ఇనుము తదితర ఖనిజాలయినా అంతిమంగా ఎక్కడికి చేరుకుంటాయో, మార్గమధ్యంలో ఎవరెవరికి ఎంతెంత లాభాలు సమకూరుస్తాయో పరిశీలిస్తే ఈ 'దేశానికి లాభం' అనేది ఎంత బూటకమో అర్థమవుతుంది. అడవుల నుండి కూలివాళ్ళ ద్వారా సరుకును సేకరించే కాంట్రాక్టర్లు, ఫారెస్ట్ అధికార్లు, వాటిని అక్కడి నుండి రవాణా చేసే ట్రాన్స్‌పోర్ట్ కంపెనీల యజమానులు, ఆ సరుకును వినియోగించే టింబర్ మిల్లులు, బీడీ కార్ఖానాల నుండి ఇనుము ఉక్కు ముడిసరుకును వినియోగించే పెద్ద పరిశ్రమల దాకా – వివిధ పరిశ్రమల యజమానుల యజమానులయిన విదేశీ గుత్త పెట్టుబడిదారీ కంపెనీలు, ప్రభుత్వాలు – వీళ్లకే తప్ప 'దేశానికి' లాభం ఎంతమాత్రం ఉండదు. దేనివల్లనయినా 'దేశానికి' లాభం కలిగించే వ్యవస్థ మన దగ్గర లేదు. ఆస్తిపరులయిన దోపిడీ వర్గాలకు మాత్రమే ఈ వ్యవస్థ లాభం కలిగిస్తుంది. శ్రామికులకు లాభం అటుంచి వాళ్ళు చేసిన శ్రమకు సగం ఫలమే తప్ప పూర్తి ఫలం కూడా ఎప్పుడూ దక్కదు.

ఈ రకంగా భౌతికవాద దృక్పథంతో చూసేవాళ్ళే కాకుండా గాంధీవాదులు తదితర నానారకాల భావుకులూ కూడా ఈ మార్పును వ్యతిరేకిస్తున్నారు. దీనికి వాళ్ళలో చాలామంది చూపించే కారణమేమిటంటే గిరిజనుల సంస్కృతిని కాపాడాలన్నది. గిరిజనుల సంస్కృతిలోని 'ఉన్నత'మయిన లక్షణాలను వీళ్ళు ఎత్తి

చూపుతారు. పెట్టుబడిదారీ సమాజం పూర్తిగా నాశనం చేసిన కళాత్మక, సామూహిక జీవనం గిరిజనులలో ఇంకా ఉన్నాయి. వీటిని నాశనం చేయకూడదని, పదిలంగా కాపాడాలని, 'మనం గిరిజనుల నుండి నేర్చుకోవలసినది చాలా ఉందని' వీళ్ళు సవినయంగా చెప్తారు. భౌతిక జీవితాన్ని గురించి పట్టించుకోకుండా సంస్కృతిని గురించి మాట్లాడడం విచిత్రమయిన విషయమే అయినప్పటికీ, భౌతికవాదులు కూడా సంస్కృతిని తక్కువ చేయరు కాబట్టి గిరిజనుల సంస్కృతిని కొంత పరిశీలించవలసిన అవసరం ఉంది.

భౌతికంగా గిరిజనులలో మూడు రకాల తెగలుంటాయి. వేటమీద, ఆహార సేకరణ మీద (hunting and food-gathering) ఆధారపడి జీవించేవాళ్ళు, పశు పోషకులు (Pastoral Tribes), ఆహారాన్ని ఉత్పత్తి చేసేవాళ్ళు (Food-producers) మొదటి రకానికి చెందిన తెగలు ఇప్పుడు చాలా తక్కువ. ఉన్న కొద్దిమందీ బ్రిటీష్ వలస పాలన తాకిడికి తట్టుకోలేక 'వృత్తిదొంగల'గానో లేక అతి చవకగా పనిచేసే కూలీలగానో మారిపోయారు. వడ్డెర, ఎరుకల, యానాది తెగలు దీనికి మంచి ఉదాహరణ. పశుపోషకులలో చెప్పుకోదగ్గ తెగ నీలగిరి కొండలలోని తోడ తెగ. ఆహారాన్ని ఉత్పత్తి చేసే వ్యవసాయదారులయిన తెగలు మాత్రమే ఇప్పటికీ ఏదో ఒక మేరకు నిలిచి ఉన్నాయి.

ఆర్థిక జీవితం ఏదయినా, సామాజిక సంబంధాలలో మాత్రం గిరిజనులలో సమగ్రమయిన 'ఐక్యత' ఉంటుంది. దీనికి మూలం గిరిజనులలో భూమి, తదితర ఉత్పత్తి సాధనాలలో స్వంత ఆస్తి అనేది లేకపోవడం. బ్రిటిష్ పాలకులు దేశంలో ప్రతి గుంట భూమికీ ఒక యజమానిని గుర్తించాలని ఎంత ప్రయత్నం చేసినప్పటికీ ఈ సమిష్టి ఆస్తి సంబంధాల ఛాయలు గిరిజనులను ఇప్పటికీ వదలలేదు. ఎవరి వ్యవసాయం వాళ్ళదే అయినా సమిష్టి పద్ధతిలో చేసినట్టు అనిపిస్తుంది. అందరూ వ్యవసాయం ఒకేసారి మొదలుపెడతారు. దానికి చేయవలసిన పూజల తంతు గ్రామం అంతా కలిసి సమిష్టిగా చేస్తారు. పంట ఒకేసారి కోస్తారు. అంగడికి గ్రామం అంతా కలిసే పోతారు. పెళ్ళయినా చావయినా సమిష్టిగానే జరుపుకుంటారు. నిర్ణీత కాలంలో పండుగలూ వేడుకలూ కూడా ఉమ్మడిగా జరుపుకుంటారు. పంట వేసేటప్పుడు పండుగ, కోతలప్పుడు పండుగ, విప్పచెట్టు పూత వేసేటప్పుడు పండుగ, వేసవి తరువాత మొదటి వర్షం కురిసేటప్పుడు పండుగ.... ఇట్లా వాళ్ళ భౌతిక జీవితంలో ఒక్కొక్క ప్రముఖ సందర్భంలోనూ ఒక్కొక్క పండుగ గ్రామం అంతా

కలిసి జరుపుకుంటారు. కొన్ని పండుగల విషయంలో వాటి భౌతిక ప్రాముఖ్యతను స్పష్టంగా గుర్తించగా, కొన్నిటిని భీమదేవర పెళ్ళిగానో మరొక పురాణ పురుషుడి పుట్టుకగానో జరుపుకుంటారు.

గిరిజనుల జీవితంలోని ఈ 'కట్టడి' చాలామందిని ఆకర్షిస్తుంది. ఎందుకంటే సామ్రాజ్యవాద బూర్జువా సంస్కృతి నాగరిక సమాజాన్ని ముక్కలు ముక్కలు చేసింది. పక్కవాడు మన కళ్ళముందు చనిపోయినా మనం పట్టించుకోనంత ఒంటరి వాళ్ళను చేసింది మనల్ని. అందుకే ఈ సామ్రాజ్యవాద యుగంలో భావుకులు చాలామంది గిరిజన సంస్కృతిలోని సమిష్టితత్వానికి ఆకర్షితులవుతున్నారు. కాని గిరిజన సంస్కృతి ఇక్కడితో ఆగిపోదు. వాళ్ళ భౌతిక జీవితానికి ఉండే పరిమితులన్నీ అందులో ప్రతిఫలిస్తాయి. వాళ్ళకు ప్రకృతి గురించి ఉండే పరిజ్ఞానం చాలా పరిమితమయినది కాబట్టి చాలా విచిత్రమయిన భ్రమలు ఏర్పరచుకుంటారు. కదిలే ప్రతి వస్తువులోనూ (కొన్ని కదలని వస్తువులలో కూడా) తమకున్నట్టే ప్రాణం ఉందని భావిస్తారు. గాలిలో చెట్లలో నదులలో భూమిలో పైరులో ఉన్న ఈ 'జీవి'తో మంచిగా ఉండడం అవసరం అనుకుంటారు. దానికి తిండి పెడతారు. దానికి ఏ తిండి ఇష్టం అనుకుంటారో ఆ తిండి వెతుక్కొచ్చి పెడతారు. ఇదే క్రమంగా బలులకు (నరబలులకు సహితం) దారి తీస్తుంది. ఆ జీవిని ప్రసన్నం చేసుకోవడం కోసం నృత్యాలు చేసి పాటలు పాడతారు. గిరిజనుల నృత్యాలూ పాటలూ చాలావరకు ఈ రకంగా చిల్లర దేవతలను ప్రసన్నం చేసుకోవటం కోసమే. లౌకికమైన (సెక్యులర్) నృత్యంగాని, పాటగాని, కళగాని గిరిజనులలో అరుదు. అందుకే కొన్ని నృత్యాలు ఎప్పుడుబడితే అప్పుడు చేయమంటే చేయరు. నిర్ణీత సమయంలోనే నిర్ణీత పద్ధతిలోనే చేస్తారు.

ఒక్క నృత్యం మాత్రమే కాదు, అన్నీ నిర్ణీతమయిన పద్ధతిలోనే జరుగుతాయి. 'భయంతో బిగుసుకుపోవడం' అనే నుడికారం ఉంది. గిరిజనుల జీవితం అట్లా బిగుసుకుపోయి ఉంటుంది – భయంతో కాకపోవచ్చు గాని, తమకే అర్థం కాని విశ్వాసాలతో బిగుసుకుపోయి ఉంటుంది. పుట్టుక, పెళ్ళి, చావు, ఆట, పాట, వ్యవసాయం అన్నీ కూడా కచ్చితమయిన, నిర్ణీతమయిన పద్ధతిలోనే జరగాలి. ఏ మాత్రం తప్పినా ఉపద్రవం ముంచుకొస్తుంది. ఈ ప్రపంచాన్ని శాసించే అదృశ్యశక్తులను ప్రసన్నం చేసుకోవడం కోసం తామే ఏర్పరచుకున్న నియమాలు తమ నుండి పరాయికరణ చెంది ఈ ప్రపంచాన్ని నిలబెట్టే ఒక మానవాతీతమయిన చట్రంగా మారిపోతాయి. ఆ చట్రాన్ని కదిపితే ప్రపంచమే కూలిపోతుంది. ఈ

మానసిక స్థితిని అర్థం చేసుకోవాలంటే ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. మనలో ఆస్తికులైన వాళ్ళు కూడా తమ చుట్టూ ఎల్లప్పుడూ అదృశ్యశక్తులు మూగి ఉంటాయని నమ్మరు (రాత్రిపూట తప్ప). గిరిజనులు అట్లా కాదు. వాళ్ళ దృష్టిలో ప్రపంచమంతా అద్భుతమయిన అదృశ్య శక్తులతో నిండి ఉంటుంది. చివరికి తాము కూడా చనిపోయిన తరువాత ఎక్కడో దూరంగా ఉండే కైలాసానికో వైకుంఠానికో పోరు. వివిధ పేర్లతో పిలుచుకునే వారి మరణానంతరం నివాసస్థలం దగ్గరిలోనే ఉంటుంది. (సాధారణంగా నేలక్రింద 'పాతాళం'లో ఉంటుంది.) చనిపోయినవాళ్ళు అక్కడ జీవిస్తూ ఇక్కడి నిత్య జీవితంలో కలగజేసుకుంటూ ఉంటారు. (అందుకే భోజనం చేసేటప్పుడు – ముఖ్యంగా పండగలప్పుడు – చనిపోయిన పూర్వీకులకు రెండు ముద్దలు 'పిండం' తీసి పక్కకు పెడతారు.) ఈ అసంఖ్యాకమైన అదృశ్యశక్తులను ఎప్పటికప్పుడు మంచి చేసుకుంటూ ఉండాలి. వాటికి కోపం తెప్పించకూడదు. తమకు ఏదయినా మంచి జరిగినా అది ఈ అదృశ్యశక్తుల ఈర్ష్యకు గురికాకుండా ('దృష్టి' తగలకుండా) చూసుకోవాలి. కొన్ని తెగలలో పంట బాగా పండినా సరే ఆ విషయం బయటికి తెలిస్తే అదృశ్యశక్తుల దృష్టి తగులుతుందేమోనని ఒక పూటంతా రోదిస్తూ పంట నాశనమయిపోయిందని పాటపాడుతూ నృత్యం చేస్తారు.

సవర తెగ గిరిజనులు పెళ్ళి చేసే ముందు అమ్మాయికి మొదట విల్లంబుతో పెళ్ళిచేసి, దానిని నదిలోకి పారేసి, ఆ విధంగా అమ్మాయి 'విధవ' అయిన తరువాతే పెళ్ళిళ్ళు చేస్తారు. ఆ ఆటవిక ఆచారాలు ఫ్యూడల్ దశలో కూడా చాలావరకు కొనసాగాయి. కాబట్టి ఇవన్నీ ఏదో ఒక రూపంలో మనకు కూడా పరిచయమే. (చిన్న పిల్లలను అందరూ ముద్దు చేస్తే 'దృష్టి' తగులుతుందని భయపడి చీపురుకట్ట కాల్చి బూడిదతో బొట్టుపెట్టి వీలయినంత అంద విహీనంగా తయారుచేస్తాము.) ఈ 'దృష్టి' భయం ఎంతగా ఉంటుందంటే గిరిజనులు ఏ వ్యవహారాన్నీ సూటిగా ప్రస్తావించరు. సూటిగా ప్రస్తావించడం అహంకారాన్ని సూచిస్తుంది. అది అదృశ్యశక్తుల ఆగ్రహానికి గురయి వ్యవహారం బెడిసి కొడుతుంది. (ఇది కూడా మన ఫ్యూడల్ సంస్కృతిలో ఇప్పటికీ ఉన్న వైఖరే. సూటిగా, 'బిజినెస్‌లైక్'గా వ్యవహరించడం బూర్జువా అలవాటు.) ఉదాహరణకు పెళ్ళి సంబంధం కుదుర్చుకోవడానికి అబ్బాయి తల్లితండ్రులు అమ్మాయి ఇంటికి వస్తే ఇరుపక్షాలు అసలు పెళ్ళిమాట ఎత్తరు. పక్షుల మీద, పశువుల మీద పెట్టి మాట్లాడతారు. కమలాదేవి ఛటోపాధ్యాయ (Tribalism in India అనే పుస్తకంలో) ఒక ఉదాహరణ ఇస్తుంది.

"ఎవరు మీరు?" అని అమ్మాయివైపు వాళ్ళు గదమాయించి అడుగుతారు.

"మేము అడవుల లోపల వేటాడే వేటగాళ్ళం. ఇవ్వాళ మేము కొట్టన జింక పారిపోయి మీ ఇంట్లో దాక్కుంది" అని సమాధానం ఇస్తారు.

"అటువంటిదేం లేద"ని వీళ్ళు అంటారు.

"మేము జింక రక్తపు మరకలను వెంబడించి వచ్చాము. ఇదిగో మీ ఇంటి తలుపు దగ్గర రక్తం మరకలు, మా జింకను మాకు ఇచ్చేయండి" అంటారు.

"మా యింట్లో మేము చిన్నప్పటి నుండి పెంచుకున్న జింక మాత్రమే ఉంది. మీరు కొట్టిన జింక లేదు" అని వీళ్ళు అంటారు. ఈ విధంగా కొంత వాదన జరిగిన తరువాత అమ్మాయి తరఫువాళ్ళు లొంగుతారు. "అయితే మీ జింకే అయి వుండాలి. మీకు ఇచ్చేయక తప్పదు. కాని ఒకటి గుర్తుంచుకోండి. మేము దాన్ని చాలా కష్టపడి పెంచాం. దాని తల్లి పుష్కలంగా పాలిచ్చేది. మీ దగ్గర చేలూ అడవులూ సమృద్ధిగా ఉంటే తప్ప అది సుకంగా ఉండదు" అంటారు. దానికి అబ్బాయి తల్లిదండ్రులు "మా దగ్గర అడవులూ చేలూ సమృద్ధిగా ఉన్నాయి" అని హామీ ఇచ్చి స్త్రీ ధనం ఎంత ఇచ్చేది మాట్లాడుకొని పోతారు.

కళ విషయం కూడా అంతే. గిరిజనుల జీవితం చాలా కళాత్మకంగా ఉండే మాట వాస్తవమే. పాట, నృత్యం, అలంకరణ వాళ్ళ జీవితాలను పెనవేసుకొని ఉంటాయి. వాళ్ళ కళకూ శ్రమకూ మధ్య ఉండే సన్నిహితమయిన సంబంధాన్ని జార్జి థామ్సన్ లాంటి వాళ్ళు గుర్తించారు. కళ వాళ్ళు శ్రమలో పొందే ఆనందాన్ని వ్యక్తం చేస్తుంది. అలసటను మరిపిస్తుంది. శ్రమ చేయడానికి కావలసిన ఉత్తేజాన్ని ఇస్తుంది. వారి కళలలో ఉండే లయ (rhythm) వారి శారీరక శ్రమలోని లయ నుండి పుట్టిందేనని థామ్సన్ అంటాడు. ఈ కారణం చేతనే – బూర్జువా సమాజంలో కళ శ్రమ నుండి పూర్తిగా వేరుపడి మార్కెట్‌లో సరుకుగా మారడంతో అసంతృప్తి చెందిన భావుకులు చాలామంది ఆటవిక జీవితాన్ని ప్రశంసిస్తారు. కాని ఇక్కడ కూడా గుర్తుంచుకోవలసిన విషయం ఒకటి ఉంది. గిరిజనుల నృత్యం, పాట, చిత్రలేఖనం, అలంకరణ మొదలైన కళలకు శ్రమ సంబంధమయిన ఆనందంతోను, అలసటతోను, ఉత్తేజంతోను ఉండే సంబంధం అవ్యక్తమయినది (Implicit). కళ యొక్క వ్యక్తమయిన (explicit) పాత్ర, అంటే దాని సామాజిక పాత్ర, గిరిజనుల జీవితంలో దాని ప్రాముఖ్యత వేరే

ఉంది. అదేమిటంటే వాళ్ళు నమ్మిన దేవతలను ప్రసన్నం చేసుకోవడం ద్వారా గానీ, మంత్రం (మేజిక్) ద్వారా గానీ శ్రమ ఫలాన్ని ఇనుమడింపజేయడం.

వేటాడే గిరిజనులు తమ ఇళ్ళ గోడలమీద జంతువులను వేటాడి చంపుతున్నట్టు బొమ్మలు వేస్తారు. వ్యవసాయం చేసేవాళ్ళు పంట చేతికొచ్చే సమయం ఆసన్నమయితే పంట కోస్తున్నట్టు అభినయిస్తూ నృత్యం చేస్తారు. ఇందులో తమ శ్రమకు కళాత్మక రూపం ఇచ్చుకోవడం అనే మానవీయ ప్రక్రియ అవ్యక్తమయినది. దానివల్ల వాళ్ళు పొందే ఉత్తేజం కూడా అవ్యక్తమయిన ఫలమే. వీటి వ్యక్తమయిన ప్రయోజనం గిరిజనుల మూఢనమ్మకాలతో ముడిపడి ఉంటుంది. వేట జంతువులను చంపుతున్నట్టు బొమ్మ వేస్తే నిజంగానే ఆ ఫలితం దక్కుతుందన్న నమ్మకం గిరిజనులలో ఉంటుంది. పంట కోస్తున్నట్టు అభినయిస్తే పంట నిజంగానే పుష్కలంగా పండుతుందని ఆశిస్తారు. ఆదిమ మానవ మనస్తత్వం ఒక వస్తువుకూ ఆ వస్తువు యొక్క ప్రతిరూపానికీ (అది చిత్రపటం గాని, నృత్య అభినయంలోని దృశ్యమే గాని, చివరికి కృత్రిమంగా తాము ఏర్పరచుకున్న సంకేతాలయినా గాని) తేడా చూడదు. ప్రతిరూపానికి ఏం జరిగితే వస్తువుకూ అదే జరుగుతుందని నమ్ముతుంది. ఇది చాలా ఆదిమమయిన మంత్రం. (ఇంగ్లీష్‌లో sympathetic magic అంటారు. చేతబడి దీని అవశేషం.) తరువాతి కాలంలో చిలవలు పలవలై అభివృద్ధి చెందిన మంత్రతంత్రాలన్నిటికీ మూలం.

గిరిజనుల కళా జీవితమంతా కూడా ఇంతే. ముగ్గులు పెట్టడంలో ఉన్న సౌందర్య దృష్టి అవ్యక్తమయింది. వాటి అసలు ఉద్దేశ్యం దుష్టశక్తులను దూరంగా ఉంచడం. అలాగే పచ్చలు పొడిపించుకోవడంతో వాళ్ళ అసలు ఉద్దేశం చనిపోయిన తరువాత దయ్యాలు తినకుండా శరీరాన్ని కాపాడుకోవడం. మరి వీటిలో కళ లేదా, సృజనాత్మకమయిన ఆనందం లేదా అంటే ఉన్నాయి. కాని ఆ కళ, ఆ ఆనందం వాళ్ళ విశ్వాసాల పరిభాషలోనే రూపం తీసుకుంటాయి. గిరిజనుల ఆలోచనలలో వాళ్ళ విశ్వాసాలు ఎంత బలంగా అల్లుకుపోయి ఉంటాయంటే వాళ్ళ శ్రమను, కళాకాంక్షను, సృజనాత్మకతను, విశ్వాసాలను వేరు చేయడం సాధ్యం కాదు. కళను నిజంగా శ్రమ యొక్క ప్రత్యక్ష వ్యవస్థీకరణగా ఒక గిరిజనుడు సృష్టించదల్చుకొన్నా అది అతని విశ్వాసాల నుడికారంలోనే రూపం తీసుకుంటుంది. అంతిమంగా ఆ నుడికారంలోనే అతనికి అది అర్థవంతమవుతుంది.

ఈ నుడికారం నుండి గిరిజనుల జీవితాన్ని వేరుచేయటం సాధ్యం కాదు. ఈ విశ్వాసాలను తొలగించి వాళ్ళ సమిష్టి జీవనాన్ని, కళాత్మక జీవితాన్ని మాత్రమే కాపాడాలనుకోవడం అర్థరహితం. గులాబి పువ్వు నుండి గులాబి రంగు తొలగించటం లాంటి ప్రయత్నం అవుతుంది అది. గిరిజనుల జీవితంలోని భౌతిక వెనుకబాటుతనమే వాళ్ళ జీవితాలలో మనకు కనిపించే 'ఉన్నత' లక్షణాలకూ మూఢ విశ్వాసాలకూ రెండింటికీ కూడా కారణమని గుర్తించాలి.

కాని ఆ భౌతిక జీవితం మారవలసింది కాంట్రాక్టర్ల ద్వారా, కలప వ్యాపారస్తుల ద్వారా, సామ్రాజ్యవాద దళారీ పెట్టుబడుల ద్వారా, గిరిజనేతరుల భూ ఆక్రమణల ద్వారా, ఇతర దౌర్జన్యాల ద్వారా కాదు. దానివల్ల గిరిజన సంస్కృతిలోని మానవీయ అంశ నాశనమవుతుందే తప్ప వాళ్ళ భౌతిక జీవితమూ అభివృద్ధి కాదు, వాళ్ళ మూడవిశ్వాసాలూ నాశనం కావు. ఈ దేశ సంపద మొత్తాన్నీ శ్రామికుల పరం చేసే విప్లవంలో గిరిజనులు భాగం కావాలి. ఆ విప్లవం విజయవంతమై, ఒక్క అడవులలోనే కాదు, దేశవ్యాపితంగా సమిష్టి జీవనాన్ని నెలకొల్పి కళనూ సంస్కృతినీ బజారు నుండి బయటకు తెచ్చి తిరిగి శ్రామికుల పరం చేసినప్పుడే దేశంలోని అందరితోపాటు గిరిజనులు కూడా తమ సంస్కృతిలోని మానవీయ లక్షణాలను కాపాడుకోగలుగుతారు. తమ సంస్కృతిలోని ఉన్నత లక్షణాలను కాపాడుకోగలుగుతారు. గిరిజనుల సంస్కృతిలోని ఉన్నత లక్షణాలు కాపాడబడాలంటే అవి మొత్తం సమాజంలో నెలకొల్పబడాలి. అంటే సమాజాన్ని మొత్తం ఆటవికులను చేయటం కాదు. ఇవ్వాళ కొందరు దోపిడీదారుల ఆస్తిగా ఉన్న విజ్ఞానం అందరి సంపదా కావాలి. ఈ సంపద ప్రాతిపదికగా, కొందరు సంపన్నులుగా ఉండే సమాజం కాక మొత్తం సంపన్నమయ్యే సమాజం ఏర్పడాలి. ప్రకృతిని చూసి భయపడవలసిన అవసరం పోవాలి. ఆ ఉన్నతమైన మానవీయ స్థాయిలో తిరిగి సమిష్టి జీవనాన్నీ కళాత్మక జీవితాన్నీ ఇతర మానవీయ విలువలనూ సాధించాలి.

**(ఆదివాసులు–వైద్యం–సంస్కృతి–అణిచివేత గ్రంథం నుండి....)**



# ౨౦. సమైక్యతకు ప్రతీక జానపద సంస్కృతి

- కీ॥శే॥ యాసలపు సూర్యారావు
(సాంస్కృతికోద్యమ కార్యకర్త)

మనది వ్యవసాయక దేశం. మన దేశంలోని కళలు, సంస్కృతి, సాంప్రదాయాలు అన్ని వ్యవసాయమే ప్రధాన జీవనాధారంగా గల మానవుల చుట్టూ వారి జీవన వేదంలో గల అంతర్భాగాలై అల్లుకుపోయాయి. ప్రాచీనమైనవి, జానపద సంస్కృతికి ఆలవాలమైనవి. ఆదిమ కాలపు అవశేషాలకు అద్దం పట్టేవి అమ్మవారి సంబరాలు, జాతరలు. ఈనాటికీ మన చుట్టూ నిత్యం జరుగుతున్న జాతర్లను మనం తిలకించినట్లయితే మన సంస్కృతిలో గల ఆప్యాయతను, అనురాగాల మేళవింపును చూడ గలుగుతాం. ఆదిమ సమాజంలోని మాతృస్వామిక వ్యవస్థలోని గణాలలో గల జనాల మధ్య సమిష్టితత్వం ఉండేది. ఆనాడు అందరూ సమిష్టిగా వేటాడి తెచ్చిన ఆహారాన్ని (మాంసాన్ని) ముందుగా దేవతలకు పెట్టి తరవాత అందరూ సమిష్టిగా, తృప్తిగా తినేవారు. ఆనాటి మాతృస్వామిక వ్యవస్థలో రూపుదిద్దుకున్నది అయినా కాలక్రమంలో గ్రామదేవతలుగా రూపాంతరం చెందడం జరిగింది. నేటికి ఆయా ప్రాంతాల ప్రజల మనోభావాలకు అనుగుణంగా పల్లెల నుండి పట్టణాల వరకూ వివిధ రకాల పేర్లతో ఎంతోమంది గ్రామదేవతలు ఆరాధించబడుతున్నారు.

ప్రసిద్ధి చెందిన గ్రామదేవతలు బెజవాడ కనకదుర్గ, అనకాపల్లి నూకాలమ్మ, విజయనగరం పైడితల్లమ్మ, భీమవరం మావుళ్ళమ్మ, పెద్దాపురం మరిడమ్మ, తెలంగాణాలో ప్రసిద్ధి చెందిన సమ్మక్క-సారక్క... ఇంకా మరెందరో! ఇటువంటి అమ్మవార్ల జాతర్లకు ఇప్పటికీ తెలుగునాట జనం తండోపతండాలుగా వెళ్ళడం జరుగుతుంది. ఇలాంటి జాతర్లకు అనాదిగా వస్తున్న ఆచారంగా మేక, గొర్రె, కోడి వంటి జంతువులను బలివ్వడం జరుగుతుంది. ప్రతివారూ జాతర్లలో వీరితోపాటుగా ఎక్కడెక్కడున్న వారి బంధుమిత్రులను ఆప్యాయంగా పిలిచి మరీ ఆ జాతర్లకు వెంట తీసుకువెళ్తారు. జాతర్లు జరపడంలో కూడా సంస్కృతి సాంప్రదాయాలు వెల్లివిరుస్తాయి. కొన్ని ప్రాంతాల్లో పెద్దపెద్ద ప్రభవలను అందంగా అలంకరించి జట్టుజట్లుగా బాజాభజంత్రీలతో ఊరేగింపుగా తరలివస్తారు. మరికొన్నిచోట్ల బలివ్వదలచిన మేక, గొర్రె, కోళ్ళను తీసుకొని వాటికి పసుపు, కుంకుమ రాసి ఉపవాసం ఉండి, తెల్లవారి తలంటు స్నానం చేసి దీపంతో వేపకొమ్మలు చేతబూని, పూనకంతో డప్పుల వాయిద్యాలతో బంధుగణాన్ని వెంట తీసుకొని అమ్మవారి దగ్గరకు వెళతారు. ఈ విధంగా వివిధ రకాల పద్ధతుల్లో గ్రామదేవతల గుడికి చేరిన తరువాత జంతువులను

బలిచ్చి, పిండివంటలు, భోజనాలు వండి అమ్మవారికి నైవేద్యం పెట్టిన తరువాత, అందరూ సమిష్టిగా, సంవృద్ధిగా భోజనం చేస్తారు. ఇక్కడ పెద్దా చిన్నా అని తేడా లేకుండా అందరూ కలసి వారి స్తోమతకు తగినట్టుగా కార్యక్రమం జరుపుకుంటారు. ఇలాంటి జాతర్లలో పాల్గొనేవారు గ్రామీణ ప్రాంతాలవారే అధికంగా ఉంటారు.

ఇప్పటికి పాశ్చాత్య సంస్కృతిని వంటి నిండా, ఇంటినిండా పులుముకొని మెదళ్ళను విదేశీ విషసంస్కృతికి తాకట్టు పెట్టిన మహా నగరాలలోని వారికి వీటిపై ఆసక్తి అంతగా కనిపించదు. వీరిలో చాలామందిని మనం జాతర్ల గురించి కదిపితే అదంతా అనాగరికులు జరిపేవని, వీరు చాలా అజ్ఞానులు అనే విధంగా మాట్లాడడం మనం చూస్తాం. వీరు జాతర్లలోని ప్రజలను వారి ఆప్యాయత, అనురాగాలను, భారతీయ సంస్కృతిని వారు ఎంతగా ప్రేమిస్తున్నారో నాగరికులం అని చెప్పుకునేవారు గ్రహించరు. ఇప్పటికి మనం జాతరలను సందర్శించినపుడు అక్కడ గ్రామీణ ప్రజలు వాడే అచ్చమయిన తెలుగు భాషకు చెందిన గొప్పతనం, భాషలోని భావం, ప్రకృతి సౌందర్యాన్ని పులకింపచేసే సహజ సౌందర్యాన్ని ఆ ప్రజల మధ్య అరమరికలు లేని పలకరింపులను మనం చూస్తాం. ప్రాంతాలవారీగా వినసొంపుగా ఉండే తెలుగు మాండలికాల మాధుర్యం చెప్పనలవి కాదు.

జాతర్లలో కనువిందుచేసే, వీనుల విందు గొలిపే జానపద కళా సాంప్రదాయాలు మనలను అబ్బురపరుస్తాయి. సినిమాలు, టీవీలు, ప్రచార మాధ్యమాల పుణ్యమా అని మన జానపద కళా సంస్కృతిని మర్చిపోతున్నాం. జానపద కళలు, జాతరలు మన జాతి సంపదని, అది మన కీర్తి ప్రతిష్టలను అంతర్జాతీయంగా నిలపగల మహోన్నత సంపద అనే స్పృహలేకుండా పోతున్న కాలంలో గ్రామీణ జాతరలు సైతం లేకపోతే మన డప్పు, మన డోలు, గరడి, సన్నాయి, గంగిరెద్దు, తప్పెట్లు, కోలాటం, కోయాట, తంబుర కథ, వీరనాట్యం, తోలుబొమ్మలాట, బుట్టబొమ్మలు, కళారూపాలు పూర్తిగా కనుమరుగైపోయేవి. మన సంస్కృతి, సాంప్రదాయాలను దేశం నలుమూలలా తిరిగి చాటి చెప్పింది ఈ జానపద కళాకారులే. అందుకే ప్రతి జాతరకు పిల్లలను సైతం తీసుకొని ఎందుకు వెళ్ళాలి అంటే మన సంస్కృతి సాంప్రదాయాల వారసత్వాన్ని రేపటి తరానికి తెలియపరచాలి కాబట్టి. విదేశీ సంస్కృతి దాడి నుండి మన సంస్కృతిని కాపాడుకోవాలి కాబట్టి.

**(యాసలపు జనపదాలు గ్రంథం నుండి....)**



# మనమేం చేయొచ్చు?

జీవితాన్ని అనుభూతి చెందటం, ఆ అనుభవాన్ని నిర్వచించుకోవడం, వ్యాఖ్యానించుకోవడమే సంస్కృతికి ప్రధానమన్న జమైకన్ మేధావి, ఆలోచనాపరుడు స్టార్ట్‌హాల్, వ్యక్తి సమాజంతో సంబంధం ఏర్పర్చుకోడానికి చేసే నిర్మాణమే సంస్కృతి అంటాడు. ఆర్భానా విశ్వవిద్యాలయంలో సాంస్కృతిక అధ్యయనాల గురించి బోధించడమే కాక ఎన్నో ప్రసంగాలు కూడా చేసిన హాల్ విద్యాధికుల, ఉన్నత వర్గాల ఊసుపోలు కళలు, సంగీతాలు సంస్కృతి కాలేవంటాడు.[1]

అలాగే అత్యున్నత ప్రపంచ మేధావిగా పేరొందిన రేమండ్ విలియమ్స్ **'సంస్కృతి సామాన్యమైనది'** (Culture is ordinary) అంటూ ఏకంగా శోధననే ప్రచురించాడు. మార్క్సిజం–సంస్కృతి అనే అంశంపై విలియమ్స్ రచించిన గ్రంథాలు ఎంతో ప్రసిద్ధి చెందాయి. ప్రఖ్యాత ఆంగ్ల రచయిత టి.యస్. ఇలియట్ రచన "Notes towards definition of culture"తో విభేదిస్తూ 'సంస్కృతి సాధారణమైదే కాని ప్రత్యేకమైంది కాద'న్న రేమండ్, కళలపై ప్రజాతంత్ర దృక్పథం అవసరమంటూ గొంతెత్తినవాడు.[2]

ఇలా సంస్కృతిని ప్రజాస్వామీకరించే పనిని చేస్తున్న వారందరి గురించి అయినంతలో తెల్సుకోవడం, సంస్కరణోద్యమాలు మొదలుకొని సమూల మార్పు ఉద్యమాల వరకు అన్ని ప్రాంతాల స్థానిక సంస్కృతుల్ని ఇముడ్చుకొని ముందుకెళ్ళడం ఈరోజు చాలా అవసరం. భిన్న రంగాల్లో కృషి చేస్తున్న సాంఘిక శ్రేయోభిలాషుల పట్లా, వివిధ ఉద్యమ స్రవంతుల పట్లా సహానుభూతి ప్రకటించడంతో బాటూ అంగీకరించినంతమేర విభేధాల్ని పక్కకుపెట్టి కల్సి పనిచేయగల వాతావరణాన్ని నిర్మించుకోవడం నేటి సాంస్కృతిక కర్తవ్యం.[3]

అత్యాశ, వస్తు వినిమయం, ఆధిపత్యం, అసమానతల పెరుగుదల అక్రమంగా కొనసాగుతున్న వర్తమానంలో అర్ధవంతమయిన ఆలోచనా దృక్పధం, కుదిరినంతలో సాదాసీదా జీవనం, ప్రజాస్వామిక నడవడిక, సమానత్వంతో కూడిన మానవ సంబంధాల కొరకు ఆకాంక్షలు మాత్రమే మానవీయతను పెంపొందించగలవు.[4]

ఏ వ్యవస్థలోనయినా విద్వేషం, విగ్రహారాధన, గుడ్డిభక్తి, వ్యక్తివాదం, స్వార్ధం మొదలయిన భావనలకి విరుద్ధంగా ప్రేమ, సమిష్టితత్వం, హేతుబద్ధ వైఖరి, త్యాగం

మొదలగు గుణాల్ని నిర్మించుకోవడమే ముఖ్యం. అందుకోసం ఎక్కడికక్కడ బృందాలుగా ఏర్పడి ఇందుకోసం చర్చించుకోవడం, భావ సంఘర్షణకు తెరతీయడం చేయాలి. భావాలుండటమే నేరమౌతున్న వేళ నిబద్ధతతో కూడిన మేధోమథనం తప్పనిసరి. అందులో భాగంగా ఎవరికి చాతనైన పద్ధతిలో వారు చివరివరకూ నిజాయితీగా ప్రయత్నించడమే సాంస్కృతిక వికాసానికి మార్గం.

డి.డి. కోశాంబి, రాహుల్ సాంకృత్యాయన్, రోమిలా థాపర్ మొదలుకుని సురవరం, కంబంపాటి, ఏటుకూరి... ఇంకా ఎందరో సంస్కృతిని గురించి చర్చించినవారున్నారు. వారి కృషిపై ఎనలేని గౌరవం ఉన్నప్పటికీ నా పరిమితి దృష్ట్యా ఇదిక్కడితో ముగించాల్సి వచ్చింది.

విమర్శలకు ఆహ్వానం, సెలవు.



**ఫుట్ నోట్స్ :**

1. ఆయా అంశాలపై ఈయన భావాలు Cultural Studies - A theoretical history గా వెలువడ్డాయి.
2. 1958లో ఇతని రచన Culture is ordinary వెలువడింది. ఈ అంశంపై అంతర్జాలంలో వివరాలు దొరుకుతాయి.
3. వ్యక్తిగతంగానూ, సంస్థాగతంగానూ ఎవరి స్థాయిలో వాళ్ళు ముందుకొచ్చి ఇందులో భాగం కావొచ్చు. ఉదాహరణకి మొన్నీమధ్య బెర్ట్రోల్ట్ బ్రెష్ట్ జయంతి సందర్భంగా ఆయన జీవితం గురించి సామాజికవేత్తా, శాస్త్రవేత్త గౌహర్ రజా ఎప్పుడో రూపొందించిన "జుల్మతోంకీ దోర్‌మే" (In dark times) అనే డాక్యుమెంటరీని ప్రదర్శించుకుని స్థానికంగా ఫిల్మ్ సొసైటీ ఏర్పాటు చేసుకున్నాం. ఇలా ఎవరి పరిధిలో వాళ్ళు ప్రయత్నించొచ్చు.
4. యూనివర్శిటీ ఆఫ్ మసాచుసెట్స్ ప్రొఫెసర్ సట్ జలీ (Sut Jhally) ప్రసార మాధ్యమాలు, సంస్కృతి, సామాజికాంశాలపై ఎంతో కృషి చేసారు. ఆయన వీడియోలు అంతర్జాలంలో అందుబాటులో ఉన్నాయి.